దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జూలై — 1957
దేశీప్రెస్, విజయవాడ

సాదాప్రతి: రు. 4—0—0
లైబ్రరీప్రతి: రు. 5—0—0

---

సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# ఒక మాట

ఈ ఉత్తరాలు నేను దాచటానికి కారణం — నాకు కీర్తి తెచ్చుకుందామని కాదు, వెంకటచలంగారికి కీర్తి తెద్దామనీ కాదు. నేను ప్రేమించిన స్త్రీల్లో వెంకటచలంగారు ముఖ్యులు. నా ప్రేమకుటుంబములు ప్రేమ ఆయన్నించి నాకు కావలసినంత దొరికింది. ఆయన ఉత్తరాల్లో నిష్కాపట్యమూ, ప్రేమా, హాస్యమూ, హృదయవేదనా సాక్షాత్కరించాయి. పై కారణాలవల్లనే వారి ఉత్తరాలు దాచాను. అవి ఎప్పటికైనా ముద్రిస్తారని కూడా నే ముఖ్యంగా అనుకోలేదు.

ఈ ఉత్తరాలు చదివితే వెంకటచలంగారి హృదయానికి సమీపముగా పోవచ్చు. దాని రోషమూ వైశాల్యమూ తెలుసుకోవచ్చు. వారిని సారస్వత కృషికి పురికొల్పిన ప్రోత్సాహం ఇందు గమనించవచ్చు.

అరమరిక లేకుండా నిర్భయంగా మనుష్యుల్ని గురించి సంస్థల్ని గురించి చర్చించుకొనేందుకు ఉత్తరాల్లోనే సావకాశం ఉంది. అట్టి చర్చలూ – అభిప్రాయాలూ – ఈ ఉత్తరాల్లో ఉన్నవి. కొన్ని ఘాటుగా కూడా ఉన్నవి. మా ఇద్దరికీ మిత్రులైన సమకాలికులూ ఇతరులూ చదివి క్షమించాలని ఆశిస్తాను.

నావల్ల వెంకటచలంగారికి ఉపకారం జరిగిందని అనుకుంటారేమో! ఇర_ ఏళ్ళనుంచి మేము అన్యోన్యంగా ఉంటున్నాము. ఒకరొకర్ని ఆశించిందేమీలేదు. ఆ మైత్రిలో వెలుగులే గాని నీడలు లేవు. నేను వారికేవిధంగానైనా ఉపకరిస్తే వారు నాకూ అంతగా ఉపకరించారని నా నమ్మకం. ఈ ఉత్తరాలు కూడా అందుకు సాక్ష్యం చెప్పుతవి.

వెంకటచలంగారు నేడు వేదాంతమార్గాల్లో వెలుగు నన్వేషించ పూనుకొన్నారంటే పూర్వజన్మలో వారెంత సాధన చేసివుండాలో తపస్వులకు తెలుస్తుంది. ఆ అన్వేషణ తెలుగు సారస్వతానికి నూతనాలంకారాలు తెచ్చి పెట్టుతోంది కూడా.

—చింతా దీక్షితులు

# చలం ఉత్తరాలు

*Dear Friend,* నానస్‌పేట — పూనా

4—7—27

'సఖి'లో ప్రచురించిన మీకథల కన్నిటికీ మిమ్మల్ని అభినందిస్తున్నాను. ముఖ్యంగా 'బంచురాణి'. ఉపోద్ఘాతం ప్రయత్నించి వ్రాసినట్లుంది. స్పష్టంగా చిన్నపిల్లలికి వ్రాస్తున్నాననే ధ్యాస మీ మనసుని విడవలేనట్టు కనిపిస్తుంది. మనుష్యుల సహజ భావాల్ని (emotions) చిత్రిస్తే మీరు, నాకింకా బాగుండేది. కాని అది నా fad. వస్తుతేనేం, కథ చాలాగొప్పగావుంది. Settings చాలా అందంగా వున్నాయి. కథ చెప్పేపద్ధతి simple గా naive గా వుంది. చక్కనిస్తాయి.

కృష్ణశాస్త్రిగారి పద్యాలుతప్ప ఆ పత్రికల్లో తక్కినవంతా చెత్త.

౨

*Dear Friend,* గుంటూరు

16—11—28

శాస్త్రిగారి పుస్తకం (ఊర్వశీప్రవాసం) అచ్చయింది. నాతార సంగతి ప్రకటిస్తున్నారు దాంటో. మీ శబరినికూడా కావ్యావళికి ఇమ్మని అడుగుతారట.

(నాకథలమీద పత్రికల్లో వ్రాసే) విమర్శనలు చాలా ఉల్లాసంగా వుంటాయి. నాకు— దేశానికి జ్ఞానబోధకంగావుంటాయి.

మొత్తానికి అశ్లీలాలువ్రాసే వెంకటచలం అనేవాడు ఇంకా ఉన్నాడని జ్ఞాపకంచేస్తోవుంటాయి.

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికవాళ్ళు కథ పంపమని అడిగారు నన్ను.

## Three cheers to Mr. G V.

కవులవాక్కు జాడ్యం, అజీర్ణం, నన్నుగూడా పట్టుకొన్నాయి. కనక ఇంతకాలం పనిచేసి శ్రమచెందానని పెన్షన్ తీసుకుందామని ఆలోచిస్తున్నాను. నేను వెళ్ళిపోతానంటే, నాకు రావలసిన దానికన్న కొంచెం ఎక్కువ పెన్షను ఇస్తారనుకుంటాను, సంతోషించి.

ఇన్నాళ్ళు మీరువ్రాయకపోవటం నన్ను బాధపెట్టినా, మీకార్డు చాలా మనోరంజకంగావుంది.

సుబ్బారావు నన్ను భీమాచెయ్యమని ప్రాధేయపడుతున్నాడు. ఒకసంగతి—సహారాలో కలుపు తవ్వడానికీ, Iceland లో పాముల్ని పట్టడానికీ, ప్రిన్సిపాల్ రామకృష్ణరావుగారినించి చందా వసూలు చెయ్యడానికీ, కోమటిస్త్రీలలో అందాలు వెతకడానికీ, ఎవరన్నా మనిషి కావలిస్తే, భీమా ఏజంటుని నియమించండి. పని జరిగితీరుతుంది.

సుబ్బారావు అనేపేరు భయోత్పాతమయింది. క్లాసులో సుబ్బారావు అని హాజరుపిలిస్తేనా, నాగుండె ఒక గజం ఎగురుతుంది. నేను రేపు చచ్చిపోతున్నాననీ, భార్యాపిల్లలూ ఎల్లుండినించి మాడిపోతారనీ వొణుకు పుడుతుంది. భీమా

సుబ్బారావు నాముందు నుంచుని వేలు ఆడిస్తో, "నేను ముందే చెప్పలేదూ ?" అంటున్నట్టు వుంటుంది.

నా పుస్తకానికి పీఠిక వ్రాసిన శ్రీ శివశంకరశాస్త్రిగారి అవస్థయూహించగలరా మీరు ?

విమర్శకులు ఏమంటున్నారు ?

"సరేలే. ఆ crank లాంటి పుస్తకం వ్రాశాడనుకో. దాంట్లోకి వెళ్ళి ముందడి వ్రాస్తావని మీ చెప్పావేనా అనుకున్నామా ? కాని, మర్యాదస్తుడవు, బుద్ధిమంతుడవు, నువ్వూ, సైగా లాంటివన్ని సమర్థిస్తావా ? సొంత వేసుకున్నావా ? Heresy లో చచ్చి స్వర్గం లో లోతుకి మునిగిపోయినావే ?" అంటున్నారు పాపం.

## 3

తెనాలి

25—1—29

నేను చాలా sensitive. ముఖ్యం స్నేహితులవిషయమై. కొన్ని సమయాల వాళ్ళని సరిగా అర్థంచేసుకోను. మిమ్మల్ని ఎప్పుడూ గౌరవంగా ఎంచుతున్నాను—నా ఉపయోగం కోసం కాదు—నేను చూసిన వాళ్ళల్లో Generally as one of the thoroughly nice guileless persons(few they are) కాని యీ మధ్య మీకు తెలీకుండానేనేమో, మీరు మీ ఉత్తరాల్లో నన్ను దెప్పుతున్నట్టు కనపడ్డది. నేనేమన్నా చేశానా ?

మీకు బాగా తెలిసినఆయన ఒకరు నాకథల్ని మీరు వెక్కిరిస్తున్నారని చెప్పారు. కాని ఆయనమాటల్ని ఏమా

త్రమూ నమ్మడానికి వీలులేనిమనిషి. నాకథల్ని తిట్టడం అప రాధమనికాదు కాని, మీ ఉద్దేశ్యం మారితే, నాకు సంతోషించి చేసి వుండేవారేకాదా అనుకుంటాను. పైగా నేను సేమిచర్య వ్రాసినవాటి విషయమై మౌనంగా వూరుకున్నాను కావాలను మీరు.

మిమ్మల్ని శిష్యుణ్ణి చేసేటంత గొప్పకేసు చేశానా లేదా ? మీనించి నాకు సంజాయిషీకోసం కాదు. కాని నా మనసులో ఉన్నది వ్రాసేస్తాను.

నా అభిప్రాయం తెలియచెయ్యమని మీ ఉత్తరంలో మీరు వేసిన ప్రశ్నలుచూస్తే, మీరు సారస్వత వాతావరణంలో ఉల్లాసమాడుతున్నట్లు తెలుస్తోంది. ప్రస్తుతమూ, ముందూ యీ తెలుగు సారస్వతం గతి ఏమిటని ఆలోచిస్తు న్నట్టూ తోస్తోంది. కాని నన్ను సుఖంగా వొంటరిగా వొదిలేశారు మనుషులు. నా జోలికి ఎవరూ రారు. లోకాన్ని తన్నేవాణ్ణి చూచి లోకం అవసరమైన దూరానికి తొలగి జరుగుతుంది. ఈ మీ వ్యవహారపు టుత్తరంకూడా మీనించి ఎంతో ఉత్సాహాన్నిచ్చింది నాకు. అక్కణ్ణించి మీ ఉత్తమ హృదయం నన్నావరించినట్టే! మీ సూనృతదృష్టులు నన్ను ప్రశ్నించి ఏం జవాబు వొస్తుందోనని నావంక చూస్తున్నట్టే, వుంటుంది నాకు. ఇంక దూకుతున్నాను–

మీ ప్రశ్నలకి సమాధానాలివ్వడానికి ఏమీ చేతగాని విమర్శకుణ్ణి నియమించుకున్నారు. ఎందుకంటే సరిగాని విలు వలు కట్టడంలో చాలా అపకీర్తివంతుణ్ణి నేను. నాకుతోచింది అది foolishness అయినా పైకి చెప్పడానికి భయంలేని

వాణ్ణని మీగారు [illegible] పడానికి మీ ఛాలెంజి తీసుకుంటున్నాను. నాకు కవిత్వం (అంటే [illegible]) అంటే ఏమీ తెలీదు. కనక [illegible] నిలబడలకి కొంత ఎడం వొదిలిపెట్టాలి.

(నండూరి) సుబ్బారావుకి మీరిచ్చిన విలవతో నేను చాలా తీవ్రంగా విభేదిస్తాను. In this age of vaprous cowardly pointless poetry of vain longings, his is a heal hy departure, dealing with real desires and lnfinite flesh and blood. But for the handicap of his flippant language, he would have been a lasting force But Subbarow is weak. మొహమాటం మనిషి. అకస్మాత్తుగా ఓ ఉదయం కళ్ళు తెరిచే టప్పటికి [illegible] ప్రాప్తించిన 'క్లాసిక్' కీర్తిని భరించుకోలేక, [illegible] రెండు [illegible]. అబద్ధపుపాటలు వ్రాశాడు [illegible], తన ఆరాధకుల్ని సంతోషపెట్టడానికి.

మిత్రుడు ఆత్రేయ [illegible] అన్నాడు: "తెలుగుదేశం degenerate అయింది. [illegible] ప్రవేశమైతేనే కాని శాశ్వత [illegible] ఉత్తమ [illegible] ఏదీ సృష్టించలేదు" అని. చాలావరకు [illegible] ఏకీభవిస్తున్నాను.

రచయితలు రెండు రకాలు. ఒక ఉద్గ్రంధాన్ని (master-piece)ని వొదిలిపోయేవారు. [illegible] స్వతంగా గొప్పది ఏదీ వ్రాయకపోయినా, సాహిత్యానికి [illegible] నిచ్చేవారు.

ఏ కొందరో గాని రెండూ చెయ్యగలవారుంటారు.

దేశం ఇట్లాగే గొడ్డుపోయి, ప్రస్తుతం వొచ్చిన గ్రంధాల కన్న గొప్పవి రాకపోతేనప్పు, 1900 సం॥ తరువాత ప్రచురిం

చిన పుస్తకాలలో ఒకటికూడా కొంతకాలం తరవాత నిలవదు.

మన సారస్వతంలో (new channels of thought and path of art) అభిప్రాయాలలో కొత్తకాలవలూ, కళలో కొత్తమార్గాలూ ప్రారంభించినవాళ్ళు కొద్దిమంది వున్నారు. వాళ్ళల్లో నేనొకణ్ణి. ఈకాలపు రష్యను ఫ్రెంచి కథలూ నాటకాలలో ప్రశస్తమైన వాటిరకాల్ని తెలుగులోకి ప్రవేశపెట్టాను. పశ్చిమ సారస్వతంలోంచి స్కాట్ తనవాటి ఉద్దేశ్యాలేమీ తెలుగులోకి రానీలేదు, ఇంతవరకు. నేను కొన్ని చాలా మంచివి వ్రాశాను. కాని నా టెక్నిక్ and ఐడియాస్, చాలాపాశ్చాత్య వాతావరణాన్ని సూచిస్తాయి. కనక మన నేలమీద ఆరోగ్యంగా అభివృద్ధి చెందవు.

రాజకీయంగా సాంఘికంగా ముందు దేశం ఏవిధంగా పోతుందో, దాన్నిపట్టి వుంటుంది నాపుస్తకాల విలువ. టక్కు-మల్లే చేతల్లోను ఆలోచనల్లో, యూరోప్‌ని అనుకరించబోతే, నేను గొప్పపూజల్ని పొందుతాను. అట్లా కాకపోతే, నాకు స్థానమేవుండదు. కాని ఈనాడు వాస్తవజీవితంలో, మాటల్లో, చాలామంది చూపుతున్న పోకడలనే నేను కళారూపంలో వ్యక్తంచేశాను.

ఇంక నాభాష ఒక ఆటంకం. Force of sincerity సూనృత శక్తి, weight of passion– నా ఉద్రేకపు ఉధృతము—తప్ప నాకు శైలిలేదు. కాని 'నైను'ను జాగ్రత్త పరిపాత్ర శైలి. ఈ పసులు జాడీలో యీ నైను చాలా వళ్ళు నిలవదు.

నా పుస్తకాల్లో ఏదీ కూడా నిజమైన గొప్పదనం కలది కాదు. ప్రస్తుత పాశ్చాత్యదేశాల్లో అమలులోవున్న కళా విజృంభణకున్న గొప్పతనం నా పుస్తకాల్లో లేదు.

చలం సంగతే వ్రాస్తున్నాను ఇంతసేపూ-ఎందుకంటే నేను బాగా ఎరిగిన అతను అతనొక్కడే.

మీసంగతి నా కెక్కువ తెలీదు. మీవసూధినీ, చెంచురాణీ తెలుసు. అవి చాలా బాగున్నాయి They are very good. మీకు ఏకాంతత ఆహ్లాదకరంగా వుంటుంది చదవడానికి. అంతే. మీకు శైలివుంది. ప్రేమా—హాస్యమూ వున్నాయి మీలో. మీశబరి చదవలేదు. మీరచనల్ని ప్రేమించే చాలా ఉత్తమ పురుషుల్ని ఎరుగుదును నేను. కాని నా స్వభావం మీనించి చాలా భిన్నం. కనక మీకు న్యాయమైన విలువ కట్టలేను. మీ రచనల్లో ఉపన్యాసకారం ఎక్కువగా తోస్తుంది. ఈఅభిప్రాయం నాస్వంతం. కాని మీసూనృతమూ, మెత్తనిహాస్యం, చాలా మంది ఎంత ఇష్టపడతారో ఊహించుకోగలను. కొంచెం కళ్లు వొదిలించుకుని, ప్రయత్నిస్తే, గొప్పవి వ్రాస్తారని నా నమ్మకం. మీకు భవిష్యత్తు వుంది.

మునిమాణిక్యంవి ఆ నిమిషానికి కులాసాగా చదవడానికి పనికి వస్తాయి – All sentiment and tawdriness – ప్రస్తుతకాలపు కుటుంబ జీవనాన్ని ప్రతిబింబిస్తాయి—కాని Disgustingly small.

M. N. Sastry ని ఒక రచకుడుగా ఎంచను. నాకు శివరామశాస్త్రి తెలీదు ఎక్కువగా. రెండు మూడు కథలు

చదివాను. ప్రస్తుతకాలపు రకాల్ని- చిత్రించాడు-అంతకన్న చెప్పుకోవలసింది ఇంకేంలేదు.

విశ్వనాధ_ఆయనకవిత్వం నాకు అర్ధంకాదు. తప్పిదం చాలావరకు నాదే ననుకుంటాను. ఆయన నాటకాలలో ఏమీ గొప్పవికావు. Quite disappointing.

కృష్ణశాస్త్రి-ఆయనవ్రాస్సి is disappointing. ఇంకా వెన్నెముక గట్టిపడి, సూనృతమూ, ఉత్సాహమూ, అతని జీవితంలోకీ-తద్వారా, కవిత్వంలోకీ, వొస్తే-తనుఏమి అనుభవించానని ప్రజలు అనుకోవాలనుకుంటున్నాడో అదిగాక— తను నిజంగా ఏమి ఎట్లా అనుభవించాడో అదివ్రాస్తే-అతను అద్భుతమైన గీతాలు వ్రాయగలడు. నాఉద్దేశ్యంలో ప్రస్తుతపు రచకుల్లో అతను అగ్రగణ్యుడని. కాని అతని రచనలు అస్పష్టము, అనవసరంగాఅయోమయం. రాబోయే తెలుగుకవిత్వం అతను తీసినదోవలో నడుస్తుందని నాకు నమ్మకంలేదు. కాని స్వంతంగా,నాకు గొప్పగా వుంటాయి అతని రచనలు. అతని fine delicate touches at the heart- హృదయంమీద అతనిచ్చే నాజూకు నొక్కులు. కాని అతను చాలామందికి ఏమీ అర్థంకాకపోవడంకూడా ఊహించుకోగలను.

వేమల కలంలో శక్తివుంది. తన కవిత్వం కోసమన్నా బతుకుతున్నాడు. కాని చాలా సంకుచితం. ఇరుకు. బాగా కేంద్రీకరించగలడు. కాని విశాలమైనది ఏమన్నా ప్రయత్నించి తప్పిపోతాడు.

సభాపతి—అతనిహృదయేశ్వరి నాకుఇష్టం-ముందు కాలం లో జ్ఞాపకముంటేనేం లేకపోతేనేం-అతను మనకి జాన్సన్-షి క

force. ఒకప్పుడు మన సారస్వతంలో గొప్ప శక్తుల్ని పోగుచేసి తోవలు తీయగల, opportunity వచ్చింది అతనికి. కాని ఔదార్యమూ, ఔన్నత్యమూ తనలోలేక, తన స్వంతఘనతా, కుయుక్తులూ ఎక్కువై, ఆ opportunity పోగొట్టుకున్నాడు. తన స్వార్థాన్నీ, ఈర్ష్యనీ, జయించగలిగేవుంటేనా!

నోరి—కవికిందనాకు తెలీదు—నాటకం మరీ చెడ్డగా లేదు —ఎన్నవలసింది లేదు.

నాయని—నాకు తెలీదు—అతని కవిత్వం నాకు నచ్చదు. రామిరెడ్డిలో ఏమీ లేదు.

బసవరాజు అప్పారావు—ఒక్క గొప్ప కవిత్వపుపంక్తి కోసం నూరుడబ్బాల చత్తరాస్తాడు. ఇప్పటికే అతన్ని మరిచి పోవడంన్యాయంగా తోస్తుంది.

రాయప్రోలు—కొత్తయుగాన్ని ప్రారంభించాడు. మంచి శైలి. Thought (క్రొత్తఅభిప్రాయాలు) సున్న.

మంచి సారస్వతం రెండురకాలు.

1. అందమైన పటాముల్లో గోడని వేళ్ళాడుతో—మనసుని అందాలతోనింపేది.

2. ఉరిమి, చించి చెండాడి, మంచికో చెడ్డకో, జీవితాన్ని Influence చేసేది.

మొదటిరకపు సారస్వతం ఇప్పుడు బళ్ళకొద్ది తయారవు తోంది. రెండోరకం చాలాస్వల్పం. రెండోరకంసారస్వతాన్ని దేశానికిచ్చేది నేను వొకణ్ణే. కాని నాకు వుండవలసినంత force లేదు. ఏదో ఓ దేశంలో ఇంతవరకులేని కొత్తదనం ఎక్కువలేదు నాలో. చెప్పదగిన కథకులు, మీరూ నేనే.

మనిద్దరమూ sincere (సిన్సియర్) మనం feel అవుతాము, feel అయింది వ్రాస్తాము. కాని మనలో కావలసినంత force వుందా అని నాసందేహం. ఆదర్శంకోసం అవసరమైనంత త్యాగంచేసి కష్టాలకి సిద్ధమౌతామా? కష్టాలలో కాలి, నీక, మిగిలి, అగ్నిపరీక్షకి తాళగలసత్తువవుందా మనలో? లేనప్పుడు గొప్పవి ఏంచెయ్యగలం, సృష్టించగలం?

తన యుగాన్ని Influence చెయ్యగల గ్రంథకర్త.

1. వైశాల్యంలో బలంలో, పుట్టుకతోవొచ్చిన గొప్పతనం వుండాలి అతని Inner Personality లో.

2. గొప్పగా త్యాగంచేసి బాధలుపడాలని నా నమ్మకం.

అందుకునే ఇప్పుడు దేశంలో వ్రాసేదంతా శాశ్వతంగా వుండబోతుందని నాకు నమ్మకం లేదు. గొప్పశక్తివున్న విష యాల్ని మనము సృజించటంలేము.– ఏదోబలహీనంగా, పాలి పోయిన, అనారోగ్యమైన శైలిలో అందంగాకనపడేవి వొస్తు న్నాయి—ముఖ్యంగా గీతాలు.

అలిసి పోయినాను,

జవాబు ఏమన్నా కొంచెం వ్రాయండి.

(1920లో దీక్షితులూ, చలం గుంటూరులో కలిసి పనిచేశారు. అప్పుడు ఈశ్వరుడిలో కర్మలో, జాతకాలలో, ఏమాత్రమూ నమ్మకంలేని చలాన్ని 'జాతకాలు నిజమౌనో కాదో వొచ్చిచూడరాదా!' అనిదీక్షితులుఅంటే చలం 'వెళ్లిచూడకపోవడంకూడా మూఢత్వమే' అని వెళ్ళాడు, శుకనాడిఅతనిదగ్గరికి దీక్షితులుగారి వెంట. అక్కడ తనజీవితాన్నిగురించి ఆనాడిలో చెప్పిన విషయాలు చలం కళ్ళు తెరిచాయి. ప్రయత్నించి, కొన్నినెలలు ఆ శుకనాడివిషయాన్ని పరీక్షించి, భవిష్యత్తును చెప్పగలశక్తి లోకంలో వుందని విశ్వసించక తప్పిందికాదు. ఆ జాతకాలలోచలాన్ని శాంతులు చెయ్యమనికూడా వుంది. ఈలోపల దీక్షితులుగారు చలం తలనొప్పులు పోగొడతామని సూర్యనమస్కారాలు నేర్పి బదిలీఐ వెళ్ళిపోయినారు.)

౪

గుంటూరు.
6-2-36.

*Companion of my lungs and heart,*

గొప్ప thoughts తో ప్రజ్వలించే మీ కార్డు అందింది. వూరికి ఒక యోగాభ్యాసి వచ్చి, ఆసనాలు నేర్పుతున్నా ప్రస్తుతం సూర్యనమస్కారాలు కట్టిపెట్టి, ఆయన శిష్యుడి చేరాను. సులభమైన ఆసనాలూ, ధౌతీ నేర్చుకుంటున్నా. లేపక్షించి మళ్లీ సూర్యదేవుడిముందు సాష్టాంగాలు ప్రా భిస్తాను.

ఇట్లా చాలా పనిగావున్నాను. యోగి అవగతినుంచి ల- వొచ్చి, ప్రతిదినం పదింటిదాకా, పిల్లలు ఎక్కేందుకు గు కొనాలిఅని జట్కాఅబ్బాయితో బేరంచేస్తాను. నేనుకొనని కొనను, అతను వచ్చి బేరం పెట్టడం మానడూ నేను అతనూ నేనూ బేరంశాస్త్రంలో ఒకరికొకరం సాటి అనుకు కున్నాము — అంతకన్న బేరం తప్పించే శాస్త్రంలో అం బావుంటుంది.

ఆముసలాడు, శుకుడు మాలతీబాయిగారిజాతకంలో రెం శాంతులు విధించాడు. వారంలో అన్నిరోజులూ ఆ శాంత అనుష్టానంతో నిండిపోయినాయి. శుకుడి ఆసరాచూసుకి నా నిరీశ్వర అహంభావాన్ని గాయపరచడం ఆమెకి సం షంగా వున్నట్టుంది. ఇప్పుడు మాయింటినిండా పవిత్రమైన బ్రాహ్మలు, భోజనానికి వచ్చినవాళ్లు దాహానికివొచ్చినవా

యోగాసనాలు——వెన్నెముకకు చాలామంచిది. వెన్నెముకని జావకిందకరిగిస్తాయి. అంటే నన్ను Jelly back-boned and weak-kneed fellw ని చేసి వొదులుతాయి. నరాలకు చాలా మంచి చేస్తాయి. ఈ విద్యలు, మీరే అభ్యాసం చేసుకుంటే వెన్నెముకచివరి lumbago వెన్నమల్లే కరిగిపోతుంది!

మా హెడ్మాష్టరు డంబాలకోరు, గర్విష్టి, కుచ్ఛుడు—స్వార్థ పరుడు, సోమరి, టక్కరి——అంటే ... తెలుస్తుందిగా, నన్నే మంటున్నానో !

తన గుమాస్తావొచ్చాక జాతకంకాపీ ఇస్తానంటున్నాడు జ్యోతిష్కుడు. ఆ గుమాస్తా ఎప్పుడు వస్తాడో జ్యోతిషం చెప్పలేట్ట.

అలిసిపోయినాను.

Mrs భూషణం జాతకం చెప్పించాము. దాంట్లో తనకి ఇష్టం లేనివన్నీ అబద్ధాలని ఆమె తగూలాడుతోంది. జాతకంలో, ఆమె తన భర్తని కాల్చుకుతింటుందని వుంటే, 'చూశారా ఎంతఅబద్ధమో——పావురాల జంటమల్లే వుండే మమ్మల్ని ఏమంటున్నాడో' అంటుంది. ఏంచెయ్యను ?

Mrs. Bindle చదవండి.

సుభ్రమణ్యంగారు. వాళ్ళకి state కి వొచ్చారా? తరువాత step శీతారామాంజనేయం. నాకథలసంగతి ఎత్తడమెందుకు ఇంకా ?

'నీచుట్టూ వున్న పవిత్ర వాతావరణంలో' అంటున్నారు మీరు. ఏమిటి మీ వుద్దేశ్యం ? my blooming chap,

ఇదంతా పైపై సొగసు. లోపలంతా ఇదివరకటి, rogue and herotic నేను.

ఎట్లా వున్నారు మీరు ?
డాక్టరుగారు బెజవాడలో practice పెడతారు.

౬

గుంటూరు
14–3–30

*my dear pendulum,*

మీ వుత్తరానికి వెంటనే జవాబు వ్రాసితీరా లనిపిస్తోంది. అంతపనితొందరలో వ్రాసినా మీవుత్తరం సోడామల్లె పొంగుతోంది.

మీరు పెట్టిపోయిన ఆ మూర్ఖపుగొడవనంతా ఒక్కసారిగా మానేశాను. సూర్యనమస్కారాలు ముఖ్యం. అలిసిపోయినాను. ఏమాత్రంలేదు inspiration, బైటనించిగాని, లోపలినించిగాని.

మా హెడ్మాస్టరు కుదర్చడానికి రోగుల్ని వెదకడంలో నిమగ్నుణ్ణి ప్రస్తుతం. కొంతశక్తి వుంది ఆయనకి. కాని వుత్త nonsense మాట్లాడుతాడు. ఆ సాహేబు, ఎన్నేళ్ళకిందో చచ్చిపోయిన యీవూరి ఉర్సుమస్తానుని నిన్న కలుసుకొని మాట్లాడానంటాడు.

బళ్లో అతనిజోరు తగ్గింది. ఈ ఎండవేడి అతన్ని మెత్తపడేసిందో ఏమో? గొర్రెపిల్ల అయినాడు మరి.

రోజూ నేనూ సుబ్బారావూ జాగ్రత్తగా జరుగుతున్న సంగతుల్ని గమనించి గాంధిగారిని చర్చించుకుంటున్నాము. నా వుత్సాహాన్ని అణిచిపెట్టడం కష్టంగావుంది. ఏ నిమిషానో తెంచుకుని ఆయనతో చేరి పోతానేమో? ఎవరికి తెలుసు?

వొంగ్యుల్ని వినాకుల్ వ్రాయకండా గోలచేస్తుంది. అల్లరిది. పైగా మాలతీబాయిగారు చేరారు ఆమెతో. వెనకనించి కొడుతున్నారు కూడాను నన్ను.

మొన్న రైల్లో పారిస్ టాగూరుగార్ని కలుసుకుంది. ఆయన షా చేతిని పట్టుకున్నారు. ఆయన్ని గురించి rave చేస్తోంది.

అచ్చుకి కథలు తయారు చేస్తున్నాను.

బెజవాడలో మీకు యోగాసనాలు నేర్పుతాను. మీ వెన్నెముక బాగుతుంది వాటిని.

ఈ Mrs. భూషణం నా బతుకుని చెడ్డకలగా మారుస్తోంది. ఒకటేగొడవ ఆ లేకుడి జాతకం పట్టుకుని,

"నేను సుఖంగా వుంటానని వుంది కాదూ?"

"అవును."

"సుఖంగా అంటే?"

"అంటే, సుఖంగా అన్నమాట."

"ఎట్లా?"

ఏం చెప్పను ??

"మరి నా నలభై మూడోయేట ఏం జరుగుతుందో చెప్ప లేదే?"

"మేషలగ్నం అంటే ఏమిటి?"

నా కేం తెలుసు?

మేషంవొచ్చి ఆమెకు లగ్నం చే.ందనా ?

ఆ జాతకంఅతను మోసాలమూరిట. నన్ను వెళ్ళి అతన్ని తన్న మంటుంది. లేకపోతే తానేవొచ్చి అతన్ని తంతా నంటోంది. ఇంక అతను ఆడనాళ్ళకి జాతకాలు చెప్పడనుకుం టాను.

8

గుంటూరు

9 – 4 – 30 రాత్రి " గంటలు.

*Dear apple of my eye, or mango of my ear*
*or పాపరపనస of my nose,*

బైట అందమైనవెన్నెల. నా పెద్దమంచం మీరు వేసు కునే చోటనే నేను కూచుని వ్రాస్తున్నాను. మనం విటమినులు తిన్నచోట మీరూ, నేనూ, సన్నీ, ముగ్గురం. విటమిను బాంబులూ, ఫిరంగులూ – Happy days.

మీ సభాపతి బైట పేక ఆడుతున్నారు – ఏకతారగా ళ్ళతో. అతని నవ్వులో ఏదో పేచీ వుంది.

Your editor of pra—is terribly parasiting on Ramaseshu, the good and weak. The latter's women complain to my Zonana.

ఇవాళ నా పాలమనిషివొచ్చి నాకోఅమ్మాయి నిస్తానంది. మధ్యాహ్నం ఇంకో అమ్మ వొచ్చింది. ముసలమ్మవెనక ఒక పడుచుఆమెతో. She too offers her services.

ఆ మంత్రసాని ఇంకా నాకు ఇంటిపని చేస్తుంది. చి
కాత్తో ఆమెని సంస్కరింపలేక పోయినాము. ఉప్పుసత్యా
గ్రహానికి పంపి చూద్దామా?

౮

బెజవాడ
12—4—30

*Dear Paper-marker,*

'ప్రతిభ' అరవసంవత్సరాదినాడుకూడా ప్రైటికి రాలేదనే వార్త విని చాలా సంతోషిస్తారు. కన్నడసంవత్సరాదికిగాని, హాటెంటాట్ పాతసంవత్సరాది అర్ధరాత్రికిగాని రాదు. ఫరవా లేదు. రామశేషు, the weak, and the desperate ప్రెస పడి ప్రసంపాదకుడు. జలగలాగు సారం పీలుస్తున్నాడు.

శుక్రవారంరాత్రంతా నిద్రలేదు గుంటూరులో. మిమ్మల్ని బాధించిన పాతబాధలుకాక, రాత్రంతా చుట్టలుతాగుతో మాట్లాడేరెడ్లు, T. R. వొదిలేసివెళ్ళినఅమ్మాయి రాత్రంతా చెడ్డకలలొచ్చి కలవరింపులు. రెడ్డిగారిచంటిపిల్ల ఒకఏడ తెగని ఏడుపు రాగంకింద మారింది. ఆ ముసలమ్మా, ఆ ఘుచుస్త్రీ, ఆఏడుపు మాన్పడానికని, ఆపిల్లఆయువుసమాప్తిచే విధాలు మాట్లాడుకుంటున్నారు. తక్కినబంధువులు అంతకన్న మంచి పద్ధతులు సూచించారు.

"మెతుకు పెట్టండయ్యా!" అయిదునెలలురానిపిల్లకి! పాలు హరించుకోలేక ఏడుస్తున్న పిల్లకి!

౬

బెజవాడ
25—5—30

నా మౌనాన్ని ఉపేక్షచేసి మీరు వ్రాసిన ఉత్తరం అందింది. మీకు వ్రాయాలని అనుకోని రోజు లేదు. కాని వ్రాయడానికి ఏమీ లేదనిపించేది. ఒక్కటేవార్త. పూర్ణమ్మ పరిచయం అయింది. మీకు ఆ అభిలాషవుంటే, జరిగిన సంగతంతా వ్రాస్తాను.

చాలా విశ్వాసంగా రోజూ సూర్యనమస్కారాలు చేస్తున్నాను. వినాయకుణ్ణి, అతనితండ్రినీ స్తుతిస్తున్నాను. తరువాత నిద్రపోతాను, లేక బద్ధకంగా పడుకుంటాను—ఏమీ చెయ్యటం లేదు. రాత్రంతా నిద్రపోతాను. ఈనిద్ర నాకుమంచిచేస్తోంది.

వ్రాయడమా? ఎందుకు? ఏం ఉపయోగం? ఎవరికి? వ్రాయడానికి అర్హత వుందా నాకు?

ఒక్కసారి తెంచేసుకుని జైళ్ళకు వెళ్ళేవాళ్ళతో కలవడం సాధ్యంకాదా? ఏకొన్ని శతాబ్దాలకో, దేశాన్ని సంచలింపచేసే ఉద్రేకాన్నిచూస్తే నా కేమీ ప్రేమలేదు. కాని—ఎందుకూ కొరగానివాళ్ళు క్షుద్రులు భీరులు ప్రవాహంలో దూకి ఎదురీదుతో ఆ గాలివేగానికి సంతోషిస్తోవుంటే, దగ్గిరకి వెళ్ళడానికి భయపడి, దొడ్డున చూస్తోనుంటున్నాను. దొంగలు, నీచులు, 'అబద్ధులు,' రౌడీలు, వీళ్ళందరూ త్యాగంచేసి, ఆ వొక్కత్యాగంతో, నాకన్న ఆధిక్యతను పొందారు. వెయ్యి సాహసమైన ఆలోచనలకన్న ఒక్క సాహసకార్యం శక్తి

వంతమైనది. ఇతరులకి 'ప్రీచ్' చెయ్యడానికి నా కేమి అర్హత వుంది? తొలగి–మరుగుపడి, చూస్తో, ఆశీర్వదించడం నా కర్తవ్యం.

కాని... నవ్వుతో ఒక మిత్రుడితో "జైలుకి వెళ్ళవలసివస్తే యీ ముగ్గురిపిల్లల్ని భరించడం కష్టమైనపని" అన్నాను. నిజం కాదా? ఇక్కడ ఒక వాలంటీరు వున్నాడు. అతనిపిల్లకి జబ్బుగా వుంది. "నాకు వ్యవధిలేదు. పిల్లజబ్బు నా దేశసేవకి ఆటంకంగావుంది" అని వెళ్ళిపోయినాడు. ఆపిల్లని నిష్ప్రాత్తిగా ఉపేక్ష చేశారు బంధువులు. చాలా బాధపడ్డది. చివరికి చచ్చిపోయింది. ఇది హరిశ్చంద్రుడి త్యాగాల మార్గం కాదా? కొత్తవారి ఇంటో నా పిల్ల జబ్బు లేక పసిపాపల్లా, హాస్పిటల్ పాలవుతోందంటే భరించగలనా? నాపిల్లలకంట నేను దేశాన్ని అధికంగా ప్రేమించటంలేదు.

నే నొకవేళ చచ్చిపోతే, అప్పుడు పిల్లలు నిస్సహాయులు కారా అంటే! ఇప్పుడు మరి నేను బుద్ధిపూర్వకంగా వాళ్ళని కష్టాలకి వొదులుతున్నానుకదా! మృత్యువు నాచేతుల్లో లేదు. వాళ్ళని అన్యాయం చేస్తున్నానని నేను నిందించుకోను అప్పుడు.

నాఆలోచన లిట్లా వున్నాయి. ప్రతి విషయాన్ని ఇట్లా చీల్చి ఆలోచించే శక్తినిచ్చిన యీ చదువే లేకుండావుండి, ఏ సంకోచమూ లేకండా ఇటూ అటూ చూడకండా, తన పిల్లని చంపుకుని దేశసేవకి పోయిన ఆ వాలంటీరుమల్లే, గుడ్డిగా, సంకుచితంగా, నాధర్మ మని మంచికో చెడ్డకో, వెళ్ళిపోగలిగినట్టయితే, ఎంత బావుండేది అనుకుంటాను చాలాసార్లు.

కాని నా పిల్లల్ని రక్షించుకుని, దేశాన్ని నా దేశస్థుల్ని హత్య చెయ్యటంలేదా? అయినా, నాకు సమరంమీదనే ప్రేమ – కాని నాదేశం cause మీదగాని, దేశస్థులమీద గాని ఏ ప్రేమా లేదు. వాళ్ళ స్ట్రగుల్‌మీద నా ప్రేమ, వారి మీద కాదు. వాళ్ళతో చేరనందుకు సిగ్గుపడతాను. నాకూ తెలుసు, మీకూ తెలుసు, ఏదో లెక్చర్లు ఇవ్వడమూ, జైలుకు వెళ్ళడం, మహా గొప్ప heroic పనికాదని. కాని ప్రజలు చచ్చిపోతున్నారు. నాకు చావంటే భయంలేదను కుంటాను. కాని చావాలని లేదు. జీవితమంటే ప్రేమ నాకు. దేవుళ్ళోగాని, బతుకు తగవాళ్ళ బతుకులోగాని, దేశంలో గాని నాకు విశ్వాసం లేదు. సమరంలో చేరనందువల్ల పిరికి వాణ్ణేమో ననుకోడం పిరికితనంకాదా? ఎక్కడికివెళ్ళి దేశా నికి నేను చెయ్యగల ఉపకారంకంటె, వెళ్ళకుండా ఉండడం వల్ల నావాళ్ళకిచేసే ఉపకారం చాలా యెక్కువ. M. R. అన్నట్లు యుద్ధం out of proportion.

కాని ఇదంతా నా భీరుత్వాన్ని సమర్థించుకోడానికి నా మనసు అల్లుతున్న వేదాంతమేమో? ఇట్లా ఆలోచించు కుంటూ నిస్త్రాణ్ణిగా వుంటున్నాను.

నా యోచన మీకు అర్థమయిందనుకుంటాను. నన్ను ప్రోత్సహించేవి ఆలోచన ప్రేమకాదు. పిరికినని నన్ను నేనే నిందించుకోడంవల్ల కలిగేబాధ.

కాని యీ ఉద్యమం మొదటిరోజుల్లో శిబిరాల్లోని సహో త్సాహాన్ని చూసినప్పుడు, గొప్పఅనుభవాన్ని మిస్ (miss) అవుతున్నా ననిపించింది.

ప్రతికక్షుల అన్యాయాన్ని, అబద్ధాన్ని చదివినప్పుడు నా రక్తం వుడుకుతుంది ... కాని వారివల్ల బాధితులైనవాళ్ళమీద జాలిఅన్నా కలగదు నాకు. గాంధిగారు కాక ఇంకెవరు మాట్లాడినా నాలో ఏ సంచలనమూ కలగదు.

డాక్టరు ఉద్యమంలో పనిచేస్తున్నారు. జైలుకి చాలా దగ్గిరగా వున్నారనిపించింది ఆమె. కాని నా నిరుత్సాహం ఆమె మనసుమీద పనిచేసినట్టుంది.

మాలతీబాయిగారు చాలా ఉత్సాహం చూపుతున్నారు మాటలతో. షా, వసంత్, అందరూ orthodox ఖద్దరువాలాలు. డాక్టరురోజూ రెండుగంటలు వొడుకుతారు. మీరు వొచ్చి మమ్మల్ని చూడకూడదూ?

మీపద్యాలతో, మీఆత్మనించి మాధుర్యంతో నిండిన మీకవిత్వంతోవొచ్చి, మాలో నవజీవనం కల్పించరాదూ?

మిమ్మల్ని రమ్మనడం స్వార్థం.

డబ్బుదొరికితే, వొచ్చేవారం అక్కడికి రావడానికి ప్రయత్నిస్తాను. కాని ఎక్కడా వుండలేను. Home-sick అవుతాను. కొత్తఇళ్ళలో వూళ్ళలో నాకు చాలా ఇబ్బందిగా వుంటుంది.

౧౦

ఇంకా గుంటూరే

8—7—30

*Dear* నక్ష్యత్రఘాతకా,

తమాషాసంగతి. మీ బ్రాహ్మసమాజపు గృహస్తులేడూరా—.ఆయనా, నా కీకథ చెప్పిన ఆయినా ఒకరైలుపెట్టెలో

ప్రయాణం చేస్తున్నాను. ఇద్దరూ నిద్రపోతున్నారు. ఇంతలో పక్కబల్లమీద పడుకున్న ఒకఅమ్మాయి కేకవేస్తే రా—ని తిట్టుతో లేచింది.

'ఏంచేశావురా, లంజకొడకా!'

'రా—ఇంకా నిద్రపోతోనే వున్నాడు.

'చూడండి, గొంగవెధవ, నిదపోతున్నట్టు ఎట్లా పడుకున్నాడో...'

రా—లేచి నానేను ఎరగనంటాడు. కాని ఆమెమాత్రం అతను తన రొమ్ముపట్టుకున్నాడని గోలపెట్టింది.

వెం—తను మ టూరుతోసహా పుట్టినట్టు నటిస్తున్నాడు. ఆనొయూభై యేళ్ళవయసుతో పుట్టినట్లు కనపడుతోంది పాపం!

నా భవిష్యత్ కీర్తి మందిరానికి వాచ్చేవారం పునాది వెయ్యబోతున్నాను. అంటే ఒక పాఠశాల స్థాపిస్తున్నాను. ఒకతరగతి, ఒకఉపాధ్యాయుని, ఒక విద్యార్థిని, ఆసంస్థకు నేను ప్రిన్సిపాల్—మాలతీబాయిగారు వైస్ ప్రిన్సిపాల్. బోర్డర్లనిగూడాతీసుకుంటాము. ఈ యేటికి 5-7 మధ్యవయసుపిల్లల్ని.

౧౧

బెజవాడ

17—7—30

Ref: to his letter no. nil Dated nil, addressed to this dear Kiddie-trainer.

*Dear Head of muffs,*

అవును. రా—మని పేనసీ, మనిషికివుండే లోపాలు అతనికీ వున్నాయనీ తెలుసు. కాని తనకి అవేమీ లేనట్టు అతను పెట్టే pose తో నా తగాదా.

ప్రస్తుతం ప్రజలమీద చాలా కోపంగావుంది నాకు. పిల్లల్ని బడికి (అంటే నేనుస్థాపించినబడికి) పంపని తలితండ్రుల ఉపేక్షనీ, నిర్దయనీ, నిరుపయోగాన్నీ, తలుచుకుని మండిపో తున్నాను. Mrs. Bhushan నాబళ్ళో టీచరుగా చేరతా నంటోంది. చేరిన యీ నలుగురు కూనల్నీ ఆమె నుంచి ఎవరు తప్పించగలరు, దేవుడుకూడా! వాళ్ళని కాల్చుకుని తినేస్తుంది. ఈవూరుమీద దండెత్తింది. ఆమె బైలుదేరితే చాలు, స్త్రీ పురుషులు పిల్లలూ, ఎక్కడివాళ్ళక్కడ చెవులుపిల్లుల్లాగ చెదరిపోయి దాక్కుంటున్నారు. వుండుండి ఏదో ఓ సికారప్పు పేరు వుచ్చరించి, 'ఆయన అల్లుడు ఎక్కడవున్నాడం'టుంది. ఆ అల్లుడు మీరేనని నిర్ణయిస్తాము మేము. మాబడిప్రారం భం మీ 'బాజాలోయ్ నాన్న బాజాలోయ్' తో. కనుక మాబడిపురోవృద్ధీ, నాశనమూ రెండింటికి మీరే భాధ్యులు. మీరు మాబడికి God-father.

ఆదివారం మీకోసం ఎదురుచూస్తాను.

౧౨

నరసారావుపేట
22--7--30

*Dear Letter head*

ఉమాస్వచ్ఛా గన్ను ఈవూరినించి కదలనీనంటూను, కాని, భార్య, పిల్లలు, కుక్కలు, ఎలక్ట్రిక్ దీపాలు, వంటమనిషి, రోగులు, మందులు—ఇవన్నీ లేక ఏకాకినైన . నాదినములు మొహం చూడలేక మొత్తపడుతున్నాను.

ఏమీ తోచకపోతే జైలుకి వెళ్ళరాదా, అని సూచించాము, Mrs. Bhushan న్ని. కాని వినదు. ఆబడిని ప్రతిటింటిలోనే ఎన్నెమ్మ కొట్టింది. కాని సాగిస్తున్నాను. చాలా సాహస ప్రయత్నంచేశాను. తేలతానో మునుగుతానో నాసహాయములు cynicism కి లొంగిపోతే, ఎప్పుడోపోయేది ఈబడి. మనుష్య స్వభావంలో, తెలివిలో, అమితమైన విశ్వాసాన్ని సంకల్పించుకుని బడిజీవనాన్ని నిలపెడుతున్నాను. కథ చాలావుంది. నాదని ఇచ్చిన శుకనాడి జాతకం నాది కాదని రూఢి అయింది. చూశారా, నాభావిజౌన్నత్యం కూలిపోయింది. ఏం చెయ్యను?

## ౧3

బెజవాడ

10—8—30

*My dear Financial adviser to the Government*

ఈ వేళ శ్రాద్ధామంటే ఆదివారం కనపడలేదు. నరసారావుపేట వెళ్ళానంటే ఉమాస్ బచ్చా స్నేహితులకికూడా ఉత్తరాలు వ్రాయనీడు. అక్కడ టీచర్లూ, విద్యార్థులూ, నా అనుచరులు. అతను వొంటరైపోయినాడు. నన్నెట్లానా వొదిలించుకోడమని, వాళ్ళకీ పిళ్ళకీ మొక్కుకుంటున్నాను.

నేనేమీ వ్రాయటంలేదు. మొదటిసారి నా జీవితంలో, ఏ ఆశయమూ, ప్రయత్నములేకుండా, నావంటి యువకుడు ఎట్లా సుఖంగా బతకాలో అట్లా బతుకుతున్నాను—తినడమూ, నిద్రపోవడమూ, కబుర్లూ, వేళాకోళాలూ, తిరగడమూ, చాలా హాయిగా అందంగావుంది. నరసారావుపేట నీలపు ఆకాశం,

దూరపు శుభ్రమైన కొండలూ పచ్చని జొన్నచేలూ, ఎ్తైన చేలు కల్పించే మాటుని వినియోగించుకుంటున్నాను.

ఆపక్క నోచేను—ఈపక్క నోచేను.

ఉమాస్‌బచ్చాని చాలా తిప్పలు పెడుతున్నాను.

ఈబడీ, బడిఅంతా కాదులెండి, ఆ ఒక్క చీకటిగుహా, ఆ గుహాలో స్వార్థపరుడైనబచ్చాతప్ప—ఈవూరంటే చాలా యిష్టం నాకు. అప్పుడప్పుడు నాయని సుబ్బారావుగారిని చూస్తోవుంటాను.

నరసారావుపేట, ఆకాశాలూ, చేలూ, చేలలో పాటలూ పాటపాడే పడుచులూ, అన్నీ అందాలే. కాని మనుషులనిండా రోగాలు.

౧౪

నరసారావుపేట
31—8—30

*Dear corrector,*

నా worthy సోదరుడి ముద్రాలయంలో అచ్చవుతున్న నా sex పుస్తకంపేరు 'స్త్రీ' దాని అంకితం ఇట్లావుంటుంది.

ఒక్క నిమిషం నాకు
విశ్రాంతి నివ్వక,
మహా ప్రణయమారుతవేగాలమీదనో,
అగాధవియోగభారంకిందనో
చీల్చి, నలిపి
ఊపిరాడనీక
నా జీవితాన్ని పాలించే

స్త్రీ లోకానికి
నివేదితము.

దీని మర్యాదా, వ్యాకరణమూ, పరీక్షించండి. ఏమో, ఇది స్త్రీలోకానికి నా farewell ఏమో, చివరికి నేనూ మారిపోతున్నానేమో! ఎవరికి తెలుసు?

(లోయన సీనియర్ క్లాసులో ఎవరో ఏమి ఉమ్మేస్తున్నారు. నేను మురారినుగాపున్నా!)

౧౩

నరసారావుపేట
1—9—30

*Dear Romain Rolland,*

మేమూ, నేనూ, డాక్టరుగారూ, సారిస్, కళ్లూ, వెదిమలూ, తలకూడా చివరికి, రోమాన్ రోలెండువి, మీానుమళ్లే వుంటాయి అని చర్చించి నిశ్చయించినాము. ఏమైతేనేం, ఇద్దరూ రామకృష్ణ భక్తులు.

(చిక్షుతులుగారు పంపిన Romain Rolland వి రామకృష్ణపరమహంస జీవితము చదివి వ్రాసిన రివ్యూ.)

1. అంత దూరదేశంనించి హిందూ ఆధ్యాత్మిక జీవిత సూత్రాన్ని గొప్పగా అర్థం చేసుకున్నాడు.

2. కాని ఆయన treatment rationalistic గా లేదు. అందుచేతనే అంత అందంగా గొప్పగా సహాయకారిగా వుంది. Explain చెయ్యడానికనే ప్రయత్నం పుష్పంలో పరిమళాన్ని నలిపేసును.

3. కాని పాఠకుడు పొందే అనుభవం పరమహంసజీవితం లోని సంగతులు చదవడంవల్ల కలుగుతోంది కాని, గ్రంథ కర్త ఉద్దేశ్యాలవల్ల reflections వల్ల కలగడంలేదు. His thoughts are wise and learned, but not great or emotional.

4. ఎంతైనా బైటనుంచే చూస్తున్నాడు రచయిత. Life and intuition are lacking.

5. గొప్పగ్రంథం. మహాపురుషులజీవితాలు సాధారణంగా మనం చదివేవన్నీ జీవంలేని—ఎండు సంగతులూ superstitious వెర్రిపొగడ్తలూ.

అందుకనే యీపుస్తకానికే ప్రాణం పొయ్యగలిగితే ఎంత గొప్పది అయ్యేది అనిపిస్తుంది. చాలాసార్లు నాకు బాధకలిగింది. ఇంకొంచెం ఔన్నత్యానికి వెళ్ళకూడదా! దాహం కొన్న నాఆత్మని ఇంకొంచెం గాఢంగా సంతృప్తిపరచకుండా ఉసూరు మనిపించింది. తీపి తక్కువైన తేనెని తాగుతున్నట్టుంది.

ఇంతకీ రోలెండు గొప్పతనంకాదు, రామకృష్ణగొప్పతనం కనపడుతుంది.

ఆ ఇంగ్లీషుశైలి చూడండి. ఫ్రెంచిలోంచితర్జుమాగావును. It is laboured; and often the attempted flights into poetry are lifeless and absurd ఏమైతేనేం నన్ను, చివరకి నన్నుకూడా, రామకృష్ణ జీవితాన్ని సంపూర్ణంగా తెలుసుకోవాలన్నంత కదిలించింది.

ఈమార్పు కనపడుతోంది నాలో. మతమూ భక్తి రకం పుస్తకాలు చదివి ఎన్నోయేళ్ళయింది. చదవాలని ప్రయత్నిం

చానను, కాని భరించలేకపోయినాను. మతం వృత్త foolery లాగు, వెర్రి, పోసనులాగు కనిపించింది. చాలాయేళ్ళకింద రామకృష్ణా, వివేకానందా, పుస్తకాలు చదివితే, అవిచాలా simple and foolish గా కనపడ్డాయి. వాళ్ళు చెప్పేదంతా ఇదివరకే నాకు తెలుసు ననిపించింది. స్కూలు కుర్రాళ్ళకి ఉపన్యాసాలలాగు న్నాయి. ఇప్పుడు రామకృష్ణ చెప్పే కథలూ, విమర్శలూ, simple and naive గా వున్నాయి కాని వాటిని నేను enjoy చేశాను. ఒక సందిగ్ధసమయంలో ఆ పుస్తకం నాచేతికి వొచ్చింది. అంతంలేకండా ఉన్నా ఆ పుస్తకం చదువుతోనే వుండా లనిపించింది. effect నామీద అస్పష్టనే వున్నట్లనిపించింది. కాని సందేహమూ అంధకారమూ నన్ను చాలా త్వరగా ఆవరిస్తాయి. బహుశా, రామకృష్ణ ఎవరిసంగతో అన్నట్టు "ఈజన్మలో" కాదేమో నాకు.

మనస్త్తరాసికి బిళ్ళకొనేందుకు డబ్బులేదు.

౧౬

బెజవాడ

8—9—30

*Dear depressed dad,*

ఉష్షు. మీావుత్తరమంతా విసుగూ అలసటా పలుకు తున్నాయి.

స్త్రీకి అంకితం—'స్త్రీకి' అంటే ఎవరో ఒకరికే అనుకుంటారు. అందుకని స్త్రీ "లోకానికి" అని వుంచుతాను.

Busy, unhappy, efficient, 'cruelly treated by

fate' Head masters even are allowed and are expected to take rest, sing, dance, and laugh for a while and see friends. కనక రండి.

సుబ్బారావు నరసారావుపేట వొస్తున్నాడు. మేమిద్దరం కొండవీడు వెడతాము. అక్కణ్ణించి బెజవాడ—అక్కడ [illegible]. R. మమ్మల్ని కలుసుకుంటాడు. ఈ రుతువుల్లో కొండవీడూ, ఫిరంగిపురం చాలా అందంగా వున్నాయి. నరసారావుపేట రాత్రులు వెన్నెట్లో ఇంద్రజాలాన్ని పన్నుతోంది. in spite of wmashatcha. తరువాత పడవమీద వైకుంఠపురం వెడతాము.

ఈఇంటి పరిపాలకురాలు, ధనాగారంపైనా, భోజనాగారంపైనా నిరంకుశాధికారి, గుడిపాటి ఉప్పుటూరి వంశాల ఆస్తుల travelling agent, వొళ్లూరి సోదరుల ధర్మాల నిర్ణయదారురాలు, ఆంధ్ర భీమాకంపెనీ స్త్రీ శాఖకి chief organiser గా నియమింపబడేందుకు ఈరోజు బందరు వెళ్ళిన మాలతీబాయిగారు, తన private secretary ని నన్ను మిమ్మల్ని సకుటుంబసపరివారంగా దసరా సెలవల్లో ఇక్కడికి ఆహ్వానించమని శాసించారు. ఇక్కడ మాకు ఒక పెద్దఇల్లు(వెంకాయి సహాయంతో G. V. పెంచుతున్న) తోట, విద్యుచ్ఛక్తి, కుళాయిలు, రెండు కుక్కలు, ఒక దిక్కులేనిపిల్లి, అప్పుడప్పుడు మేక అతిథులు! కొన్ని దోమలు, ఇన్నీ ఉన్నాయి. మీరు ఆహ్వానితులు. ఈకింది పనులకై మీరు రావలసింది.

1. మీకు refresh కావడానికి

2. మనస్సుల్ని solace చేసి సంతోషపెట్టడానికి.

3. ఆహ్వానాన్ని నిరాకరించడం మర్యాద మనుషుల లక్షణం కాదు గనక.

4 మీ assistant in charge వుండే గౌరవం పొందేందుకు.

5. sonny ని 'చే' కి చూపి వాళ్ళ పూర్వప్రేమ ద్వేషాల్ని తిరగపెట్టేందుకు.

6. నాకూ మాలతీబాయిగారికీ మధ్య తగాదాలు తీర్చి తగిన సలహాలిచ్చేందుకు.

7. నన్ను తగిన శిక్షణలో పెట్టేందుకు.

8. నన్ను రాజమండ్రి బదిలీచేయించేందుకు మార్గాలు యోచించేందుకు.

మీరు రావడం ఎంత సుఖంగా ఆనందంగా వుంటుందని నాకు!

మీకు కొండవీడు చూడాలనివుంటే, నరసారావుపేట రండి. మీ భార్యకి ఇక్కడ భోజనం చెయ్యడానికి ఆచారపు అభ్యంతరాలుంటే,

1. వంటిల్లు, భోజనాలయిల్లు, ఇంటికి 10 గజాల దూరంలో వున్నాయనీ,

2. వాటిని నింపేటంత లావాటి బ్రాహ్మణవంటామె వున్నదనీ,

3. మీ భార్యని వంటింటి అధికారిణిని చేస్తామనీ, వారితో చెప్పండి.

మీరు రావాలి !

ఈపురాతన పట్టణాన్ని మేలుకొలిపి, యీ చచ్చిన వాతావరణానికి నవజీవన మిద్దాము.

౧౭

బెజవాడ

12—1—31

*Dear co-responsible officer,*

మా — తీవ్రప్రయత్నాలవల్ల నన్ను యీ స్కూల్కి హెడ్మాస్టరుగా మార్చారు. ఏమంటారు ? మీకు చెప్పవలసింది ఎంతో వుంది. మీతో చెప్పాలని చచ్చిపోతున్నాను. ఈలోపల మీ దగ్గిరికివొస్తాను. కాని డబ్బులేదు. మీ స్నేహితుడు, అ—మన ఆఫీసులో నామీద చాలా విషంపోశాడు. నేను నడవడిలో, డ్రెస్లో, మాటల్లో, నడకలో చాలా careless గా వుంటానని వెళ్ళి స్వయంగా పనిపట్టి చెప్పాడు. అతను నేనడిగినప్పుడు, ఈశ్వరుడి ఎదుట తానేమీ ఎరగనన్నాడు. పొద్దస్తమానం మానవ జంతుసేవ మాట్లాడతాడు మళ్ళీ.

మొన్న మాలతీబాయిగారు ఎవరితోనో వాదిస్తున్నారు. ఈ హెడ్మాస్టర్కి ఈర్ష్య. అందుకని ఈయనమీద పైకి వ్రాస్తారు. ఈయనసంగతి వాళ్ళకి ఎక్కువ తెలుసా, నాకు ఎక్కువ తెలుసా? ఎవరికి బాగా తెలుసు నాకన్న! ఎంత మంచివారు? అంటున్నారు.

నేనెంత 'మంచివాడో' ఆమెకితప్ప ఎవరికి తెలుసు?

ఇంక నరసారావుపేట రైలునుచూసి వొణకనక్కర్లే దన్న సంతోషమేగాని, నేను ఛార్జితీసుకున్న నిమిషంనుంచి కరుణామయమైన తన వక్షంమీద ఈశ్వరుడే నాకు ఓదార్పు నివ్వాలి. ఇంకెవ్వరికీ చాతకాదు. ఎట్లావున్నారు మీరు?

మా—నాతరఫున ఆఫీసులో ఈ వాగ్దత్తాలు చేసి వొచ్చారు నా కీపని ఇప్పించేందుకు.

1. సరైన సూట్సు వేసుకుంటాననీ

2. ఎక్కువగా నవ్వననీ

3. అరవై ఏళ్ళవాడికిమల్లే నడుస్తాననీ,

4. నాకింది టీచర్లని జవాన్లనీ, రోజూ చివాట్లు క్రమంగా వేస్తోవుంటాననీ,

5. జీవితంలో బాధల్నిగురించి, నాగతి సంగతీ రోజుకి మూడుసార్లు కనపడ్డవారితో ఏడుస్తాననీ,

My old chap. మీతో ఏడుపు ప్రారంభించానుఅప్పుడే.

౧౮

బెజవాడ

1—7—31

*My dear Longfellow,*

'సఖి'కి మీరిచ్చిన ఆ చత్తఅంతా ఏమిటి? నా ఆరోగ్యం చాలా ఛండాలంగావుంది, రాజీనామా నిద్దామనీ చద్దామనీ తాగుదామనీ అనిపించేటంత. Good old (కొడాలి) సుబ్బారావుగారికి ఆ లోకాలకి బదిలీ ఐనరోజునించి మీకు వ్రాద్దామని, పత్రికలు అతన్ని వొదిలిపెట్టలేదు ఇంకా.

ఆ blasphemer శుకుడిసుగతి ఇప్పుడేమంటారుమీరు? మిమ్మల్ని కలుసుకుని మాట్లాడా లనిపిస్తోంది. ఇంత అనారోగ్యంగా లేకపోతే రాజమ్రదివొద్దును. ఈ హెడ్మాష్టరుపని చాలా ఘోరంగావుంది. మీకేం! అదృష్టం! హెడ్మాస్టర్ boon, డిపార్టుమెంటు గ్లానే, శారకం వున్నాగా మీకు. తను పన్నెండో బిడ్డ పుట్టిన పండుగచేసి, తన accomodating హెడ్మాస్టర్ని ఆహ్వానించాడని విన్నాను. ఇట్లాంటి అతను చాలా కాలం వంశాభివృద్ధిచేసి, కులాలు గుర్తు లేని పుత్రపౌత్రులతో, యీ పవిత్ర ఆర్యావర్తంలో, consternation and confusion తీసుకురావాలని కోర్కె.

D. E O. సు—కొన్ని శతాబ్దాలనించి ఇక్కడ camp వేశాడు ఉపన్యాసాలు, సిటీలు, చీవాట్లు, bombardring surprise visits. తన మీటింగుల్లో తలగుడ్డల్ని హాజరునిగా నిర్బంధ పెడుతున్నాడు. చాలా న్యాయం. తలగుడ్డలే లేకపోతే అతనికంత ఎవరు చెప్పాలనస్తుంది. హాజరు నిర్బంధం కాకపోతే అసలు ఎవరూ వుండరు.

కాన్ఫరెన్సులు మండిపోనూ. వాటిని మీరు seriousగా తీసుకోలేదుగనక చాలా enjoy చేసివుంటారు ఆకాన్ఫరెన్సుల్ని.

ఇప్పటికన్నా మీకు తెలిసివొచ్చిందా, గాంధీ, అంతగా sincere religious man కాదని, మంచిరాజకీయవేత్త అని He is tactful.

I am bitter: ప్రజల్ని ఎంతకొంచెంచూస్తే అంతమంచిది. మనుషుల్ని (నాతో కలిపి) చూసినకొద్దీ అసహ్యం పుడుతోంది.

పిఠాపురం-హంబగ్ - నాయుడుగారు సగం వాళ్లనిచూసి భయపడి వాళ్ళ రాగానికి నాట్యంచేసే వాళ్ళరుచులకి వంట చేసే క్రిష్ణశాస్త్రి, అంత మధురమైన కవిత్వం వ్రాయడానికి వీల్లేదు. ఏదో శాంతంగావున్న మూలకిపోయి, ఊరిబోసుకుని, Swan song కానియ్యరాదూ?

నేను పూజలన్నీ మానాను. మళ్ళీ red hot నిరీశ్వర వాదినైనాను—సోషలిస్టు నా, ఏమంటారు! మీవుత్తరం ఎందుకు తగల పెట్టమన్నారు? పిఠాపురానా, లేక సభవారినా, ఎవర్ని చూస్తే భయం?

వెం—ఎట్లా deteorate అవుతున్నానో గమనించారా? దేహం? మనసుకి అద్దం శరీరం. soul ఆత్మలేదు. నాకు ఆత్మ లున్నాయని నమ్మకం లేదు—కాదు ఆత్మ వుండదనినమ్మకం వుంది. ముఖ్యం rotten souls వుండి తీరాయి. ఆత్మలు మాత్రం లేవు.

గాల్సువర్ది - Forsyte saga చదవండి.

కవిత్వ తత్వవేది —వెంకటనారాయణరావు — తెలుగు సితిపరుడు—ఒక M. A. L. T. బోధనా పాఠశాలలోపని— రాయలసీమలో—ఆదేశాన్ని నేను పాములసీమ—అంటాను.

పరీక్షలు - పడక కుర్చీలో - నాకాలం మధురంగా గడి చేందుకు ఒక యూరేషియన్ అమ్మాయి B. A. L. T. నా ఆరోగ్యం ఎప్పటంత అధ్వాన్నంగానూ వుంది. ఏం వ్రాయటం లేదు. జరగడానికి వీలులేని దివ్యసన్నివేశాలు నా జీవితంలో జరుగుతాయని ఇంకా కలలు కంటున్నాను.

మా పిల్లలందరూ ప్రస్తుత విద్యావిధానానికి తిరగబడి చదువు మానేశారు.—ప్రభుత్వంవారు తమ educational policy మార్చుకునేవరకు బడికి వెళ్ళరుట. సౌరిస్ వోడ్ హౌస్ చదువుతోంది. వసంత్ foot-ball matches ఏర్పాటు చేస్తున్నాడు. చే ప్రస్తుత ఆర్థికసమస్యలకీ,రూపాయ మారకపు మార్పులకీ solution కింద పెళ్ళిచేసుకోవాలని లోపల ఆలోచించుకుంటూ జుట్టు పెంచుకుంటోంది.

మేమో పిల్లని పెంచుకుంటున్నాము.

సు—హఠాత్తుగా బడికివొచ్చి నన్నుగానక, రిజిస్టర్లలో "ఎక్కడ? ఎక్కడ?" అని వ్రాసిపోతున్నాడు. ఒక ఇన్సూరెన్సు ఏజంటు ఆయనకి ఒక కొత్త స్పోర్టుకారు బహుమతి ఇచ్చాట్ట. అది వుత్తవదంతి. ఈజిల్లాలో బలవంతం భీమా చెయ్యనిబడి మాది ఒక్కటేనని తెలుసా మీకు?

అలిసిపోయినాను. లేకపోతే ఇట్లా వ్రాస్తోనే వుందును.

సంగతేమిటంటే నేను recluse (వొంటరిగా బతికేవాణ్ణి) ఐనాను. ఎవరినీ చూడను. ఇంటోవాళ్ళతో తప్ప ఎవరితోనూ మాట్లాడను. పైగా లోకం నన్ను గృహచ్ఛేదకుడంటారు. నేను వ్రాయను. ఏమీ చెయ్యను—ప్రాణాయామంతప్ప.

ప్రాణాయామంవల్ల ఫలితాలంటారా? నా సూక్ష్మ శరీరం చాలా గొప్ప ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని పొందుతుందో ఏమోగాని, ప్రస్తుతం నాకు భౌతికలాభం ఏమీ కనపడదు. అయితే ఎందుకిట్లా నన్ను నేను యాతనపెట్టుకుంటున్నాను అంటారా? చెయ్యడానికి అంతకన్న ఘోరకార్యం కనపడక.

నా ఆరోగ్యం బాగుచెయ్యడానికి కొంచెం హోమోపతి పంపండి.

ఆ bloody geogrophical chap టి. బి. వెంకట్రావు ఎవరో తెలీదు. మా విద్యార్థులు ఇంక ఈ యేటికి పుస్తకాలు కొనరు. నాకు 250 రూపాయలన్నా ఇవ్వడం న్యాయమని తెలుసుకోని ఈ ప్రభుత్వం, నా విద్యార్థులకి ఏమాత్రం ఇస్తుంది?

నాకు చాలా అవసరంగా ఒక మోటారుకారు కావాలి మరి. నాయూరేషియన్ స్నేహితురాలు తీసుకురమ్మంటోంది.

రామశాస్త్రిగారు ఏమివ్రాస్తున్నారు? బ్రాహ్మసమాజపు నాశనచరిత్ర వ్రాస్తున్నారా? మీరు చదివేముందు ఈ వుత్తరం పేజీలన్నీ ఓ విద్యార్థిచేత సరిగా సర్దించండి.

౧౮

బెజవాడ
18—10—31

*Dear bob,*

డాక్టరు అహోబలరావుగారు చచ్చిపోయిన షాక్‌తో కుంగిపోయి బాధపడుతున్నాను. ఆయనకీ మృత్యువుకీ సంబంధం మనసులోనన్నా తలచుకోడానికి వీలులేనిమనిషి ఆయన. ఒకొక్కళ్ళే, నాస్నేహితులు, నాపక్షం నిలబడతారని నమ్మదగినవారు, ప్రియమైన నా జీవితయాత్రని, నా 'స్ట్రగుల్' ని, అర్థంచేసుకోగలిగినవాళ్ళు, చచ్చిపోతున్నారు. కొత్తవాళ్ళస్నేహం కావటంలేదు. అంటే వయసు మళ్ళుతోందన్న మాటేగా! ఇంకా ఇట్లా కొద్ది సంవత్సరాలు

బతికితే, to, struggle and to swallow, ఒక్క-గుక్కతో మింగిలి పోతానుగావును! డాక్టరుగారి గొప్పతనం తెలుసుకోడానికి వీలులేనిది. feel కావలసిందే. ఎందరికి తెలుసు? నాకు తెలిసిన గొప్పవాళ్ళకన్న చాలా గొప్పవాడు ఆయన. నేను తుంగభద్ర వెళ్ళలేదు.

ఇండియాలో మతమంటే, ఇతరులపట్ల స్నేహాలకి దూరం కావడంలో కలిసిపోయుంది. అందుకనే నాలో కాని ఇతరులలో కాని మతరోగం చాలా భయపెడుతుంది నన్ను.

౨౦

Dam Bloody School
14-11-31

*my dear co-sufferer,*

చూడండి, జి. వి. ఎంత గతికి దిగాడో-

1. అధికారికి ఒ కాబేజీ పంపాడు.
2. శనివారం ప్రైవేటుక్లాసు పెట్టాడు.
3. ఒక టీచర్ని చివాట్లు పెడుతున్నాడు.

పాపం! Poor chappie G. V. - అతనిసంగతి మనకి వొద్దు. మళ్ళీ కార్తీకం వొచ్చింది. తెల్లారకట్టలు సూర్యోదయ స్నానాలూ, తరువాత మన మిద్దరం మెట్లమీద కూచుని **Violet Rays** పీల్చుకొంటూ సోమరిగా చెప్పుకునే కబుర్లూ, సాయంత్రాల మెత్తనికాంతీ సోమవారాలు మీరు బలవంతంచేసి ఉపవాసా లుంచడం, మీరు రాకముందే నేను భోజనంచెయ్యడం—

సంతోషిస్తా !
సఖ. పురిటిదోసంకెట్లి చెప్పాడు.
స—శాస్త్రిగారు వ్రాస్తో తిరుగుతున్నారు.
నా ప్రియురాలు గోదావరి ఎట్లావుంది !

౨౧

బెజవాడ
5—2—32

*my dear deekshitulu,*

Your letter provokes an immediate reply, no; an instantaneous kick. So I give up valuing nature study papers, and straighten my old rod of a back-bone to pen a hate-letter to you.

My hand follows my mouth. Frist abuse, and then a blow,— n silence.

Herr find me-a budding Yogi-why! a Yogi in the marking-trying very hard to rouse his kundalini buried under bushels of sins and non-Yogic-habits. My gaze is in words towards the mysterious kundalini a treasure island in the ocean of misloading nerves and the vibrating waves of lustful tides.

నా యోగదృష్టిని తన నాశ్రుతో లాగాలని ప్రయత్నిస్తో ఇప్పుడే ఓ అమ్మాయి వెడుతోంది కిటికీకింద. ఆ అమ్మాయిని ఇష్టపడుతోంది, నేనూ ఇష్టపడుతున్నాను, యీ రెండింట్లా ఇష్టపడుతోనే వున్నాను - కాని మామధ్య యీ పదిగజాల దాటరాని దూరమూ అభ్యంతరం. గాలిలో ప్రయాణం చేసే శక్తి యీ యోగం యివ్వనట్లా ఇవ్వాలి. అనూ ప్రాణందూరం

నా శరీరంలో ఒక భాగాన్ని పొడిగించగల శక్తి నన్ను యివ్వాలి. అందాకా లాభం లేదు.

మా పావురాలు ఎగిరిపోయినాయి
దిగిరాను దిగిరాము దివినుండి భువికి
అని పాడుతో.

పిల్లులు ఏడు సంఖ్యదాకా అభివృద్ధి చెందాయి. ఇప్పుడు మా. తెల్ల ఎలికలు తొందరగా [illegible] బంకిన్న శీఘ్రంగా ఎక్కువవుతున్నాయి—కాని అంతకన్న తెలివిగా, ఎక్కువైన పిల్లల్ని తల్లులు భోజనానికి వినియోగించుకుంటున్నాయి.

సుగ్రీవుడా! తెల్లఎలికల్ని చూసి పాఠాలు నేర్చుకో.

రైలుకిందబడ్డ ఒక మేకని రక్షించి తీసికొచ్చాను. దాని కాలు నొప్పి దాన్ని పట్టించుకోనే వొదిలి. కోటు జేబుల్లోనించీ, పెట్టెల్లోనించీ, గొంగళిపురుగుల్ని పోగుచేసి, లిప్తాల పెట్టెల్లో పెట్టి సీతాకోక చిలకల్ని తయారుచేస్తున్నాము. పాపనా సనకొడుతున్నాంగా. నీళ్ళ కుండలో చాపలు. తాబేలు పారిపోయింది. బాతుల్ని తెప్పిస్తున్నాను.

ఏ. తోచటంలేదు. రైలుస్టేషన్లో జీవిస్తున్నాను. హింగి. బాదమ్ము పుస్తకాలషాపు— mag. sulph, ప్రతిసాయంత్రం. కొంచెం సిరామంకోసం సుబ్బారావుదగ్గిరికి పోనాలి షికారు.

మా D. E. O. ఉపన్యాసంమల్లే, ఇట్లా ఎంతైనా వ్రాయగలను. నాకుమాత్రం సోడాబుడ్లు ఇచ్చేవాళ్ళులేరు, చివరకి సిరాబుడ్లు-- కూడా. ఈ కాగితాన్ని అపరిగింది తరవాత అంత్యప్రాసకి. వొచ్చే సంవత్సరం పెన్షన్ తీసుకోవాలని చూస్తున్నాను.

౨౨

బెజవాడ.
5—3—32

*my dear beeff-steak,*

ఇప్పటికికూడా మీరు beef-stieak లాగ రుచిగానున్నారేమో! చాపలు దేవతల ఆహారం, మాంసం రాక్షసుల ఆహారం—రెండూ కలిపితే మనుష్యులకి ఆహారం,

ఎట్లా వున్నారు? పటేషు సాములకి పందిళ్లు వేయిస్తున్నారా? నేనూ, D. E. O. తనిఖీఆట ఆడాము, ఒకరినొకరం బెదిరించుకొంటూ.

నా వుత్తరానికి మీరు జవాబు వ్రాయలేదేం?

1. '—' వ్రాయడానికి ఏమీ లేకనా?

2. మీ ప్రశ్నలన్నింటికీ జవాబు వ్రాశాను గనకనా?

3. నేను తలతిరిగిన గాడిదనైనానని అభిప్రాయపడ్డారా?

4. ఏ చింతాలేని ఉపాధ్యాయుణ్ణి కాస్తా, ఉపాధ్యాయుల్ని ఏడిపించుకుతినే boss ని ఐపోయినాననా?

కాకపోతే, ఇంకేమిటి.?

ట్రెయినింగు బడి హెడ్మాస్టరుగా పడివుండి 75 రూపాయల పెన్షనుతో పని విరమించుకునే విచారకరమైనగతి తప్ప ఇంకేం లేదని తలపోంచారా? లేక ఇంకేమన్నా అంతకన్న మంచి సద్గతుల్నిగూర్చి కలలు కంటున్నారా?

1. చమత్కార కథానక చక్రవర్తిగా ప్రసిద్ధుడు కావడమో.

రెండుకాదా సంపాయిస్తానేమో ఎప్పటికినా? కాని అప్పటికి నా కలల్ని చూసి పిల్లచేష్టలని నేనే నవ్వవచ్చు.

ఏమంటారు?

ఈనాడు నాకు ఒకసంగతి తెలుసు. మీ దేవుళ్ళ అబద్ధం. నా దేవుడే సర్వశక్తివంతుడైన దేవుడు.

అతను

శూన్యం.

ఏమంటారు?

జవాబు వెంటనే ఇచ్చేటంత తెచ్చుకోగలనా సూక్ష్మాన్ని!

## 23

బెజవాడ

27—3—32

*My dear baba,*

మీ పుస్తకం 'జగన్మాత' చదువుతున్నాను. దాని rhythm లో పడ్డాను నేను. బాగుంది నాకు, తెలీని భాషలో పాడే శ్రావ్యమైన సంగీతంలాగు. మీరు యీ పుస్తకంలో వ్రాసిందంతా నమ్మగలగాలని, అనుభవంలోకి తెచ్చుకో గలగాలని ఎంతోవుంది నాకు. ఏమో ఎప్పటికో జరుగుతుందేమో అది.

ఇదివరకటికన్న రోజులు శాంతంగా వున్నాయి. కాని ఇదివరకటికన్న సంతోషంగా వున్నానా? శాంతి నా మనో స్వభావానికి పడేట్టులేదు.

నాకు శాంతివొద్దు, ఆనందం నా కక్కర్లేదు. నాకు కావలసింది జ్వలించే మోహోద్రేకమూ height of feverish passion— తరవాత సంభవించే విషాదమూ. నేను శివుణ్ణి; శక్తిని స్వాధీనం చేసుకుంటాను. అనేక సుందరమైన శరీరాలలో ఆమెని అనుభవిస్తాను, అదీ నా ముక్తిమార్గం.

ఈ ఎండాకాలం ఎక్కడికి వెడతావు? నేను లోనావ్లా కాని నందికొండలకిగాని వెడతాను. తప్పిందా ఇక్కడే చక్కగా కాలతాను. తీవ్రమైనఎండ ఇష్టం నాకు.

బహుశా మీరు నవ్వుకుంటూ

“ఏరోజో ఎప్పుడో నువ్వు తిరిగి, ఈశ్వరుడను కావాలంటావులే” అనుకుంటున్నారేమో?

ఏమో చెప్పలేను. కాని ఇప్పుడు దేవుడు నన్ను “నీకు అత్యున్నతమైన మోక్షంకావాలా, ప్రస్తుతపుజీవితం కోరుకుంటావా?” అంటే

“నాకు జీవితమంటే ప్రేమ. కన్నీళ్ళలో, నవ్వులతో, నీచత్వంతో, త్యాగాలతో, స్వార్థంతో, ఔదార్యంతో, విషాదంతో, ఆనందంతో—ఈ జీవితమే మంచిది. మళ్ళీ మళ్ళీ అనంతంగా ప్రకృతితో, పెళ్ళిచేసుకుని సంపాయించి, పిల్లల్ని కని, పాపాలుచేసి, ప్రేమించి, ద్వేషించి, నవ్వి, మూలిగి... కాని నీమోక్షం అక్కర్లే” దంటాను నిశ్చయంగా ఈనాడు.

౨౬

బెజవాడ
11 8—33

*my dear Anti-Pushk,*

చివరికి మిగిలింది a long chipping వృత్తాంతం. కృష్ణ వరదలలో పొంగుతోంది. రామశాస్త్రిగారితో చెప్పండి నన్ను ఎన్నటికీ ఆడపిల్లలబడికి మార్చరని.

నాపైన (Scandal) స్కాండల్ విషయం—

నేను గ్రహించాను—చిన్న నన్ను ఇనపకాలితో చాలా గట్టిగా తన్నిన సంగతి. గడిచిన మూడు నెలలూ నా జీవితంలో అన్నిటికన్నా విషాదకరమైన నెలలు. అంత బాధ నే నెన్నడూ పడలేదు.

(జాతకాలలో మీ ఇంట్రెస్టు ఏమయింది!)

ఈనెల నయం. కాని పాతబాధ ఇంకా పీడిస్తోంది. తీవ్రంగా ప్రేమించి వుంటేనే గాని, ఆ నరకం మీకు అర్థం కాదు. అవును. నే నెక్కడికీ వెళ్ళడంలేదు. ఎవరితోనూ మాట్లాడడంలేదు. ఏ సంతోషమూ ఏ ఉత్సాహమూ లేకుండా, ఈరకంగా [illegible]. అందరిమట్టే వుండేట్లు మారిపోయినా నంటున్నారు. మరి మూడు నెలలకిందట నేను కన్యాపహరణంకింద కోర్టుకి పిలిపించుకునే పరిస్థితినించి చాలా కొద్దిలో తప్పించబడ్డాను. కాని ఇప్పుడు జైలుకి వెళ్ళితేనే నా స్థితి బాగుండేదనిపిస్తోంది. ఈ స్వేచ్ఛను భరించలేను, ప్రతినిమిషం నన్ను కాలుస్తోంది.

హృదయాన్ని వాక్కుల్లో, యీ [illegible] కలసి [illegible]
కాలం గడుపుతున్నాను.

౨౮

[illegible]

16—11—1933

*Dear P[illegible],*

ఇంతకీ ప్రార్థన సంతోషంలో ఉత్తరం వొచ్చింది మీనుంచి.

విశ్వనాథ నేనూ ఎందుకు పంచుకోవాలి యూనివర్సిటీ బహుమానాన్ని!— మా ప్రేమని పంచుకుంటున్నామనే కారణంవల్లనా? నా పోటీనించి ఆయన కేమీ భయం అక్కర్లేదు. మీకు తెలీదూ?—తన మెదడు సరిగా తలలో వున్నమనిషి ఎవడూ నాకు బహుమానం ఇయ్యాలనుకోడు—అందులో అంత ఘరానాసంస్థ యూనివర్సిటీ ఇస్తుందా?

ఏమిటి చింతపని మీకు? పనిని వొదిలించుకోడంలో నానించి పాఠాలు నేర్చుకోండి. మనం బోధించేవాటివల్ల పిల్లలు లాభం పొందుతున్నారా? డాల్టన్‌పద్ధతి ప్రకారం వాళ్ళనే చదువుకోమనండి—సందేహాలువొస్తే అడగమనండి. కాని నన్ను చూడగానే వాళ్ళ సందేహాలు ఎగిరిపోతాయి. కనక method పుస్తకాలు చెప్పేట్టు మీ ఆఫీసు గదిలో కూచుని masterly inactivityని పాలించండి. ఆఫీసుపనా!—కాయితాలు సంతకం చెయ్యండి. బిల్లులా!—అవి సరిగా వున్నాయా లేవో చూడటానికికాకపోతే, తాలూకా హెడ్మాస్టరికి జీతమెందుకిస్తున్నారు? పైకి కాయితాలా? అవి సరిగా

ఉన్నాయో లేదో చూసుకొని సర్దుకోవడానికే ఈ ఆఫీసు హెడ్డుగుమాస్తాకి ఇంకేం పని!

ఇట్లా ఏళ్ళుగడుస్తున్నాయి. నేను పనిచెయ్యాలనుకో లేదు. నన్ను పనిలోంచి తీసెయ్యకండా ఎంత కొంచెం పని చెయ్యాలో అంతే చేస్తున్నాను, వాళ్ళు నాకిచ్చే ప్రమోషన్లు ఏమీ లేవు. నేను కావాలనీ అనను. ఇష్టంలేకపోతే, బదిలీ చెయ్యమనండి. ఆ జిల్లా హెడ్క్వార్టర్స్‌కి సంగీతాలు పాడిస్తాను—కనక నన్ను జిల్లా అధికారిని చెయ్యటం తప్ప ఇంకోగతిలేదు వాళ్ళకి. ఈ సలహా పైకి పంపండి.

కనక, old boy, గమనించండి. నీకు పూటకే గోలపడి చెమటలుకారిస్తే, ఎవరికీ లాభంలేదు. చక్కని నవల పట్టుకొని, కాళ్ళు బల్లమీదకి చాపి, నోట్లో పెద్దచుట్టపెట్టి, మీ గదిలో కూర్చోండి. ఎవరైనా వస్తే,—'Damn you Get out' అనండి. మీకు నచ్చినట్టు ఓ అమ్మాయిని తెచ్చుకోండి, కబుర్లు మొదలైనవాటికి.

కవులమూల poets'-corner కి మీ ఫోటో పంపుతారా? వాళ్ళు నన్ను పంపమని అడిగారు. "నా ఫొటో చూడాలని కోరుకునేటంత ప్రేమగల స్నేహితులు (Friends) నాకు లేరు. నా మొహం చూసుకోవాలనే vanity దాంబికం నాకు లేదు. కనక ఇంతవరకు నేను విడిగా ఫొటో తీయించుకో లేదు" అని వ్రాశాను.

ఆంధ్రపత్రిక వాళ్ళు వాళ్ళ జూబిలీ ఉత్సవసందర్భంలో నా అభిప్రాయం అడిగారు.

'ఆంధ్రపత్రిక అనేపేరు వినలే"దని వ్రాశాను.

క్రీస్తుశకంలో రాజమండ్రి వొస్తాను—క్రీసు అటువంటి పడితే తప్ప.

రాధాకృష్ణ (ఆయనెవరో నే నెన్నడూ చూడలేదు.) నా సంగతి మాట్లాడుతున్నారట—నా అభిప్రాయాలూ, నా వ్రాస్త కాలసంగతి. నా కేవో extension lectures ఇస్తారట. దానికి opposition వొస్తోందనీ, తనకి చాతకావటం లేదనీ అన్నారుట. దాని ప్రతిధ్వని అట్లా వినిపించివుంటుంది. కాని నేను ఏవిషయం మాట్లాడగలను? ప్రేమా, సుఖరోగాలూ తప్ప? వొప్పుకుంటారా వాళ్ళు?

శలవ తీసుకుని రండి. ఎవరూ కొత్తస్త్రీలు లేరు నాతో ప్రస్తుతం. కాని expect చేస్తున్నాను. వొచ్చినా, మిమ్మల్నిన్ని ఇబ్బంది పెట్టేసేను వాళ్ళని. Hop along.

శాస్త్రి పుట్టినపండగా.! ఆకవులసంగతి మిమ్మల్నిచూసి తెలుసుకున్నప్పుడు చాలావుంది మాట్లాడవలసింది. ఆ ఉమా కాంతం వాళ్ళ కవిత్వాన్ని చావబాదారు—కొంతవరకు అన్యాయంగా. కాని నాకు వాళ్ళని మనుషుల్ని చావబాదా లనిపిస్తోంది— atleast వాళ్ళజీవితాల్ని వాళ్ళ అభిప్రాయాల్ని ఆశయాల్ని; ఎప్పుడో ఓపుస్తకం వ్రాయాలి.

ఆ వెంకటచలం పోటీసంగతి—ఎవరో prize fighters వొచ్చి "మాకు ముద్దుకృష్ణ కనపట్టంలేదు—ఈ కాంపిటిషన్లు తీసుకోండి" అన్నారు.

"మీకు ప్రవరుడు కనపడలేదు గనక, ఆ రెండో నిర్భాగ్యుడు దొరికాడా? పొమ్మన్నాను."

షేక్స్పియరు పాటల్ని అన్నింటినీ Parody చేస్తున్నాను ఇట్లా—అవి ఎంత అన్యాయంగా చేస్తున్నానంటే, విన్నదా, పాతేసిన అతని కవిత్వాగ్నిశోకసి. సహస్రాబ్దాలోంచి కనులుతుంది. 18 కి వొస్తారా ?

ప్రతి సంవత్సరం వానించి విద్యార్థులు నేర్చుకునే ముఖ్య విషయం...

దేవుడు లేడని.

## ౨౮

బెజవాడ

24—1—34

మనిషి కోరుకోతగినవన్నీ న్యాయంగా జీవితంలో కావాలని అనుకోతగినవన్నీ ఉన్నాయి నాకు. కాని నేను విషాదంగా (miserable) గా వున్నాను. చాలాసార్లు ఆలోచిస్తాను. నేను తక్కిన మనుష్యులమల్లే, తృప్తిగా ఉన్న నాటితో సంతోషపడుతూనో వుండకూడదా? ఎందుకు ఉండలేను? ఉండను? అని.

ఈ సమస్య విప్పండి. చాతనైతే.

మీమీద దేవతలకి దయలేదు. నామీదా లేదు. కాని మీ మీద చాలామంది మనుష్యులకి ప్రేమ వుంది—నామీద స్త్రీలకి – వాళ్ళలో కొందరికైనా – తాత్కాలికంగానైనా (తాత్కాలికమైనదాన్ని ప్రేమ అనగలిగితే.)

నే నెరుగుదును, మీమీద ఎంతో ప్రేమవున్న ఒకరిని.

మీరు a rare specimen of good humanity ఎక్కడా దొరకనంత మంచిరకం మనిషిఅని ఆయనకి గౌరవం.

మీా బాధలేమిటి? కాక నాకుమల్లేనే బాధలేమీా లేకుం డానే బాధ పడుతున్నారా?

మొన్న నామనసుని నేను భరించలేక బాగా వాళ్ళుమరి చేట్టు తాగాను.

నా పాప చాలా అల్లరిది. నే నింతవరకు ప్రేమించిన మొదటిపాప. తమాషా, నేను ప్రేమించడం నేర్చుకున్న మొదటిపాప, మాకు పుట్టినపాప కాదు.

మీాకు 'జడకుచ్చులు' పంపుతున్నాను. అవి పెట్టుకోడానికి వీలులేనంత ముసలమ్మ (అయ్యంకి) దగ్గిర్నించి కొన్నాను.

ధనుష్కోటిలో చాలా మంచి చాపలు దొరుకుతాయిట. తినడానికి వెడుతున్నాను. మీారూ రండి. తరవాత girls కోసం ట్రావెన్‌కూరు – తరువాత కన్యాకుమారి.

## ౨౯

రామేశ్వరం
25—5—34

*My dear Stay-at-home,*

మెత్రీమేగజీనులో నాపేరుతో ఎవరువ్రాస్తున్నారో నాకు తెలీదు. నాపేరు నిలబెడుతున్నాడని ఆశిస్తున్నాను. ఈద్వీప మంతా తిరిగాము. సింహళానికికూడా దాటాము. రెండు మూడు స్థలాలలో కొన్నికొన్ని రోజు లున్నాము. ఏప్రదేశం నించిఐనాసరే కొబ్బరితోపుల్లోంచి నీలంగా సముద్రం మెరుస్తూ కనపడుతుంది, ఎంతో అందంగా. ఏచోటనైనాసరే ఇసిక బంగారంమల్లే వెన్నమల్లే మెరుస్తుంది. ప్రతిచోటా మంచి

హోటళ్ళు వున్నాయి. కాని అరవవాళ్లు తెలుగు దేశానికి వొచ్చినప్పుడే ఎక్కువ బాగా వొంటచేసేట్టున్నారు. చాలా అందమైన బంగాళాలలో కాలంగడిపాము. కొద్ది గజాల దూరంలో సముద్రం హోరుమంటో.

అన్నిట్లోకి యీ రామేశ్వరాన్ని నా హృదయం వరించింది. వొదిలి వెళ్ళడమంటే చాలా దిగులేస్తోంది. ఈసత్రం ఏ బంగాళాకంటెనూ అందంగావుంది—దూరంగా సముద్రం కనపడుతోంది. ఇసికలు చాలాగొప్పగా మెరుస్తాయి. ఇది యాత్రికులువచ్చే కాలంకాదు. గుళ్లోకూడా వొంటరిగా అట్లా తిరుగుతో వుండవొచ్చు.

ఈ ద్వీపమంతా శ్రీరాముడు తిరిగిన చిహ్నాలతో ప్రజ్వరిల్లుతోంది. ఇక్కడ శ్రీరాముడు తుమ్మాడు, ఇక్కడ కూచున్నాడు, ఇక్కడ నవ్వాడు, ఇక్కడ ఏడ్చాడు. భక్తి ఏమాత్రమూ లేనినాకు ఆలయంచూస్తే ప్రేమ. నా అందపు అభిరుచికి ఎంతో appeal అవుతోంది. జాజిపువ్వులు—పువ్వులోకల్లా ఇష్టమైనవి—చందనం, నాదస్వరం, హారతి, అన్నీ నాకు అమితంగా ఇష్టం. అన్నిరకాల దేశాలయాత్రికులు, బెంగాలీలు, గుజరాతీలు, ప్రతివాడు ఆ లింగం దర్శనంకోసం చచ్చిపోతారు. వాస్తవమైన emotion తో వొణుకుతారు. ముసలి వితంతువు, చిన్నపిల్లలు, సూటు (బూడ్సులు విప్లేదు) వేసుకున్న పెద్దమనిషి, ఏమీలేని బైరాగి—పెద్దస్తంభాలు, ప్రాకారాలు—subduedlight-మెత్తనికాంతి, శ్రావ్యమైన సంగీతం, గొప్ప గోపురాలు, విగ్రహాలు, ఆస్పత్రి నర్సుల

మళ్లీ ఎప్పుడూ సేవచేస్తో తిరిగేపూజార్లు—అట్లా ఆ ప్రదే శానికి అతుక్కుని పోతాను.

ఇంటినించి వూరినించి ఈ టపాలనేవి లేకుండా, దొరికింది తింటో, 'రేపు ఏమిటి?' అనేది లేకండా, అట్లాపాస్తో, అందరూ మరచిపోయిన ముష్టివాణ్ణై, యీ గొప్ప గుంపులో కలిసి పోవాలనిపిస్తుంది. కాని ఎంతకాలం వుండగలనో విసుకు పుట్టకండా! కాని ఎంత అందంగా వుంది!

ఎప్పుడో—ఒకసారి—మీరూ నేనూ . యీ ప్రదేశాలు దర్శించాలి—బుజాలమీద చిన్నసంచులు—ఈ ఆలయాల్లో పంచిపెట్టేవీ, అమ్మేవీ, ఆ ప్రసాదాలమీద బతుకుతో, కోట్ల కొలది ప్రజలు తొక్కిన యీ బండలమీద నిద్రపోతో— వొద్దామా? మీ శ్రీరాముణ్ణి మీరు స్తుతిస్తో, నేను వెక్కి రిస్తో...'మొత్తానికి ఇద్దరమూ అతిన్నే తలుచుకుంటాం' అంటారు మీరు.

శ్రీరాముడనేవాడే ఉండి ఉండకపోతే, ఇన్ని చిలవలతో పలవలతో ఇంతపెద్ద అబద్ధం ఎట్లా కల్పితమై వుంటుందా అని సందేహం తోస్తుంది.

లోపలికి వెళ్ళడానికి, పూజలకి, అన్నిటికీటికెట్లు. అంతా డబ్బుతోపని. అదిచూస్తే అసహ్యంవేస్తుంది. కాని ఇంకో విధం ఏముంది అనే ఆలోచనవొస్తుంది మళ్ళీ.

ఈవాళో రేపో కుర్తాలం వెడుతున్నాము. అక్కణ్ణించి ఇంకా దక్షిణానికి, బహుశా కన్యాకుమారిదాకా.

తోవలో రామనాద్ చూస్తాము, రాముడితో నిండిన ఇంకో ప్రదేశం.

మీ రాముణ్ణి చూస్తే నాకు ఇష్టంవొచ్చిందనుకోకండి. కాని సుందరమైన యీ ప్రదేశాల్లో ప్రతిమూలా ఏదోఒకటి చేశాడు ఆరాముడు. ఎక్కడా ఆ కుంకనితప్పించుకోలేకుండా వున్నాను. నాకు ఇష్టమైన చల్లని చక్కనిచోట్లనే అతనూ ఏరుకున్నాడు, పూజలు చెయ్యడానికీ- ఏడవడానికీ. అతని విరహం నాకు తెలుస్తుంది—అతను భార్యకోసం—నేను ఎప్పుడూ మారే నా అనంతపథ సహచారిణికోసం.

చాలా enjoy చేస్తున్నాను.

మీకు తెలుసుకదూ, నన్ను సేతువుకివెళ్ళి తిలహోమం చెయ్యమని శుకుడు ఆజ్ఞాపించాడని. నిన్న పూర్తిచేశాను ఆ తంతు. భయంకరమైన ఆపని ఆరుగంటలు పట్టింది నాకో తల నెప్పినిచ్చింది. నన్నుచూడవలసింది మీరు—మెళ్ళో దంధ్యం, తడిబట్టలు, నానుదుటకుంకం. చేతిలో పూజాద్రవ్యాలపళ్లెం, ఈవూరి వీధులంబడి—సముద్రానికి నడక, ఏమైతేనేం—జన్మకి మతపు humbugకి లోబడడానికిఇదేఆఖరు.(God help me)

'పేరాసిపెద్దమ్మ' అని వ్యాసం వ్రాయపోతున్నాను. ఆమెని చరిత్రస్త్రీగా. మీరూ వ్రాయండి! న్యాయంగా అది మీరు వ్రాయవలసిన విషయం.

'ఈ హోమంచేస్తే, నీదుఃఖం నయమవుతుంది' అన్నాడు శుకుడు. నయమవుతుందా? ఎంతో చల్లగావుంది.. ఇక్కడ రాత్రులు చలి.

## 30

తిరువనంతపురం, Public Gardens

9—6—34

*My dear Goose,*

ఈతోట అద్భుతమైన అందాలు వొలికే ప్రదేశం. ఈ పర గణాకి ఎండాకాలమనేది లేదు. పడమటికనుమల wild సౌంద ర్యంలోనించి దాటివొచ్చాము ఇక్కడికి. కన్యాకుమారి దివ్య మైన లావణ్యాన్ని చూడగలిగాను. ఆకారంలో, రంగులలో, ఇంత అంపమిచ్చే స్థలాన్నివొదిలి వెళ్ళవలసిరావడం హృద యాన్ని చీల్చేస్తోంది. ఈ సముద్రాన్ని, అడవుల్ని, కొండల్ని వొదిలి, బెజువాడలో సిరామచ్చల బల్లముందు కూచోడం తప్పదనుకుంటే, బతుకుమీద రోతకలుగుతోంది. ఈ సౌంద ర్యాన్నిచూసి, జీవితమంతా యీ జ్ఞాపకంతో బాధపడేగతిని తప్పించుకున్న మిమ్మల్ని తలుచుకొని ఈర్ష్యపడతాను.

ఇక్కడి బతుకు చాలాచవక. పెద్ద పనసపండు రెండణాలు. పెద్ద అనాసపండు అణా. తినితిని జబ్బుచేసింది. అంత బీదరి కంలోనూ, ఈదేశపుస్త్రీల ముఖంమీద తృప్తిలో మునిగిన మాధుర్యం కనపడుతుంది. Sex consciousnessఅనేది లేనే లేదు వాళ్ళల్లో. తినడానికి,పిల్లల్నికనడానికీ చాలినంతభాగ్యం వుంది వీళ్ళకు—విలాసాలకి ఏమాత్రమూ మిగలదు. ఇంత పెద్దపట్టణంలో గ్రామఫోనుచుట్టూ ప్రజలు మూగుతారు, ఈనాడుకూడా. బళ్లు ఆగవలసి వొచ్చేటంత గుంపు. మీరు వుంటే ఎంతబావుండేది!కన్యాకుమారి యింద్రజాలమల్లేవుంది.

30

బెజవాడ

11--11—34

*My dear Deekshitar,*

కనిగిరినించి ఇక్కడికి వొచ్చింది మీవుత్తరం తారీఖు తో బాటు, నెలతోబాటు, సంవత్సరంకూడా 11 అని వెయ్య గలిగితే ఎంత బావుంటుంది! 1911 లో నేను S. S. L. C. చదువుతున్నాను.

నా ఉమాసుతరావుని వొదిలి అప్పుడే నెల అయింది!

So farewell beautiful Kanigiri !

కనిగిరిలో తమాషా అనుభవం. నాకు పరిచితురాలుకాని ఓ హైస్కూలు అమ్మాయిఅర్ధరాత్రినాయింటికివొచ్చి నన్ను లేపి, తనని మోహించ (make love) మంటుంది. A fine girl ! How passionate she was !

నన్ను రాజమండ్రికి వెయ్యకూడదూ ఈసారి! మనంఒకరి కొకరం ఓదార్పుగా వుంటామని అనడం నాకు చాలా గర్వంగా వుంది.

చాలాసార్లు అనుకున్నాను మీకు వ్రాయాలని. కాని కాయితాలమీద వ్రాయగలిగింది ఏమీలేదు. ఇన్నాళ్ళు. మనం సమక్షంలో మాట్లాడుకున్నేమాటలే, మన నిజమైన అభిప్రాయాల్ని వెలిబుచ్చలేవే... అందులో యీ వ్రాత మాటలు-అందులో-యీతుక్కు హింగిం బాదమ్సు కలంతో వ్రాసినవి—గోడలూ, నేలా, బొమ్మలతో అలంకరించడానికి నాబేబీ కిచ్చాను యీకలాన్ని మరి—ఏమీ తెలియచెయ్యలేవు.

అవును నాలోమార్పు మీరూ గమనించారా? కాని మీకు ఇష్టంగా వుండేట్టు మారానా? అదీ ముఖ్యం.

అవును—వ్రాతలలో చాలామంది నన్ను అనుకరిస్తున్నారు. నా పదాల్ని దొంగిలిస్తున్నారు – కాదు, వాక్యాలనే అట్లాగే వేసేసుకుంటున్నారు. ఒకతను నావాక్యంతో కథ ప్రారంభించాడు.

ప్రతిరోజూ ఉదయం రెండుమూడు గంటలు కథలూ, నాటకాలూ వ్రాస్తున్నాను.

ఏదో ఓరోజు రాజమండ్రి రావాలనివుంది. కాని కొత్త వ్యాళ్ళు నాకు గుబులుపుట్టిస్తాయి.

ఈమధ్య స్పెన్సరులో తాగుతున్నాను – చాలా ఎక్కువగా, కాని ఎప్పుడూ స్మృతితప్పటం లేదు ఎంత తాగినా.

ధర్మపురి ఒంగోలు హెడ్మాస్టరు ఇప్పుడు. ఒకగంట బతిమాలాడు తనకింద ఉపాధ్యాయుడుగా నన్ను రావొద్దని. నా మీద అతనికి చాలా ప్రేమ.

రంగదాస్ – I deserve absolutely no credit అది వ్రాసినందుకు నాకేమీ ఘనతలేదు. నాకన్న గొప్ప రచయిత వ్రాసిన నాటకాన్ని తెలిగించాను.

పుస్తకం ఇవ్వటానికి నా షరతులు – ఒక edition అచ్చు వేసుకోవచ్చు, కాపీరైటు ఇవ్వను. పదోవంతు కాపీలు నాకివ్వాలి. పుస్తకం బావుండాలి.

## ౩౨

బెజవాడ

26—11—35

ఉత్తరాలలో మర్యాదలూ మన్ననలూ మానేస్తున్నాను. కనక తప్పర్థం చేసుకోకండి. నే నెట్లావున్నానో అనే మీ ఆదుర్దా నన్ను చాలా ప్రేమతో కావిలించుకుంది. అంతదయ మీనుంచితప్ప నా కెక్కడనుంచి వొస్తుంది?

(ఆమెకోసం నాబాధని) నేను తాగి మఱచిపోగలిగితే బావుంకును. కాని ఆ అదృష్టం లేదు. నాకు దానికి కావలసిన డబ్బు, శక్తి ఏవీలేవు. Except the comapny drink has no charm for me. మర్నాడు తలనొప్పితో ప్రాయశ్చిత్త మవుతుంది. స్త్రీతప్ప నన్ను గట్టిగా కదలించగలది ఏదీ లేదు.

స్త్రీకోసం జీవితాల్ని ధ్వంసం చేసుకున్న వాళ్లని, అంటే కీర్తి. డబ్బూకాదు — అంతకన్న శ్రేష్ఠమయినవి—జీవితంమీద ఆసక్తినీ—శక్తినీ-బతకడంలో ఆనందాన్నీ, (Grip on life and joy of living) పోగొట్టుకున్న వాళ్లని చూస్తే —నేను చాలా వివేకవంతుణ్ణిగా తోస్తాను.

నే నెవరితోనూ మాట్లాడటంలేదు, వారాలకి వారాలు ఎవరికీ వ్రాయను. అందుకనే ఇట్లా ఒకటే వ్రాస్తాను మీకు. సరే, తిరుమన్నామలై వెడదాము.

ఇంతకన్న నేను పొందవలసినదీ, నేను పుస్తకంగా వ్రాయవలసిందీ ఏముంది ?

నేను పనిలోనించి విరమించుకోవా లనుకుంటున్నాను. I am sick of these Training Schools. అందుకనీ, బెజ వాడకి కనిగిరి చాలా దూరమనీ, ఆత్మలేని ఆ హెడ్మాష్టర్ని భరించలేక శలవపెట్టాను. పాపంహృదయాన్నిమూలమూలలా గోకాడు నామీద యిష్టం చూపేందుకు Wmas batcha. వీళ్ళందరికి నన్నుచూస్తే ఈర్ష్య. అందువల్లనే వాళ్ళకినన్నెంత యిష్టపడాలన్నా వాళ్ళకి చాతకాదు.

నేను భారతి చదవను.

## 33

బెజవాడ

9-12-35

*My dear Saint,*

మొన్న ఎవరో మిమ్మల్ని చెడ్డగా మాట్లాడుతున్నారు — ఏమిటా చెడ్డ అనేది ఏకోశానా లేని మిమ్మల్ని! పోనీ తప్పుగా అర్థంచేసుకునేందుకు వీలిచ్చే ఏపనీ చెయ్యని మిమ్మల్ని. పంతం పట్టి ప్రజలు విషయాన్ని ఎందుకూ వంకరతిప్పి అర్థంచేసుకుం టారు? Wodehouse అర్థంకాదేమో వాళ్ళకి. మొన్న ఒక స్నేహితుడు వోడ్‌హవుస్ కథనిఅడిగి నాచేత రెండోసారి చదివించుకుని, మెచ్చుకుంటో, ఆనందిస్తో, చప్పున అన్నాడు కదా—"నాతోడి వకీళ్ళు ఎంతమందికి ఈకథని ఆనందించే శక్తి వుంటుంది?" అని.

అప్పుడు అతని అభిప్రాయం తప్పనుకున్నాను, కాని ఇప్పుడు తెలుస్తోంది నాకన్న మనుషులసంగతి అతనికే ఎక్కువ

తెలుసునని ఇంగ్లీషు తెలిసినవాళ్ళు చక్కలిగింతలుపెట్టే వోడ్‌హౌస్‌నీ, తెలుగు తెలిసినవాళ్ళు (స్తోత్రాలనుకోకండి) మీ మృదువైన తాకుళ్ళనీ (touches) ఎట్లా మెచ్చుకోని ఆనందించకండా వుండగలరో నా కర్థంకాదు. నిన్నరాత్రి నా admirers కొంతమంది, మీ వోరూధినీ, చెంచు – తప్ప తక్కినవన్నీ వుత్త తుక్కుఅన్నారు అంటేనేం? నేను చిరునవ్వునవ్వి, వాళ్ళు సురి వెంకటచలారాధకులవడంవల్ల మీ ప్రాశస్త్యాన్ని గుర్తించటం లేదనుకున్నాను.

డబ్బులేదు యీశెలవల్లో. మళ్ళీ ఎక్కడో చేరాలి. కాని మళ్ళీ ట్రెయినింగువిద్యార్థి మొహంచూడడమంటే అసహ్యంగా వుంది. ఇట్లా సోమరిగా కూచోడం, పనిలేకండా తిరగడం, ఏఉద్దేశ్యమూ లేకండా కలలుకనడమూ, నా fate మీదా, బలహీనత్వంమీద బలహీనంగా తిరగపడడమూ – ఇట్లా నన్ను వొదిలేస్తే బావుండును.

రాజమండ్రి వొస్తానా? చాలా సందేహం. కదలడమంటే చాలా బద్ధకం. నేను వొస్తే గొప్ప 'మిరకిల్' అద్భుతంజరిగిందన్నమాట. ఇట్లాకూచుని నీలాకాశంమీద చల్లనిగాలిలో తేలుతో మారిపోయే తెల్లని మబ్బులవంకా కాలవదగ్గరపోయే పడవల తెరచాపలవంక చూస్తోవుండటం—నేను వీటిని వొదిలి కదిలిరాలేను. ఇదేమన్నా జబ్బా! కదలడంఇష్టంఉండదు? పని అంటే శ్రమ. ఈ రెండునెలల శెలవల్లో ఇక్కడకోర్టు, బ్యాంకులు, వర్తిపన్ను ఆఫీసులు, వకీళ్ళు, డాక్టర్లు, చివరికి హెడ్మాస్టర్లు, ఈబరువులన్నీ ఎట్లావుపేక్షచేసి తప్పించుకొని, నిర్వృత్తిని అవలంబించానో మీకువ్రాయగలిగితే, మీకు అర్థమౌతుంది

ఎందుకు కదలటం నాచేతకాదో! కదలడం, మాట్లాడటం, వేలు కదిలించడం ఇష్టంలేదు. ఎక్కడో ఏమిటో చెడిపోయింది నాలో. మీకూ నాకన్న ఇంకా సుఖం, సోమరితనం ఇష్టమై కూడా, ఎర్రని ధర్మదీక్షకిలొంగి, కాలాన్ని బలియిస్తారు.

పెద్దాడ కామేశ్వరమ్మ మాయింటికి వొచ్చింది. shallow and sweet.

## 3౪

నెల్లూరు
9-3-37

*My Dear Fast-becoming slave to a son-in-law,*

ఏంచెయ్యను నేను మిమ్మల్ని రాజమండ్రినించి బెజవాడ రప్పించేందుకు—లేని, చెవిటి, గుడ్డి, దేవుణ్ణి ప్రార్థించనా?

ఈ నెల్లూరులో నాకు ఆ Paul Brunton ఎక్కడ దొరుకుతుంది? చాపలుతప్ప ఇక్కడ ఏమీ దొరకవు. నెల్లూరుపురాణాలు పుత్తకథలు (myth).

The fast ones are ugly
The loose ones nasty.
క్రిష్టియను పిల్లలుతప్ప.

పిచ్చిఅయ్యను నన్ను ఆడపిల్లలబడికి ఎందుకు మారుస్తాడు? వివాహాన్ని గురించి నాఅభిప్రాయాలు ఇట్లాంటివని complain చేస్తున్నాట్ట. నేను బళ్లో భోగం అమ్మాయితో సరసాలాడుతున్నానని సు—పైకి వ్రాశాట.

అవును నాకు ఎప్పుడూ తెలుసు. నాకన్న మీకే ఆడవాళ్ళ సంగతి బాగా తెలుసునని. సౌందర్యాన్ని ఆరాధిస్తున్నాను, ఇన్నాళ్లూ, పైభాగాన్ని. ఇప్పుడు darker side realise చేస్తున్నాను. వ్రాతల్లో చూపుతున్నాను.

ఈమధ్య చాలా ఉత్సాహంగా సంతోషంగావుంది. ఏమీ కారణం లేకుండానే—తెలీదూ మీకు—అదే—వూరికే బతికి వుండడమే ఆనందంలాగు. ఈ బడి నాలుగు మూలలా, చిరునవ్వుల్ని సంతోషాన్ని వెదజల్లుతున్నాను. నా విద్యార్థుల idol ని—కాని అందరూ మొగాళ్లు—రాత్రి వాచరుకికూడా భార్యలేదు. కుక్కకూడా మొగది ఈ ఆవరణలో.

నిన్న రాత్రి వెన్నెల ఎంత బాధించింది! నపుంసకుడిబాధ తెలిసివస్తోంది. కోర్కె, కాని వీలులేదు.

ఎప్పుడు పెళ్ళి! ఎక్కడ? ఎప్పుడు?

'మేట్' లేకండా గంతులేసే చలం.

ఒకటే సృష్టిస్తున్నాను, సాహిత్యంలో—నా వీర్యశక్తిని కథల్లోకి— transmute చేస్తున్నా ననుకుంటాను.

## 38

నెల్లూరు
1-5-35

*My Dear Ram,*

మానం భక్తుడి భూషణం.

మీమీద కోపంగావుంది. నా వ్యాసం 'ఆనందం' బావున్న దన్నారు మీరు. కాని మీరు ఆ పత్రికని విమర్శిస్తే, నా వ్యాసం

సంగతిమాత్రం ఏమీ వ్రాయకుండా వూరుకున్నారు. ఎందుకు? నాకు ఎడ్వర్టైజుమెంటు అక్కర్లేదని మీకు తెలుసు. కాని మీరు—మీరే—మీవంటివారే—నా గొప్ప స్నేహితులు, చివరికి మీరుకూడా, నాసంగతివొదిలేశారంటే బాధకలిగింది.

పోనీండి ఆసంగతి.

ఈపత్రికలసంగతి ఏమంటారు? కథలకోసం వాళ్ల గోల ఎట్లా భరిస్తున్నారు? 'భక్తి' మీద వ్యాసాలువ్రాసి వాళ్ళ మొహాల గుమ్మరించరాదూ!

## 3౬

నెల్లూరు
౭8—6—35

*My dear Astrologer,*

ఈ సంవత్సరం నాకు గొప్ప విషయాలు జరుగుతాయి అంటున్నారు జ్యోతిష్కులు. ఈ వాగ్దత్తాలు చాలాఐనాయి. మోసపోవడం మానేశాను. ప్రతి కొత్త జ్యోతిష్కుడూ నా అదృష్టాన్ని ఓ సంవత్సరం వెనక్కినెట్టేస్తాడు. Quite right. జీవితం అంతే. వాటిమీది రుచిపోయినప్పుడే, గొప్పసంగతులు తటస్థిస్తాయి— అట్లానే వేదాంతులు తయారుకావడం ఇట్లా disappoint అయి ఈలోకంలోని మధురమైన అనుభవాల్నీ, లోకాన్నీ ప్రేమించవొద్దని బోధించడం ప్రారంభిస్తారు. It is all stupid and bitter—అయినా ఇంక నాకు కావలిసింది ఏముంది? ఎప్పుడు మళ్ళీ ప్రేమలో చిక్కుకుంటా

వనితప్పు! (When am I to have a nice love-affair?) శుక్రుడు నా జాతకంమీద పనిచెయ్యడం ప్రారంభించాలి. Venus will have to take me in hand. When? When I am sans eyes, sans teeth, sans p—?

సుబ్బారావు ? ఓకథ చెప్పలాడు—

ఒక జ్యోతిష్కుడు ఒకాయన్ని అన్నాట్ట.

"మీకు గొప్పతనం, భాగ్యం—అన్నీ మూప్పై రెండో యేట తట స్తిస్తాయి."

"ఆయిస్సు!"

"ఇరవై తొమ్మిదేళ్ళు."

Am I bitter ? మధురమైన దీక్షితులుగారిమీద కాదు — క్రూరమైన యీ జీవితంమీద—నాకోపం. ఈ బడిమీద ద్వేషం—ఎవరన్నా నన్నిస్కూలునించి తప్పిస్తే ! ఏ డిక్టేట రన్నా యీఅధికార్లనందర్ని చంపేస్తే!—జీవితాని కేశాపాలు యీ పాఠశాలలు—curse of life, సుందరమైన బాల్యానికే పీడకలలు, ఉజ్వలమైన యవ్వనానికి వినాశ కారణాలు— ప్రస్తుత విద్యని తిడుతో. మూడుకరుకు కథలు వ్రాశాను.

తేదీకై నిరీక్షించుడు.

ఫిల్ముకి ఒకకథ వ్రాశాను. మహామహావాళ్ళంతా మెచ్చు కున్నారు. ఒక్కరూ కావాలనరు. ఈ లోపల ఎవడో ఓడ: 'ప్లాట్' కాజేసి తన సొంతమంటాడు. ఇదీ మీ విశ్వనాథసత్య నారాయణగారు కీర్తించే ప్రజ్వల ఆంధ్ర.

yes I too am dull.

పదెంటికి ఈబడికి వెళ్ళడమే లేకపోతే ! నాకుఉపాధ్యాయుడుగా ప్రమోషన్లు అంటున్నాడు మీా జ్యోతిష్కుడు. నా పిల్లలతో కలిసి వీధుల్లో పాకుకుతిరిగేవాణ్ణవుతానేమో కనుక్కోండి, సారస్వతకీర్తా ! నాకు ! ! !

తుక్కు. ఈ పాఠశాలల బురదనుంచి నన్ను తప్పించేటంత డబ్బు ఇస్తుందా ఆకీర్తి !

మీారే ఇక్కడికి బదిలీ అయితే యీాజీవరాహిత్యాన్ని సంతోషంతో భరిద్దును.

My God, these model lessons and observation books.

Hell.

That H. m's face !

## 32

బెజవాడ

28—6—35

*My Dear Mosquito-Killer,*

మీాదోమల మహాసభ చాలా బావుంది నాకు, అట్లాంటివి వ్రాయడంలో మీాసమానులు లేరు. నే నీయాడాది లోపలే పని మానుకుందా మనుకుంటున్నాను. జాతకాలూ, సాముద్రికాలూ మానుకోనంటున్నాయి.

మిమ్మల్ని నెల్లూరుకన్నా, నన్ను రాజమండ్రికన్నా, ఇద్దర్నీ గుంటూరికన్నా ఎందుకు బదిలీ చెయ్యరు ?

నేను వ్రాసిన 'మృత్యువు'ని గురించి—Thanks for your assurance. ఏమిటంటే, నేను ప్రేమ కథ వ్రాసినప్పుడు, దాని విలువని నేను తెలుసుకోగలను. కాని ఆధ్యాత్మిక విషయాలు వ్రాసినప్పుడు, అర్థంలేని చెత్త వ్రాశానేమోనని భయమేస్తుంది. అందుకని ఇతర్ల అభిప్రాయాన్ని అడుగుతాను.

సరిగా మీ రర్థం చేసుకోగలగడం అది మీ మంచితనం. ఏ మనిషి ఇచ్చే పరిష్కారాలైనా (solutions) ఈ ప్రపంచ సమస్యల్ని తీర్చగల సత్యాలైతే, (ముఖ్యంగా నా solutions) ఈ ప్రపంచం చాలా స్వల్పమైన ప్రపంచమూ, దివాలాఐన దేవుడూ ఐవుండాలి. Indeed it would be a poor world and a bankrupt God, if any man's solutions will be anything approaching truth- especially mine.

కాని నేను నిశ్చయంగా తెలుసుకోవాలనుకున్న దేమిటంటే, అది (మృత్యువు)ఆలోచించేట్టు చేస్తుందా—మనుష్యులకీ, పనులకీ వాళ్ళు కలగనలేని కొత్త విలువలు వున్నాయని తెలుసుకునేట్టు చేస్తుందాఅని. And perhaps it would be only you who could understand and appreciate my struggle to analyse and adjust and understand this complex world.

మీరు గొప్పవారవుతున్నట్టు కనబడుతోంది. స్పెల్లింగు తప్పులు వ్రాస్తున్నారు. స్పెల్లింగు జాగ్రత్తగా వ్రాసేమనిషి,

అల్పుడూ, నీచుడూ. calculating అని నా నమ్మకం. ఉదాహరణం రామక్రిష్ణరావూ, వెంకటశివుడూ.

మళ్లీ వొచ్చాను యీవూరు యీ పాడుపని చెయ్యడానికి. కాని పనిలో మునిగివుంటేనే, కొంతవరకన్నా ఇతరులకు ఉపయోగపడుతో, నా విచారాన్ని మరుస్తాను.

మీకు అల్లుడా! చాలా ఖర్చుకదూ సంపాయించడం! సంపాయించే ప్రయత్నంకన్న సంపాయించింతరవాతవుంటుంది అసలుబాధ.

ముద్దుకృష్ణబావ అతనిమల్లేనే మాట్లాడుతాడు—విధం—మనోతత్వం— boring అంతా అతనిఅచ్చు. ఎవరుఎవరిదగ్గిర్నించి నేర్చుకున్నారో, ఆ యిద్దర్లో!

మీ నించి కాకపోతే, (మృత్యువుని) అంత మెచ్చుకోడం ముఖస్తుతికింద కట్టేవాణ్ణే. కొత్త అన్వేషణానికి మీవుత్తరం నాకు కొత్త ధైర్యాన్ని ఇస్తోంది.

# 3౦

నెల్లూరు
15–7–35

*My Dear Science,*

నే ననుకున్నట్టే, నా 'మృత్యువు' చదివేవాళ్లకి అర్థంకానంత కష్టంగావుంది. నేనిచ్చిన ఒకటి రెండుదెబ్బలు వాళ్ళకి బావున్నాయి. జీవితం క్రమంగా బాధాకరం అయిపోతోంది నాకు.

I have lost my bouyancy, but not my boyancy yet. జీవితపు ఘోరమంతా ప్రస్తుతం నా బొటనవ్రేలుమీద సకుప్తంలో కేంద్రీకరించింది.

జాగ్రఫీ, హిస్టరీ పిల్లల అభివృద్ధికి ఎంత భయంకరాలో బోధిస్తున్నాను. గడిచిన పదిరోజులూ చాలా మనసు బాధలో వున్నాను. ఎంతకాలం ఇట్లా ?

ఎవరోసాముద్రికుడు నాబతుకుని 51 వరకేననిక త్తిరించాడు. చాలావుంది నే నీ ప్రపంచంలో చెయ్యవలసింది. అంతత్వరగా వెళ్లిపోవాలంటే, నన్ను చూసి దిగులుపుడుతోంది. నా జాతకం చూడండి నిజమేమో, చాలా భీమూఅన్నా చేస్తాను.

ఏం విశేషాలు?

When is my new love affair ?

సుందరమైన మీ ఆత్మని హోమోపతీమాత్రలకింద దాచుకోకపోతే, అపారమైన కీర్తి సంపాదించిన ఇంకో గొప్ప దీక్షిత్ ఉన్నాడని తెలిసేదిపోను. మీ రెంత పొడుగో అతను అంత లావు. మీరు మాటలతో ఎంత హాస్యం కల్పిస్తారో, అతను మొహంలో అంత చూపుతాడు.

I wish I too could sell my Muse, in exchange for the goods you got. అట్లాంటి వాతావరణంలో(అందమైనహైస్కూలు అమ్మాయిలు)పదిజన్మలవరకు ఒక్కమాట వ్రాయలేకపోయినా దిగులుపడను. అప్పను యీ ఆడపిల్లలు అల్లాంటి చిక్కుల్లోకి దిగుతారు. గోలపడకండి. అల్లాంటి అసహ్యపు గోలలు మీరు పడలేరు.

నాలుగురోజులకిందటే, నన్ను ఆరుగంటల్లో ఒక యిల్లువా దిలి పొమ్మన్నారు—ఓ విద్యార్థిని నాకోసం వొచ్చిందని. ఆ అమ్మాయీ, ఆమెఅక్కా వచ్చి గంటలకొద్దీ కూచుంటారు, ఏమీ పనిలేకుండా, నాకు ఇబ్బందులు కల్పిస్తూ. వాళ్లని వెళ్ల మనను—నేను పిరికివాణ్ణి అని feel కావటం నామనసొప్పదు.

కడపటి వార్తలు.

1. మా హెడ్మాస్టరుకి ముసలికోపమో, అజీర్ణమో పుడు తోంది.

2. ముయ్యడానికి తలుపులు లేని సగం పడిపోయిన యింటో కాపరం నేను.

3. ఈవారం పద్మావతి వస్తోంది ఇక్కడికి.

4. మా పిల్లలు రుషీవాలీబడికి స్వస్తి చెప్పబోతున్నారు.

## ౩౯

బెజవాడ

24–8–35

*My Dear Gander,*

ఈ నిమిషాన మాయింటిముందు డాక్టరు మూంజీ ఊరే గుతున్నాడు.

అవును. వినోదినిలో నన్ను చక్కగా మెచ్చుకున్నారు జ్వాలలో మీసంగతీ, నాసంగతీ, ఆ నాటకమూ, దేంటోనూ జవలేదు— insipid and half hearted.

ఆ కే.శాస్త్రి మీసభాపతి; నేను పురాణవనితల్ని తిడుతు న్నన్నాళ్లూ, నాకు విరోధంగా ప్రచారంచేశాడు. ఇప్పుడు

ముద్దుకృష్ణే ఆపని చేశాడుగనక, అతను రామాయణంలో పనిలేకండా చేసిన ఆ మార్పులన్నీ, స్నేహితుడికోసం వొప్పు కోక తప్పక, ఏదో ముక్కుతో మూలుగుతో నాపోరుకూడా ఎత్తడం తప్పిందికాదు అతనికి.

ఇప్పుడు ముద్దుకృష్ణ Editor of the Strand అను కుంటున్నాడు తను.

మీ వుత్తరం ఎంతో ఉత్సాహజనకంగా వుంది.

ఈ బళ్ళల్లో పనికీ, సంసార జీవితానికీ, సరిపుచ్చుకోలేక, జీవితమంతా ఈవిధంగా బాధపడే రాతవున్నవాణ్ణి నేనొక్కణ్ణే అనుకున్నాను. ఆ బాధలే మీకుకూడా వున్నాయంటే ఆశ్చ ర్యంగావుంది.

చాలా కాలంకిందట నేను వివేకానంద చదవటానికి ప్రయ త్నించాను. ఆయన వుపన్యాసాలు; తక్కువరకం మేధావులకి పసికివచ్చేట్టు, బాగా సెళ్ళుకలిపినట్లు కనపడ్డాయి. మళ్ళీ ప్రయ త్నిస్తాను. పోయిన Sunday Timesలో అరవింద అనుబం ధంవేశారు. అతని యోగ అభిప్రాయాలతో ఏకీభవించను— వ్యాసాలన్నీ చెప్పిందే చెప్పారు. కాని చదివినప్పుడల్లా ఏదో నిర్మలవాయువులు వింతపరిమళాలతో నాపైని వీచినట్లయింది. ఆకాశం కొత్త అందంతో వెలిగింది 'అలంకారంగాకాదు, నిజంగా కొత్త అందం కనిపించింది)

మీరిచ్చిన అధికారాన్ని పురస్కరించుకుని(దోమల మహా సభ అనే కథలో) పెన్నులో చాపలచేత—ప్రతివారినిగుంచీ,

ప్రతి విషయాన్ని గురించీ,utter non- sense మాట్లాడిద్దా మని బుద్ధి పుడుతోంది.

మొన్న నెల్లూరికి పద్మావతి వొచ్చింది. కన్నడంలో రాసిన మండోదరి అనే నాటకాన్ని నాకు తర్జుమా చేసివినిపించింది. ఆ నాటకంఎంత గొప్పదో మీకు తెలీదు. మీరుదాన్ని తెలుగు చెయ్యకూడదూ ?రామాయణంకథకి ఏమార్పూ లేకండా నే—— ఎంతో అద్భుతంగావుంది, మండోదరి మాట్లాడిన మాటలు వ్రాస్తే ! మీరు ఉప్పొంగిపోతారు ——పూర్వాచారంగా వుంది. కాని కళ— గొప్పది.

౪౦

బెజవాడ

2-10-35

*My Gear Bhagavathar,*

చాలా పెద్దజ్వరంలో చాలా బాధపడి నయమవుతున్నాను. Enjoying this Brave new world,full of sparrows and stones.

ఈ శెలవుల్లో మీరు పెళ్ళికొడుకులవేట కానియ్యరాదూ! Subbarow offers Tenali as a fair hunting field bristling with వైదీకి victims. మాలతీబాయిగారికి చాలా సంబంధాలు తెలుసు. మిమ్మల్ని ఇక్కడికి రప్పించ గలిగినంత ఆకర్షణనుచూపానా? ఈవుత్తరం మీభార్యగారికి వ్రాయవలసింది. ఆమె మిమ్మల్ని ఈవేపుకి తోలేవారే !

నన్ను అండమాన్సు బదిలీచేస్తారేమోననే భయంతో మద్రాసు వెళ్ళాను. 'వీడు వొద్దుమొర్రో !' అని నా

D. E. O. అంటున్నా, నన్ను మళ్ళీ ఆ బడికే పంపారు. పిచ్చుగారు అన్నారుకదా,

'ఏ అధికారీ నిన్ను వొద్దంటాడు. తెలుగుజిల్లాలు ఆఖరవుతున్నాయి. నిన్ను ఇంక ఎక్కడికి పంపను ?' అని.

ఏమంటారు ?

నన్నే అధికారిగా వేస్తేనేం మరి ?

శుకుడి జ్యోతిషంఏమయింది? ఆకీర్తీ, సంపదా, అభివృద్ధీ, ప్రమోషనూ, ఏవీ అవన్నీ ? ఈ సంవత్సరంలో ఇల్లుకడతానన్నాడు. వున్న వొక్కయిల్లూ అమ్ముతున్నాను. ప్రమోషను అన్నాడు. నన్ను! నన్ను ! ఎవరు ప్రమోషన్ చేస్తారు ? నన్ను ? మనం ఇరుక్కున్న యీ గుడ్డిసందులోంచి మనని ఎవరు బైటికి లాగుతారు? కీర్తి అన్నాడు. ఎంత అపకీర్తి యీఏడు నాకు ?

నన్ను రాజమండ్రి బదిలీచేసినట్టు కలవొచ్చింది.

ఎట్లా వున్నారు మీరు ?

డిశంబరులో కలుసుకుందాము.

సారస్వత ప్రపంచం ఎట్లా వుంది ?

## ౪౧

నెల్లూరు
1935

*My Dear Boss-server,*

మీ రెండుకార్డూ ఇక్కడ టీచర్లు చదివారు. టీచర్లకి ఇతరుల వుత్తరాలు చదవడం ఒకలక్షణంలాగువుంది. చదివి,

నాకు ఎవరో ప్రియురాలు వ్రాసిందనుకున్నారుట. నా అదృష్టంలేదనీ, అంత అందమైన హస్తాలూ, పాదాలూ, పెదవులూ, ఇంకా అమృతమైన హృదయమూ తప్ప, ఆలేఖరికి ఏస్త్రీ లక్షణమూ లేని పొడుగాటి జమాను, అని చెప్పుకోవలసి వొచ్చింది. పరమహంస చదువుతాను. కాని పుస్తకం ఎక్కడ దొరుకుతుందో ?

నా ఆరోగ్యం భయోత్పాదంగావుంది. ఇంటికి పోవాలనే కోర్కెతో సుంజుకుంటున్నాను. గంటలు లెఖ్ఖపెడతాను. మిమ్మల్ని కలుసుకుని నాకు యీ బాధంతా యేమిటో చెప్పుకోవాలని వుంది. కాని తెలుసా నాకు ఈ బాధయేమిటో ! చాలాసార్లు 'సంతోషంగా వుంటాను. కాని ఆనందంగా వున్నానా ? లోకానికీ నాకూ ఏదో సరిపడని సంబంధం ఏర్పడింది. నాకన్న గొప్పదాంటో దేంటోనో లయమైపోతే బావుంటుందనిపిస్తుంది. కాని అదేదో కనపడదు. నన్ను inspire చేసేందుకు కనీసం చీకటి సంకుచితమైన విశ్వాసం ఏమతంలోనో కుదిరితే బావుండును నాకు. ఏదో నిశ్చయం లేని సందేహంలో నా ఉత్సాహం నశించింది.

నన్ను వోదార్చేందుకు మధురమైన మీ సాన్నిధ్యం వుంటే ఎంత బావుండేది ! శాంతంగా మీతో గడిపిన గడియలు చాలాసార్లు జ్ఞాపకం వొస్తాయి. మళ్ళీ ఎప్పుడు కలుసుకుంటాము—మళ్ళీ ఇంక విడవనఖ్ఖర్లేకండా.

ఇక్కడ యువ్వనురాలు ఓ నౌకరు మనిషి వుంది. నన్ను తన రక్షకుడిగా పోషకుడిగా వుండమంటుంది. నాతో ఆడు

...గావుంది, ఆమెమీద నా కేమాత్రం
...నాకారికాదు. ఆమె ఏమొగాడితో మాట్లా
...డ మోకళానికి సిద్ధంగా చుట్టూ తిరుగుతో
... ఆమె ప్రియుడు. తమాషా ప్రపంచం!

౪౨

నెల్లూరు
28—1—36

*My dear poet,*

నన్ను ఎంతో దగ్గిర తీసుకుని మాట్లాడుతోందా అని పిస్తుంది మీ వుత్తరం. నేను మీ ఆంధ్రదేశానికి ఇన్నేళ్ళ మట్టి చెపుతున్న మాటే అది; వాళ్ళ స్త్రీలకి స్వేచ్ఛనిస్తే, యీ విపరీత మోహవ్యామోహం తగ్గుతుందని.

Yes. I know you don't fall in love because you have to stoop to kiss. I mean, beeing so tall; and love lifts me up as I have to aspire and rise on my toes.

ఆ కృష్ణాపత్రిక ఎక్కడ దొరుకుతుంది నాకు! ఆ పవిత్ర పత్రికకూడా నామీద అసహ్యపు రాతలు ప్రచురించడానికి సంకోచించదు. తన్మూలంగా సంఘనీతికి సేవచేస్తున్నానని విశ్వాసంగావును ఆ పత్రికాధిపతికి.

వారంముందే రాజుగారి మరణం నేను జోస్యం చెప్పాను కాదా!

ఇంక ఆంతరంగిక విషయాలు — మధ్యమధ్య జబ్బువల్లా ప్రేమవల్లా అభ్యంతరాలువున్నా యోగవ్యాయామం చేస్తున్నాను. ఆనందానుభవాలనీ, నాశక్తిని అభివృద్ధి చేసుకోవాలని నా ఆశయం — అంతేకాదు. అవసరమైనప్పుడు, ఆ సౌఖ్యాలు, వొదులుకోగల శక్తికూడా సంపాయించాలని.

కాని ఇంతవరకు — యీ ఆసనాలూ, ప్రాణాయామం, కొంతశాంతినీ, బాధా సుఖమూలేని స్థితినీ, ఇవ్వడంతప్ప, నా సుఖానుభవానికి ఏమాత్రమూ సహాయం చెయ్యలేదు. నా శరీరంమీద దమనశక్తిని (control) పొందాను, కొంత భాగం. నా సెక్సువాంఛ పూర్తిగా స్వాధీనమయింది. అంటే శరీరవాంఛ. ఎవరన్నా స్త్రీకి నేను కావలసివొస్తే(నేను కావాలనేవాళ్ళు ఎవరూ లేరులెండి) ఒక వారంముందు నోటీసు ఇవ్వాలి. ఈ ప్రాణాయామం చేస్తున్నంతకాలం నేను నపుంసకుణ్ణి. ఇంక శాశ్వతంగా అట్లానే ఐపోతానేమోననిభయంగా వుంది. కాని ఆ అపాయాన్నికూడా ధిక్కరిస్తున్నాను. నా యజమాని (యోగం) శాసించినకన్న ఒక్కముద్ద ఎక్కువ తినడం దుస్సాధ్యం. పోనీ నా జీర్ణశక్తి వృద్ధిచెందితే మాంసాహారంమాని, నా యిష్టంవొచ్చినవి — పులవలో, వొంకాయలో, మిడతలో, ఏవో వొకటి తిందును.

కాని ప్రశ్న ఏమిటంటే, నేను వొదులుకున్న సౌఖ్యాలకి బదులు నాకేమీ ఇవ్వనప్పుడు, ఇవన్నీ వొదులుకోడం ఎందుకని. ఇంతవరకు విరాగం (negative) తప్ప ఏమీ కనపడదు.

మితంగానే సాధనచేస్తున్నాను. ఒకటీ — యీ యోగం ఏదో శరీరాన్నీ మనసునీ నిర్మలంగా ఉన్నాయి అనేట్లు చేస్తోంది. makes you feel clean. కాని కవిత్వమూ, రసికత్వమూ నన్ను బాధిస్తున్నాయి. ఈ మారుతమూ, వెన్నెలా, అందమైనస్త్రీలూ, ఆకాశమూ, — వీటివల్ల గుండె కొట్టుకుంటుంది, ఆశపడతాను — కాని వారం నోటీసు — ఈలోపల ఛాన్సుపోతుంది.

నవ్వుతున్నారా ?

ఏమైతేనేం ? జీవితం నామీద దయతలుస్తోంది. రోజులు శాంతంగావున్నాయి — బాధా సుఖమూ— ఏమీ లేకండా— అశాంతీలేదు తీవ్రసుఖ సంచలనమూలేదు. ఏరోజో తుఫాను బద్దలవుతుందిగావును - సాముద్రికుడు చెప్పుతున్నట్టు.

Then I will paint this Nellore red

ఎట్లా వున్నారు మీరు ? రామకృష్ణా - (పరమహంస) అవీ ?

కనక ఇట్లా బతకాలీ మనం ? బతికి ? ముసలివాళ్ళమై చావాలీ ? తరవాత?

జార్జిగారికోసం హాహాకారం! మాంసం చాపలూ దొరకవు. ఈగలూ, దోమలూ తప్ప.

ఏదోవోటి వ్రాయండి నాకు.

పచ్చి విటమినులు తింటున్నాను. మనం సంతోషంగా పచ్చి విటమినులు తింటో కలిసి గడిపిన గుంటూరు రోజులు

జ్ఞాపకం వున్నాయా? ఈవిచారమయమైన జీవితంలో సంతోషంగా గడిపిన రోజుల్లో కొన్ని అవి.

మంచి మంచివి వ్రాస్తున్నాను.

౪3

నెల్లూరు
26—4—౩౮

*Darling Baby,*

గడిచిన కొన్ని సంవత్సరాలనుంచి మీకు వ్రాయాలని ప్రయత్నం—పొద్దున్న కొద్దినిమిషాలుండే చల్లనిసమయాలో యీ బడిమమ్మల్ని పంపి, పడకొండింటికి మా యిష్టప్రకారం, మాడడమో, చమటలూరడమో, నిశ్చయించుకోమని, బైటపారేస్తుంది. రాత్రులుబావుంటాయి, కాని వొంటరి పడక శాంతిని భంగంచేస్తుంది—అందులో కొద్దిగజాల దూరంలో నవ్వే సుందరి—అయితే కొన్ని అడుగులు దూకాలి నామేడమీద నుంచి అందని ఆమెకోసం. ఈ ఎండాకాలం ఇంటిదగ్గిర గడపనంటున్నాడు జ్యోతిష్కుడు. ఇంటినించి, మధురమైన ఇంటినించి (home, sweet home) నన్ను దూరం చెయ్యగలది, గొప్ప దురదృష్టమో, అదృష్టమో, గొప్పశృంగారమో ఐవుండాలి. ఒకవేళనన్ను డిప్టీ-ఇన్స్పెక్టరుగాపంపుతారా? అంత ఘాతుకకార్యం చేస్తారంటారా? —ఇంత వేడి ఎండలకాలంలో భార్యచెమటనించి భర్త చెమటని విడతీస్తారా, ఎంత అధికారులైనా!

మీరు నాతో వున్న ఆ రెండు రోజులూ చాలా బావున్నాయి. కొంచెం మార్పువుంది మీలో. ఏం మార్పో ఇప్పుడు జ్ఞాపకం లేదు.

మీ స్నేహితుడు ఒక darling- మీ సమితి స్నేహితుల వల్లే కాదు. ఈపాపికి An occassional dose of him would be healthy to this sinner.

రమణమహర్షి గారిని enjoy చేశారా?

ఆ రెండురోజులూ—అంటే, మీరు నాతో వున్న ఆగంటలు—నాకు తలనొప్పి—మీతో చెప్పడం ఇష్టం లేకపోయింది.

If not you would have found wisdom running from the withered lips of this fool.

ఒంటరిగా, ఒంటరిగా, రోజులకి రోజులు, యీ గదిలో కూచుని, కళ్ళు చీకట్లుపడ్డదాకా, చదువుతో.

మనుష్యుల సహవాసమూ, వాళ్ళసంభాషణా నాకెందుకంత అసహ్యం? ఎందుకంత (silly) 'సిల్లీ'గా వుంటుంది. నా 'సిల్లీనెస్' వాళ్ళ 'సిల్లీనెస్'కి ఎందుకంత భిన్నం?

మీతో ఎంతో మాట్లాడాలనివుంది—కాని మీరు లేరు.

Let it be in our souls that there was much left unsaid between us.

And let the longing thus exist to meet again.

చెప్పుకోకుండా మిగిలింది మనమధ్య మిగిలిపోయిందన్న సంగతి మన ఆత్మలమీద వుండనీండి.

ఇంకా కలుసుకోవాలనే యీవాంఛని అట్లానే వున్నీండి. మంచిమంచివి వ్రాస్తున్నాను— ఈ ప్రకారం వ్రాస్తే, యీ వేడికాలపు మధ్యాన్నాల, భగ్గుమని తగలపడగల వాటికన్న సంఖ్య మీరిపోతాయేమో!

## ౪౪

బెజవాడ

22—5—36

*My Dear Monarch of Kanigiri ruins,*

So, poor chapie,

ఎండాకాలం శలవల్లో మీచేత శలవ పెట్టించారా! కనిగిరి బావుంటుంది—నీళ్లూ, కూరలూ దొరకవు. కోళ్ళూ, ఆడ పిల్లలూ, కొండలూ, ప్రేమించే నావంటివాడికి బావుంది. The place is picturesque. వెళ్ళండి.

ఈ నిరంతర తారుమార్లలో (బదలాయింపులు) ఛాన్స మన్నిద్దర్ని ఒకచోట ఎప్పుడు కలుపుతుంది?

బదిలీచేసి—కత్తిచూపి కదలమంటే గాని ఏ వూరూ వదలను—రమణమహర్షి దగ్గిరకైనాసరే.

Let me dream.

మంచితలనొప్పి ప్రోత్సాహించింద, ఈవాళ పొద్దున్న స్నానంతొట్టిలో కూచుని ఆలోచన ప్రారంభించాను.

లోకం మాయ అంటారు కొందరు. వాళ్ళే ఆధ్యాత్మిక యత్నం వాస్తవం అంటారు. వాళ్ళ ప్రతికక్షులు, ఈ ఆధ్యా

త్మిక అనుభవం మాయ అనీ, సుఖానుభవమే వాస్తవమని అంటారు. నా కేమనిపించిందంటే ఆ రెండూ మాయేనని — అన్నీ—జీవితమంతా మాయే.

మీ జ్యోతిష్కుడు ఏమీ వ్రాయడేం? నా రాజయోగం గొప్ప తలనొప్పితో, ప్రాసిక్యూషన్ బెదరింపు ఉత్తరంతో ప్రారంభించింది. మీరు వొచ్చినప్పుడు మీతో ఒక గొప్ప స్వగతం (monologue) మాట్లాడా లనుకున్నాను. మీరు పిచ్చమ్మ (మాలపిచ్చమ్మ అనే యోగిని) ప్రణయంలో నిమగ్నులై నాకు వ్యవధి నివ్వలేదు.

సంసార కాన్ఫరెన్సుకి పద్మావతి వొస్తుందట.

మీ తెలుగు ఉత్తరంలో వాక్యాలు సహజంగా లేవు.

ఇంకేమిటి?

మీ అల్లుడు చీకాకు పరిచాడా మిమ్మన్ని? మంచి తగాదాలు జరిగాయా? ఆ Chappie ని చూస్తే ఇష్టమేనా మీకు? అల్లుడిగా కాదు—for himself?

బ్రూక్ బాండ్ టీ కంపెనీలో కనుక్కోండి. మీ పుస్తకం ఏ మవుతుందోనని ఆదుర్దాగా వుంది. ఏమిటి? ఆ కంపెనీవాళ్లు నా పేరు వినలేదా? తెలుగు పత్రికలు చదవరా? పైగా తెలుగువాళ్ళకి 'టీ' అమ్ముతారా? నిజమా?

౪౫

బెజవాడ
8—6—36

*My dear Brahmin,*

your dear letter ! ఇప్పుడు free గా వున్నారుగా ! పెద్దవి ఏవన్నా వ్రాయరాదు ? మిమ్మల్నీ నన్నూ తిట్టిన sillychap నరహరిశెట్టి వెంకటరత్నంట. ఆ ఆంధ్రహృదయ వ్రాసిన అతను. అతనిపుస్తకాన్ని మెచ్చుకోని వాళ్ళనందర్నీ తిట్టాడనుకున్నాను. కాని జానకిరాం అన్నాడు, బ్రాహ్మల్ని తిట్టాడని. ఏమీ కల్మషములేని మీవంటివారి మీద అంతవిషం గుమ్మరించడం, it is a pity. అది విమర్శ కాదు. It is hatred for people who have succeeded నక్కా ద్రాక్షపళ్ళూ.

౪౬

బెజవాడ
31-10-36

*My dear Deekshit,*

హఠాత్తుగా శెలవపెట్టి వొచ్చేశాను. ఏమవుతుందో తెలీదు. ఏమైతేనేం, నేనుత్వరలోనే యీపని మానెయ్యబోతున్నాను. చూశారా, ఏమిటంటే, నా పిల్లల్ని చదివించాలని, వాళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యాలని ఏమీ వ్యామోహంలేదు. మా అబ్బాయి రౌడీఐనా, అమ్మాయిలు వేశ్యలైనా, నాకు సంతోషం,

సమ్మతం- నాకు ఏమీ ఆస్తిలేదని తెలుసు మీకు. కనక నేను స్వతంత్రుణ్ణి. నా ఆత్మ నాదిఅని అనుకోవచ్చు.

23 తారీఖు హిందూ చూశాను. తమషాసంఘంలో చేర్చారు నాపేరు—అందరూ అసహ్యాక్షు మనుషులు. అవును—మీరుserious high souled కవిత్వం వ్రాయాలి.

నాకు కొత్త వుద్యోగమయింది ఒకటి రెండు రోజులకన్న శెలవ దొరకదు. నేను పొద్దునాన్నా, సాయంత్రం, రాత్రీ. మా కారుకి డ్రైవర్ని, కనక అక్కడికి రావటానికి వీలుండదు.

ఇంక ఆ టీచరుపని చెయ్యలేను. మంచి హెడ్మాస్టరు గారి కి తే తప్ప చాలా ఘోరంగావుంది.

సరే, మీ భగవద్గీత (దీక్షితులుగారు తెలుగు చేశారు భగవద్గీత) పంపండి. ఇదివరకటి తెలుగు ఇంగ్లీషు భగవద్గీతలు అర్థం కాలేదు నాకు. The original itself looked to me childish. మీ మాధుర్యం భగవద్గీతకి జీవమూ, ఆకర్షణా ఇచ్చిందను కుంటాను.

సరే, మీ వైద్యంకింద ప్రవేశిస్తాను. మీ భౌతిక ఆధ్యాత్మిక ఔషధాలతో రండి.

కారు డ్రైవింగుకి జీతమా ?—తిండి, చాలా చవక వుద్యోగం.

ఈసారి మీరు వొచ్చినప్పుడు కారులో కూచుని నేనేం చేస్తానో అని భయపడక్కర్లేదు. గోడ్డుమీద పడి చావటం తప్ప ఎవరినీ హత్యచెయ్యటంలేదు నేను – శేషా – నీ, ముద్దుకృ – ష్ణా వాటిల్లో కలపగలిగితే ఎంత బావుంటుంది.

౪౭

బెజవాడ
20—11—36

*My Dear Deekshit*

రైల్వే కంపెనీవాళ్ళు చౌకటిక్కెట్లు ఇస్తారుట చూశారా? అవికొని తిరుగుదామా? చెన్నపట్నంనించి తిరువన్నామలై ఎంతదూరం?

ఒకటే కథలు వ్యాసాలు వ్రాయాలని జ్వరంలాగు పట్టుకుంది. నా నీరసమైన శరీరమే అభ్యంతర పరచకపోతే, ఎంత వ్రాద్దునో! ఇట్లాంటి వ్రాతజ్వరం మీ అనుభవంలోనూ వుండేవుంటుంది. ఆ ఆవేశం మననిపట్టిందా, ఆట, పిల్లలు, వ్యాయామం, సౌఖ్యం, అన్నివొదిలి, చమటోడ్చి పనిచేసి, మన మనసులోపలిదంతా మాటలతో వెలిబుచ్చుతాము. పర్యవసానం? ఏతుక్కు పత్రికాధిపతో దాన్ని తప్పులతో ప్రచురించడానికి కటాక్షిస్తాడు. ఏ ఆవలించే పాఠకుడో, ఇక్కడా అక్కడా కొంచెంచూసి, పుస్తకం కిందపారేసి, అటుతిరిగి నిద్రపోతాడు.

౪౮

బెజవాడ

17—12—36

*My Dear Ramana Sevak,*

Ofcourse I know the theory of the true Path కాని కష్టమల్లా ప్రవేశం. ఆ వేదాంతమార్గమే సత్యమనిపిస్తోంది. అదే సత్యమైతే, సిద్ధంగాలేను నేను.

Restles without knowing what is making me restless.

If D. I. ship makes you overlook the Krishna's beauty it is a damned distressing Job indeed;

ఏదోవొకటి వ్రాస్తూనే వున్నాను. మాలతీ బాయిగారు ఇల్లుకట్టడానికి చేసే ప్రయత్నాలని చెడగొట్టేపనిలో నిమగ్నుణ్ణై ఉన్నాను. నా ఆదాతో కాపులెండి. ఇంతవరకు అయిదు రూపాయలు ఆదాలేదు నాకు.

రండి నా పెడసరపు బుద్ధిమీద ఆమె మీకు ఉపన్యాసాలు ఇస్తారు—వింటురుగాని.

## ౪౮

త్రిప్లికేను
2—1—37.

మీరు వెళ్ళిపోయినప్పణ్ణించి తప్పిపోయిన పిల్లమల్లే తల్ల డిల్లుతున్నాను. 'శాంతి' మీతో తీసికెళ్ళిపోయినారు. మీరు నా మహర్షిలాగున్నారు. ఈవాళ ఒకతను నన్ను ముష్టి అడిగాడు. నేను ఏమివ్వక వెళ్ళిపోతోవుంటే, వెనక 'భగ వాన్ పేరున' అన్నాడు. నేను తిరిగి వెళ్ళి అతనికి ఓ అణా ఇచ్చాను. పక్కనున్న 'శోకపుమూనిసాక్కుడు' నవ్వాడు. ఇంకా మద్రాసులోనే వున్నాను.

## ౪౯

బెజవాడ
11.1-37

*My Dear D.I.,*

ఇవాళ మీ వుత్తరం. మొన్ననే ఒక్క దుఖభాజనుడితో **"All of us Edward VIII downwards are misfits"** ఫుటకతో సహా, బహుశా అట్లాగే చస్తాము" అన్నాను.

ఈవాళ ఆశ్రమానికి మనిఆర్డరు పంపాను.

మూడుర్రాత్రుల క్రిందట, నేనూ, నా బావ చలం, ఇంకో సరదాఐనమిత్రుడూ, తాగుడుపార్టీ పెట్టుకున్నాము, మా ఇంట్లో హాలులో. సగంతాగినస్థితిలో పడ్డాము ముగ్గురం. రమణాశ్రమం సంగతి చెప్పమన్నారు వాళ్లు. రెండుగంటలు మాట్లాడాను—

ఏం చేస్తో ఎవరికి తెలుసు? ఏమైతేనేం నా ఉపన్యాసం చివర, తాగివున్న వాళ్ళిద్దరూ వీలుదొరికిన తక్షణం ఆశ్రమానికి వెడతామని ప్రమాణాలు చేసుకున్నారు. పక్కన తాగకుండా కూచున్నవాళ్లు, నామాటలు చాలా గొప్పగా వున్నాయనీ అసలు విషయమే కాకుండా, నేను వర్ణించినవిధం ఎన్నడూ లేని ఆకర్షణను పొందిందనీ అన్నారు.

Don't think I speak as if converted. నే నేదో ఆశ్రమం శిష్యుడి కింద మారినట్టు మాట్లాడాననుకోకండి. I have all my reservations. నా సందేహాలన్నీ అట్లానే వున్నాయి. My buts, ifs,perhapses, I don't knows etc. The point is, I try to see scientifically exact and sincere to myself నేను శాస్త్రంమల్లే తూచా తప్ప కుండా సత్యం చెప్పడానికి, నాకు నేను 'సిన్సియర్'గా వుండ డానికి ప్రయత్నిస్తాను. I have no stakes. ఎటుమొగ్గినా, గంట్లో కలిసినా, ఏం నమ్మినా నాకు వచ్చే నష్టాలేమీ లేవు. ఆ విధంగా నాకే విశ్వాసంకుదిరితే అదేనిజమని తోస్తే రేపు సంపూర్ణమైన నిరీశ్వరవాదినికానీ, లేక మూఢాచారవంతుణ్ణి సనాతనుణ్ణి కానీ—కావడానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఏ పల్టీకొట్టడానికీ నేను సిగ్గుపడను. నాకు వాస్తవమని నిశ్చయంగా తోచాలి. మీరు — నాజీవితంలో కొన్ని పల్టీలకి కారణం మీరు!

అవును, నా హృదయంలో ఎక్కడో కొంచెం శాంతి వొచ్చింది అనిపిస్తోంది. కాని ఏదైనా అయి వుండవొచ్చు.

ఆహారంలో కాని, హార్మోన్సు (harmones) లో కాని మార్పువల్ల కావొచ్చు.

రండి, రెండురోజులకన్నా ఇక్కడికి రండి. కొండలు ఎక్కుదాము, గుహాలదారులు తీర్దాము– నీలపుస్ఫటికస్వచ్ఛజలంలో స్నానం చేద్దాం, మాంకారులో షికార్లు తిరుగుదాము.

మీ గుంటూరుకూడా వొస్తాను- though I detest the folk of your parishat మీ పరిషత్తు మనుషుల్ని చూస్తే పరమాసహ్యమైనా, alas my 'detest' is weak 'పరమాసహ్యం' అనేమాట బలహీనంగా వొస్తోందని దిగులు పడుతున్నాను.

మీరు miserable గావున్నందుకు నాకు సంతోషంగా వుంది. ఎందుకంటే అట్లాంటి misery మనుష్యుల్ని ఉన్నత ప్రదేశాలకు తీసికెళుతుందని నావిశ్వాసం, though Krishna Sastry's poetic misery landed him in fat. కాని కృష్ణశాస్త్రి కవిత్వపుదుఃఖం అతన్ని కొవ్వులో దింపింది.'

No. మీరు లేకండా మేము అరుణాచలం వెళ్ళము. నా హృదయంలోనైనా అక్కడికి వెళ్ళాలని గట్టిగా లేదు. మీరు లేకుండా ఆస్థలం దుర్భరంగా వుంటుంది! అబ్బా! ఆ మనుషులు!

అవును. వుద్యోగంమానుకోగల ధైర్యం తెచ్చుకోవాలి మీరు. భగవాన్ బోధించే వేదాంతమూ, ఆయన 'ప్రిస్క్రిప్షనూ' Prescriptions నాకు సమ్మతం కావు.

ఆయన గంభీరత్వంలోనూ, లోకంమీద ఆయనకి వున్న సంపూర్ణ నిర్లక్ష్యంమీదా గౌరవం నాకు.

ఆయన ఆత్మ సౌందర్యం ఆయన ప్రేమా నేను వొప్పుకుంటాను.

మీబాధ నా కర్థమవుతోంది. నేను నిరంతరమూ అనుభవించేబాధే అది. కాని నాకు 'స్త్రీ' వుంది. మీకు దేవు డున్నాడు.

మనం కలుసుకున్నప్పుడు ఇంకా ఇంకా ఇంకా ఎన్నో ... ...

౫౧

బెజవాడ
18—1—37

*My dear co-damned,*

అందమైన మీఉత్తరం. నా మనిఆర్డరుకిబదులు ఆశ్రమం వాళ్ళు కొంచెం కుంకం పంపారు. అవును. భగవాన్ కే వొదులుతున్నాను. చాతైతే నన్ను lead చెయ్యమనండి.

ఏమిటి ? మీవంటి, మంచి, సాధు, నిరపాయకరమైన వారిమీద కోపమొచ్చిందా డి. ఇ. ఓ. కి. డిపార్టుమెంటుకి ఏమొచ్చింది? మీభగవానేనేమో, ఉద్యోగవ్యామోహంనించి మిమ్మల్ని తప్పించడాని కేమో ఇట్లా చేస్తోంది ?

నిన్న గుంటూరు వెళ్ళాను. అక్కడ A. గోపాలరావు కనబడ్డాడు. "23,24న వొస్తు న్నారుగా! ..."అని ఏమేమో!

మీాకు 22న వస్తారని జ్ఞాపకం వొచ్చిందాకా, ఆతారీఖులు ఎందుకు ముఖ్యమో నాకు తెలీలేదు. అతని మాటలు అర్థం కాలేదు. నన్ను గుంటూరు రమ్మన్నారు ఆయన. "దీక్షితులు గారు నన్ను పట్టుకోస్తానన్నారు" అన్నాను.

మీారు రాకపోతే నే నెట్లానూ వెళ్ళను. ఆ సాహితీ గుంపుని చూస్తే నాకు వొళ్ళుమంట. అన్నట్టు 'వొళ్ళు మంటూ, ద్వేషం' ఇట్లాంటివి మరచిపోవాలికదూ – కాని ఎందుకు మరిచిపోవాలి ?

Who am I to hate ?

మీాకు తెలుసునా పాపం ఉదయినికి (editor) క్షయ అని ?

౫౨

బెజవాడ

3—2—37

చివరికి మీావుత్తరం. ప్రతిరోజూ మీాకు వ్రాయాలనే. గుంటూరుకవులు – ఆసభ అంతా హాస్యంగావుంది (comic) (గిడుగు) రామ్మూర్తిగారు తప్ప.

These people in their sense of (their own) importances have lost their sense of humour

అవును నిన్న "Who am I ?" (నే నెవరు ?) అనే పుస్తకం చదువుతున్నాను.

ఇంక రోగులు చాలు మనకి, మొత్తానికి నాకు.

భగవాన్ వల్ల లాగెయ్యబడ్డానని బెజవాడలో వదంతి. భగవాన్ని గురించి నా అభిప్రాయం(impression) ఇద్దరడిగారు.

నేను ఆ విషయం మాట్లాడకండా ఉంటే బావుంటుంది. ఆయ నకైగాని, నాకుగాని న్యాయం జరగదు నామాటల్లో.

కొంచెం కొంచెంగా—చాలా నెమ్మదిగా అనిపిస్తోంది నాలోపల—చాలా స్వల్పమనుకోండి—ఏదో ఉన్నతమైనది ఉదయిస్తోందా అని.

మీరు కవి మిత్రులను గురించి అసందర్భంగా ఉత్సాహం కనుపరుస్తున్నారు. వాళ్ళ పుస్తకాలకి మీ పుస్తకాలకు లేని ప్రాముఖ్యతను ఇస్తున్నారు. ఆ 'వాసనని' త్యజించండి.

చూడండి. శిష్యుడు అప్పుడే గురువుని శాసిస్తున్నాడు.

## 23

బెజవాడ
9—2—37

*My dear Ramana Dass,*

రేపల్లినించి రమణాశ్రమానికి, భగవాన్ బతికిస్తారని, తీసి కెళ్ళిన పీనిగసంగతి చదివారా? ... ఈ cutting చదవండి : వ్యాసుణ్ణికూడా ఎట్లా తుడిచేశారో భగవాన్, Brave chap !

తన స్నేహితులు కొందరు కుర్రాళ్ళు హరనాధ్ భజన చేస్తోవుంటే వెన్నమీద వేలిముద్రలు మొదలైన మహ త్యాలు చూశానన్నాడు వసంత్. మా ఇంట్లో భజన పెట్టిం చాను ఆ కుర్రాళ్ళచాత. వాళ్ళల్లోకొందరునిజంగా trance లో పడ్డారు. అక్కడపెట్టిన పళ్ళు మాయమైనాయి అంటారు వాళ్ళు. నాకేం అట్లాఅయినట్టు కనపళ్ళేదు.

వాళ్ళల్లో ఒక అతని పొగరు చూడండి. అన్నాడుగదా, 'నా మైమరుపులో బాబా నాకు కనపడ్డాడు, రెండురోజుల్లో తనమహిమని మీరు నమ్మేట్టు చేస్తానన్నాడు' అని.

ఇంత అయోమయంగా అర్థంకాకుండా వుండడం చాతనే యీలోకం ఇంత 'ఇన్టరెస్టింగ్'గా వుండేమో!

భగవాన్ విషయమై, ఒకటి రెండు పిచ్చి అనుభవాలు ఎప్పుడో మీకు చెప్పాల్సివుంది. ఆయన సర్వశక్తివంతుడు లాగువున్నారు. కాని ఆయన philosophy ని (వేదాంతం) నేను అంగీకరించను. అసలు సత్యం ఆయనికి తెలుసునేమో, కాని ఇతరులకి ఎల్లా చెప్పాలో ఆయనచేతకాదేమో! చెప్ప గలిగే శైలీ, పాండిత్యమూ, భాషలో స్పష్టతా ఆయనకి లేవేమో......నా ప్రారబ్ధంవల్ల ఆయన చెప్పేది తెలుసుకో లేనేమో! అంటారు, బహుశా మీరు. నేను ఇన్నాళ్ళు గొప్ప గా నమ్మి ప్రేమించిన ఉద్దేశ్యాలని వొదిలి ఆయనకి సర్వమూ వొప్పచెప్పే యిష్టమూ ధైర్యమూ నాకు లేవేమో! నాలో వున్న ముఖ్యమైనవి two influences- పశ్చిమ భౌతిక శాస్త్రమూ, టాగూరుగారి బ్రహ్మసమాజపు వేదాంతమూ, ఈ రెంటివల్లా నా మత విజ్ఞానం ఏర్పడ్డది. ఇవి భగవాన్ బోధించే శాస్త్రంతో సమన్వయంకావు.

## ౫౪

బెజవాడ

14 – 2—37

*My dear Deekshit,*

మీ పెద్దవుత్తరం. నాకలం పిసినారిగావుంది. క్లుప్తంగా వ్రాయాలి.

అవును. మీరన్నట్టే అయింది. ఆ శవాన్ని భగవాన్‌దగ్గిరికి తీసికెళ్లారు. రాత్రి 11 గంటలకి ఆయనని లేపి వుండాలి. ఏం, ఒక్కమాట మాట్లాడలేదుట – wonderful man. నిరంజన్ తెల్లారకట్టదాకా చూడమన్నారట.

'భగవాన్‌కి అసాధ్యమైనది లేదు. కాని వుద్దేశ్యం మనకి తెలీదు. తెల్లారేప్పటికి బతక్కపోతే పాతెయ్యండి' అన్నారుట.

ఏమీ కాలేదు,

It is not only great, but prudent of Bhagvan. గొప్పేకాదు, వివేకం కూడా. అంతే. ఆయన మహాత్యం చూపి, బతికిస్తే, ఇండియాలో పీనిగలన్నీ రోజూ ఆయన ఆశ్రమానికి రవాణా అయ్యేవి.

17-2-37

విశాఖపట్నం బదిలీఅయింది. మీకూ మహర్షికీ మంచివి, ఉన్నతాలూ, ఐనవాటి అన్నిటినించీ శలవు.

My experiences of Bhagvan! They are too sacred and too rediculous to be committed to paper.

౩౩

వైజాగ్
20—3—37

*My Dear Bhagvan-dass,*

ఈ హెడ్మాష్టరుగారు చాలామంచి ఆయనలాగువున్నారు. నన్ను చూస్తే ఇష్టం. కాని త్వరలో నే నెటువంటివాణ్ణో తెలుసుకుని, తక్కినవాళ్ళమల్లేనే ద్వేషిస్తాడు.

జీవితం అంధకారంగా వుంది. తుక్కైక్కే తుప్పుపట్టకముందే చచ్చిపోవడం మంచికాదూ? మీరూ బాబా, అహంకారం అంటారు.

మీ గురువు దర్శనానికి వెళ్ళకపోతే, మీ శిష్యుడి దర్శనానికి రారాదూ, యీ ఈస్టరు శెలవల్లో!

ఆ బాబానే నేను చూసివుంటే !

What funds of humour and great heartedness!

బెంగుళూరులో గోడలమీద నా పేరుచూసి, పద్మావతి, నేను కన్నడంలో ఎట్లా వ్రాశానా అని ఆశ్చర్యపడి, ఆ పత్రిక కొని చదివింది. మీకు ఆపత్రిక నేనుపంపగలిగినట్లయితే బావుండేది. మీ మరచిపోయిన కన్నడ భాషలో తిట్ల భాగం పునశ్చరణకి పనికివచ్చేది.

౩౬

మహారాణీపేట
4-5-37

నాకుమల్లేనే మీరుకూడా యీ ఘోరమైన ఉద్యోగానికి సరిపుచ్చుకోలేరు. అందుకనే మీ బాధా, నా బాధా. మన

ఆత్మ ఇంకా బతికి వుందనీ, యీ బురదలోంచి బైట పడా లని తన్నుకుంటోందనీ. ఆరోగ్యవంతమైన చిన్హం కాదా యీబాధ ? సంతోషించండి.

గొప్ప బాధలో, in agony proper ఒకవేళ అర్థం వుంటుందేమో! But this dull ache of my head and heart! this monotony? జీవితం అంతంవరకూ వంటూ, కనడం యింకేమీ అర్థంకనపడని భార్య మామూలుతనంవంటి యీ 'మొనాటనీ'లో ఏ అర్థమూలేదు. ఈ ప్రపంచానికీ జీవితానికీ ఎదో అర్థం వుంటే, మనంపడే యిట్లాంటి బాధకి కూడా స్తానంవుందేమో ! Perhaps this monotonous pain too has a place in the grand scheme, if there is a scheme at all. Unbeliever and doubter as I am, still, something forces me into the belief that there is a shore beyond this ocean where every struggle against the wave, every drop of sweat and blood shed on the way, takes shape & significance when we approach the shore. But may be, this belief, this innate feeling also, is an illusion of the Grand Delusion.

ఏ విశ్వాసము లేనివాణ్ణయినా యీసముద్రానికి ఓతీరము వుందని, ఆతీరాన్ని చేరగలిగినప్పుడు, ఆ సముద్రపు అలలకు ఎదురీదుతూ కార్చిన చెమట, రక్తబిందువులకి అర్థం కలుగు తుందని అనిపిస్తుంది. కానీ యీ అనిపించడంకూడ ఆ పెద్ద మాయలో ఒక మాయేనేమో!

క్రొత్త ఇంగ్లీషునవలలు చదువుతున్నాను. ఈ పశ్చిమ రచయితలు ప్రతి అతను తమ తమ మూర్ఖత్వంలోంచి, వాళ్ల

యిం్రదియాతీ క్షణాసమరంలో ంచి మీరూ నేనూ అందుకున్న జ్ఞానానికి కళ్ళు తెరవాలన్న ప్రయత్నం కనబడుతూంది నాకు. వేదాంతం, అహింస, యీ రెండు ప్రపంచ విజ్ఞానంలో ముఖ్యమైనస్థానాన్ని పొందుతూ మనుషుల ఊహల్ని ఆశల్ని రేకెత్తిస్తున్నాయి. (Capturing people's imagination).

Think and struggle and knock and enquire. You go ahead to truth wherever you start-from gross materialism or stark agnosticism.

Struggle on my boy, Pain. Intense pain, cry in the wilderness, seek and kick, don't give up. Don't sink, don' t die. Keep up the torch lighted with the blood for your veins,and it will light you sure to that somewhere if there is one. If there is none, let us quietly walk out into the void to sleep (perhaps to dream),never to wake again and to suffer (in training schools) after the great toil of life well done.

ఆలోచించండి, (శ్రమపడండి, తలుపుతట్టండి, విచారించండి) - సత్యంకోసం ముందుకు నడవండి - ఎక్కడ బయలు దేరితేనేం ?

కష్టపడి నడు. బాధ—తీవ్రమైన బాధ—అరణ్యరోదనం. వెతుకు, తన్ను, వదలకు, మునిగిపోకు. చచ్చిపోకు. నీ నరాల్లో రక్తంతో కాగడా వెలిగించి ఎత్తిపట్టు. ఎక్కడికి తీసికెళ్ళాలో (అస్థలమే వుంటే)అక్కడికి నీతోవ తెలిపిస్తుంది. ఏదీ లేదా ! శాంతంగా కడపటి నిద్రలోకి (ఏమో కలలలోకి) నడుద్దాం. జీవితంలో మనపనిని శుభ్రంగాచేసి యింక మళ్ళీ మెలుకువ రాకుండా (యింక ట్రైనింగు స్కూళ్ళలో) బాధ లేకుండా నిద్రపోదాము.

ఈవాళ సినిమాకి వెళ్ళాను. ఘోరంగా వుంది బొమ్మ. సంగీతం మనోహరంగా వుంది. అందుకని బైట క్రోటన్ల మధ్యకి వెళ్ళి చీకట్లో వింటో పడుకున్నా. అట్లా చాలాసార్లు చేస్తాను. చెడ్డబొమ్మ నా నరాన్ని చీలుస్తుంది.

నిద్రవొస్తోంది. Good night.

౩౭

మర్నాడు

ఇవాళ పొద్దున్న నిన్న వ్రాసిన నాలుగు పేజీలూ చూసి, ఆ silly non-senseని చింపేద్దామనుకున్నాను. ఇల్లాంటి muddled improvisations పిచ్చి ఆలోచనలు రామ్మూర్తికి వ్రాసేవాణ్ణి. అతను చచ్చిపోయినాక, అల్లాంటి ఆలోచనలు కూడా ఆగిపోయినాయి.

మీ వుత్తరం నా బద్ధకాన్ని వొదిలించింది— musings అని కొత్తరకం-new series వ్రాస్తున్నాను. ఆ మాటకు తెలుగేమిటో? యూజింగ్సు. శ్రీపాదని ఏడవనీండి.

మీ పద్యం చాలాసార్లు చదివాను. సరిగానేవుంది. కాని దాని విలువ నా కెట్లా తెలుస్తుంది, దాని spirit ఆత్మ నాకు అందనప్పుడు?

"నే నెవరు?" అని భగవాన్ స్మరించుకోమన్నారని "చలం" ఓమూల కూచుని ప్రశ్నించుకోడం ప్రారంభించాడు. Curiosity వల్లనూ, దాంట్లో ఏం లేదని నిశ్చయం చేసుకోడంకోసమూనూ, ఆతనికే ఆశ్చర్యంగా, మనస్సుని ఏదో లోపలికి లాగడం ప్రారంభించింది. మరీ క్యూరియాసిటీ ఎక్కువై ఏమవుతుందో చూద్దామనుకున్నాడు. ఆ Mood కి తననితాను వొదిలేసుకుంటున్నాడు.

౫౮

*My dear brethren,*

మహారాణీపేట
3-5-37

ప్రియతమమైన యీ బడి ఎండాకాలాని కన్నా ఎన్నడూ మూతపడదని కనుక్కున్నారు కారే! మీ వుత్తరాలు Such a pleasant surprise మీ విసుకు చరిత్ర నాకు ఉత్సాహాన్నిచ్చింది—మీ విసుకుకాదు, అమూల్యమైన మీనించి వచ్చిన ఆవర్ణన 'నిరంజన్' నన్ను జూన్‌లో ఆశ్రమంలో ఏవో వుత్సవానికి ఆహ్వానించినప్పటినించి, మీకు వ్రాయాలని వెడదామా అనికూడా అనిపించింది. మీరూ ?

మీరు వ్రాసిన విషయం నిజం. నా నిరీశ్వరదినాల ప్రారంభంనించి, విద్యకోసం ప్రజలు పెట్టే యీ గోలకి నేను వ్యతిరేకం.

పొలంనుంచి బడికి,
ఏటినించి పుస్తకానికి.

from the field to the school
from the brook to the book.

పిల్లల్ని విడతీసి తీసుకువొచ్చి, బడిఅనే మురికిగుంటలో కైదుచేసి, జీవంలేని, అర్థంలేని, మూర్ఖపు అక్షరాలతో, అతన్ని చంపడమన్నమాట.

Now the masses—
Hitherto, they were exploited by the pries t and the capitalist.

Now the congressman exploits them for election.
(that is why he cries they should be educated)
the Communist for revolution,
the educationalist for promotion,
and the story-writer for reputation.

సామాన్య ప్రజలు—

ఇదివరకు పూజారీ ధనవంతుడూ ఉపయోగించుకున్నారు వాళ్ళని.

ప్రస్తుతం ఎలెక్షన్లకి, కాంగ్రెసు మనిషి ఎలెక్షనుకోసం (అందుకనే ప్రజలకి విద్యో అని అరుస్తాడు)
సామ్యవాది తిరుగుబాటుకోసం.
విద్యానిపుణుడు ప్రమోషనుకోసమూ.
కతకుడు కీర్తికోసమూ
ఉపయోగించుకోవాలని చూస్తున్నారు.

masses masses—ప్రజలలో ప్రజలో అని వొకటే అరుపు. ప్రజాసేవఅనే మడిబట్టల్ని కప్పుకుని కులుకుతో నడిచే స్వార్థపరత్వాన్ని గురించి వ్రాయవలసింది కుప్పలు కుప్పలు వుంది. మొన్న ఒక great philanthrophic public woman worker నా వ్రాసింది—

"నాకో అనాధశరణాలయం వుంది. పిల్లలు లేరు. అనాధలైన పిల్లల్ని (orphans) పంపండి," అని.

నేను జవాబువ్రాశాను:

'ఆ శరణాలయాన్ని మూసేసి, ఆ ధనంతో, అనాధలైన తల్లిదండ్రులువుండి తిండిలేక మాడే బీదపిల్లల్ని చేర్చుకుని పోషించరాదా?' అని. ప్రత్యుత్తరము లేదు.

కాని త్వరలోనే ఆమెకాళ్ళు పట్టుకోవలసి వొచ్చింది. హిందూ మహమ్మదీయ సంబంధంవల్ల పుట్టిన ఎవరికి అక్కర్లేని పాప, మాకు భారంకావడంచాత, శరణాలయంలోకి తీసుకోమని నేనే బతిమాలవలసి వొచ్చింది. మనుష్యుల పిల్లల్ని ఇట్లా బంగీలమల్లె పంపించెయ్యడం నాగుండె చీల్చినట్టుంటుంది. మా ఇంటోపుట్టే ఈ దిక్కులేని పిల్లల్నందర్ని జాగ్రత్తగా పెంచగల ఆరోగ్యమో లేక ధనమో నాకు వుండకూడదూ! ఎవరో కొత్త స్థలాలికి, వాళ్ళని ఇచ్చెయ్యడం! మీది కాని పాపని మీ హృదయానికి అద్దుకుంటేనేకాని, ఆ బాధా, ఆ మాధుర్యమూ మీకర్థంకావు.

ఇంతవరకు మా హెడ్మాస్టరు మంచిగావున్నారు. నన్ను గురించి చాలా విన్నట్టున్నాడు. ముఖ్యంగా, నేను హెడ్మాస్టరుగా వుండేవాణ్ణనీ, నా విద్యార్థులూ సహోపాధ్యాయులూ నన్ను ప్రేమించేవారనీ, తననిగురించి నే నేమనుకుంటున్నానో తెలుసుకుందామన్నట్టు నావంక చూస్తోవుంటాడు.

మళ్ళీ ఆలోచన: ఉద్యోగం మానేద్దామా? సంవత్సరం శలవు తీసుకుందామా? అని.

విశాఖపట్నం అందంగా వుంటుంది. ఒక స్నేహితుడు, (బాపయ్యగారు) అన్నట్లు... ...

**God made, Vizag beautiful and man made it foul.**

దేవుడు వైజాగ్‌ని అందంగా చేశాడు.
మనిషి మురికి చేశాడు.

నేను శీతమ్మధారకి, మాధవధారకి, సింహాచలానికి తిరుగుతున్నాను. అంతసేపూ మీరూ నాతోవుంటే, వాతావరణం ఎంతభేదంగా వుండేదే అని మిమ్మన్నే తలుచుకుంటాను. కాని నా వెంట మిమ్మల్ని బైస్కిలుమీద ఆలోచించుకోలేను.

బెజవాడలోనూ బందరులోనూ నేను భగవాన్ని దర్శించడం సంగతి విరివిగా చర్చిస్తున్నారుట. తెలుసుకోవాలని కొంతమంది నాదగ్గరికి వొచ్చారు– to know how I was affected. How I wish I had something solid to impart and convince. వాళ్ళకి చెప్పడానికీ, నమ్మించడానికీ నాకు నిశ్చయంగా ఏదన్నావుంటే ఎంతబావుండును!

నామతరాహిత్యానికి నన్నెంత అపార్థం చేసుకున్నారో, మీ మతహితత్వాన్ని అంత అపార్థమూ చేసుకుంటున్నారు.

చివరికి మీ 'నవ్యకవి' ప్రచురించారే! మీలో సానుభూతి లేనివాళ్ళు నాకు చెప్పగావిన్నాను దానిసంగతి. నేనే చదివి చూడాలి.

మీరింత ప్రయత్నించినా, మీ నవ్యసాహిత్య పరిషత్తు నన్ను వొప్పుకోటంలేదు. వాళ్ళపత్రికలో ప్రచురిస్తున్న చెత్త చూడండి. నవ్యసాహిత్యంకూడా ప్రతిష్టమీద ఆధారపడ్డది. తమఘనతని తాము ప్రకటించుకునే ప్రతిష్టగల, ముసలి గురువుల పేర్లమీద.

'లక్క పిడతలు' పంపండి.

నేనేం వ్రాయటంలేదు. అనారోగ్యం. కాని నిష్ఫారవ్వ మెరుస్తోనే వుంది. ఎప్పుడో భగ్గుమని తీగుతుంది-ఈ ఎండా కాలపు వేడివల్లనైనా, తప్పదు.

అబ్బూరి, అభ్యుదయ రచయితల ప్రపంచ సంఘానికి ఇక్కడ ఒక శాఖని స్థాపించాడు. నాటకాలతో, ఉపన్యాసాలతో పామరులకి జ్ఞానబోధ చేస్తారుట. దానికోసం వాళ్ళ నుంచి కధలీన్ని, పాటల్నీ పోగుచేస్తారట. నేను దాంట్లో సభ్యుణ్ణి. కొంతరాజకీయ వాతావరణం, వాసన ఉంది. కొత్త గొడవలుగావును.

కామనిరోధాన్ని బోధించే గాంధిగారినిచూస్తే నాకు కోపంగావుంది. నేను 'అవినీతిని' బోధించనీ, ఆచరించనీ, నాకు, మొనాగమీలోను, దమంలోను విశ్వాసం. కాని ఆ ఆదర్శ శిఖరాలెక్కడ, మనమెక్కడ? పోనీ వాటిని ఆదర్శాలుగా పెట్టుకుని, జీవితంలో వాటికై ప్రయత్నించరాదా అంటారు మీరు. గాంధిగారితో నాకు విరోధమెక్కడంటే, దమనం ఏరోజునైనాసరే, ఎవరికైనాసరే చాలా సులభ సాధ్యమైనట్టు మాట్లాడతారు, ఆయన.

**He is misleading people and landing them into moral aberatious, neurotic vagaries and self deception.**

సాధ్యంగాని ఆదర్శానికై బలవంతపరిస్తే, పర్యవసానం ఘోరం. ఆయన మాటని విచక్షణలేకుండా నమ్మేవాళ్ళు వేనకువేలు వుండవచ్చు.

## ౫౮

బెజవాడ
7—6—37

*My dear Poor Worker,*

ఈ ఎండాకాలం చెమటలోడ్చే మీబాధనిచూస్తే దిగులొస్తోంది. పైగా మనం కలుసుకోడానికి వీలులేదు.

'నే నెవరు?' సాధనచేస్తున్నాను.

మద్రాసు వెళ్ళాను. బదిలీకి అడగాలని. అబ్దుల్ రహీం గారికోసం. ఆయన గదిముందు కూచున్నాను ఆయన ఇంకా రాలేదు. 15 నిముషాలు నిశ్చలంగా కూచుంటే మనసుకి ఏదో గొప్పశాంతి వొచ్చింది. తీరా ఆయనవొచ్చి, ఎందుకు అప్పుడే బదిలీ? అని అడిగితే, ఏమీ చెప్పబుద్ధి వెయ్యలేదు. ఏమైతేనేం అనిపించి.

I smiled at the man who was refusing my request and bade him a happy time in my heart.

కనక మీఅబ్బాయికి కొంతజీవం, వుందన్నమాట. లేకపోతే పిల్చి పిప్పిచేసే, యీ ఘోరమైన పరీక్షలు తప్పగల శక్తి ఎందుకు వుంటుంది అతనికి?

పాల్ బ్రన్టన్ చదువుతున్నాను. షోకూడా అతన్నిచాలా (Enjoy) చేస్తోంది. బలేవాడు. అతనుపైకి కనిపించిన దాని కన్న, పుస్తకంలో బావున్నాడు.

## ౬౦

బెజవాడ
22-6-37

*My dear busy bee,*

నే నెవరులోకి ఇంకా దూరం వెడుతున్నాను. పోకూడా. అనేక వ్యాధులకి అది మంత్రం. ఇంకా విషయాలు తర్వాత వ్రాస్తాను.

చాలా దిగులుగా వెడుతున్నాను, విశాఖపట్నం.

So poor soul, నా కన్న మీారే దిగుళ్ళు పడుతున్నట్టున్నారు.

I wish I could be completely won over to Bhagvan.

ఈ ఉత్తరంలో చిత్ర మీాకు సందేశం పంపుతూంది. చివరికేమైనా ఈలోపల మాత్రం, 'నే నెవరు' ఏకాగ్రతకి గొప్ప సాధన. నేను ఇంకా ఉన్నతమైన ఆనందాన్ని, అందుకుంటానంటారు భగవాన్. మార్గం చూపుతున్నారు. Let me give him a chance. రెండేళ్ళ క్రిందట, ఏకాగ్రత కోసం ప్రయత్నించి, విఫలుణ్ణయినాను. ఈరోజు మళ్ళీ అదే ప్రయత్నంచేసి, సహాయం చేసే ఏకాంతకారణంలేకండానే, పైగా అన్నివిధాల అననుకూలమైన, పరిస్థితుల్లో, సాధిస్తున్నాను. తరువాత ?

౬౧

విశాఖపట్నం
29-6-37

*My Dear pole star,*

Your chit though pregnant.

పనిలో ప్రవేశించి దుఃఖ-భాజనమైన, పాడుబ్రతుకు ప్రారంభించాను. మళ్ళీ శెలవపెట్టి పారిపోవాలనే బలవంత మైన కోర్కె-తో యుద్ధం. ఆరోగ్యం బాగాలేదు.

మహర్షిగారి మహిమ (influence) విశాఖపట్నమంత దూరందాకా వ్యాపించదేమోనని భయంగావుంది. లేకపోతే ట్రెయినింగు స్కూ-ళ్ళలోకి ప్రవేశించడానికి రోతపడుతుం దేమో. నా మనసుని ఆకర్షించే ఇద్దరు స్త్రీలమధ్య, 'నే నెవరు'ని సాధకం చెయ్యడానికి, ప్రయత్నం చేస్తున్నాను.

Yes, plod on. There seems to be no escape from the prison. మనకి ఋాపని కైదునుంచి మోక్షం లేదు. కానీండి. కళ్ళుమూసుకుని కష్టపడండి. ఒక్క-జైలు కాదు-జైలుపారలు-శరీరం-సంసారం-బడి లోకం.

## ౬౨

విశాఖపట్నం
29-6-37

*My dear menter*, (స్పెల్లింగు)

Glory గ్లోరీ! నన్ను బెజవాడలో కానక, భగవాన్ నాకోసం వెతుక్కుంటూ ఈవూరువచ్చి 'మిజరీ'లో 'వ్యధలో' తన్నుకునే నన్ను కలుసుకున్నారు. వారితో ఒక గొప్పదినం గడిపాను. ఆయనతోనా? నా ఆత్మతోనేనా? ఏది? ఈ అంత శ్శాంతి అంతా భ్రమ ఏమో? పోనీండి. ఏమైతే నేం? It is worth gaining. మనని బాధించే భ్రమకంటే ఎంతోనయం. ఇంకా నాసంగతి బహిరంగ పరచకండి. నాకాళ్ళు నేలమీద (ఆకాశంమీదా!) సరిగా ఉననీండి. మనుషులు ఒకటే ప్రశ్నిస్తున్నారు, నన్ను ఆత్రుతగా భగవాన్ విషయమై. జవాబు చెప్పగల సామర్థ్యం రాలేదు, ఇంకా నాకు. వాళ్ళ ప్రశ్నలు నన్ను సందేహాల్లోకి లాగుతున్నాయి మళ్ళీ.

You see I am giving a chance to Bhagavan ఆడపిల్లలనించి నేనుపొందిన ఆనందంకన్న గొప్ప ఆనందాన్నిస్తానంటున్నారు భగవాన్. ఆ ఆనందంకోసమే నా అన్వేషణ. And being a constant experimenter, I seek and wish to know, what this new (or most ancient) happiness is.

నా జాతకంలో, నాకు ఉద్యోగపు ఔన్నత్యం, కీర్తి, సౌఖ్యం, ప్రియులు, ఇవన్నీ వుంటాయని చెప్పారు. వీటిల్లో ఒకటీ నిజంకాలేదు. దేవతలు ఆ వరాలన్ని, యీ ఒక్క నా 'True self' కోసం అన్వేషణక్రింద మార్చారనిపిస్తోంది. జయం పొందగలిగితే నేను! ఇంకేం కావాలి?

నాకు ధ్యానం బాగా జరిగిననాడు, చాలా ఉత్సాహంగా వుంటాను. అదంతా వుత్త భ్రమా? అది నాతో ఎప్పుడూ వుంటుందా? స్థిరమా? నిరుత్సాహపడి భ్రమేనని తెలిసి, మామూలుస్థితికి వెడతానా చివరికి?

కాని, నేనే విజయం పొందానా? కొంచమైనాసరే, భగవాన్‌కన్న మిమ్మన్నే, thank చెయ్యాలి. ఎందుకంటే, మీమూలానకాక ఆయన నాకువుండేవారుకారుకద!

ప్రతివుదయం సూర్యనమస్కారాలు చేస్తూనే వున్నాను. నా శరీరానికి నేనుచేసే, అపచారాలనించి, కాపాడుకుంటున్నాను అట్లా. నా ఆత్మకి, నేనుచేసుకునే అపచారాలన్నిటినీ కూడా, సమయింపచేసేందుకు, ఈ ధ్యానాన్ని మీరు నాకు యిచ్చి, కాపాడబోతున్నారా? ఇంకా సందేహంతో ఆలోచిస్తున్నాను.

G. k. Chesterton చదువుతున్నాను. ఇదివరకుఅతన్ని చూస్తే అయిష్టం. He is ripping. ఏం వ్రాస్తున్నాడో చూడండి.

యువకుడు వొచ్చి తన వివేకాన్ని, మతశాసనానికి (Dogma) లోబరచలేనంటే నాకేమీ భయం వెయ్యదు. ఎందుకంటే ముందు తన బంధన (Dogma) అంటే ఏమిటో

తెలుసుకోడానికి తన వివేకాన్ని ఉపయోగించుకున్నాడా అని నా సందేహం.

సరదాలేని నిరీశ్వరవాదులువొచ్చి, జడం,(matter) తప్ప ప్రపంచములో ఏమీ లేదంటే with a sort of calm horror of detachment, ఓ విధమైన విరాగంపుఘోరంతో వినేవాణ్ణి. ఎందుకంటే, ఆత్మ (mind) తప్ప ఇంకేం లేదని నా అనుమానం.

నిరీశ్వరవాది వచ్చి చాలా గొప్పగా దేవుడనేవాడు వున్నాడని తనకి నమ్మకంలేదంటూవుంటే, అసలు నిరీశ్వరవాది అనేవాడు, వున్నాడనే నమ్మకం నాకులేని సమయాలు వుండేవి.

బావుండలా!

నేనుధ్యానానికి వెళ్ళాలి.

Good bye.

## ఉ3

విశాఖపట్నం
5-7-37

*My dear chum,*

ఈవుత్తరాలకి జవాబు వ్రాయాలి అనుకోకండి. నాకు ఎవరూ లేరు- మాట్లాడటానికీ, సలహా అడగటానికీ. కనక మీాకు వ్రాస్తున్నాను. ఈ ధ్యానం ప్రారంభించింతర్వాత హిస్టీరియాలాగు Fits వొస్తున్నాయి నాకు. ప్రాణాయామం మూలంగా కుండలినిని రేపినప్పుడు, ఇట్లాంటివి సంభవిస్తాయని

చదివాను యోగం పుస్తకాలలో. ఆ స్థితిలో నాకు స్మృతి శుభ్రంగా, మామూలుగా వుంటుంది. కాని శరీరం వొణుకుతుంది—శ్వాస తీవ్రమవుతుంది. నాస్వాధీనంలోనేవుంటుంది. Phenomena 'నేను' నించి నా మనసు తీసేస్తే మామూలుగా ఐపోతాను. భయంలేదులెండి, భగవాన్ కనిపెడుతూనే వున్నారు. గొప్ప ఆనందం ఏమీరాదు. కాని ఆ fits అయిపోయింతర్వాత, కొత్తగానూ, శాంతంగానూ వుంటుంది.

అవును, మీ మాలపిచ్చెమ్మ చెప్పింది నిజం. గంటల కొలది ఆ పనిమీద కూచోవాలి. నిటారుగా కూచుంటేనే తప్ప ధ్యానం వీలుకలగదు. వెన్నెముకా కాళ్ళూ వొకటే నెప్పి.

ఈ వూళ్ళో H. G. wells 'Things to come' అనే picture. నాకు వెళ్ళిచూడాలనివుంటుంది. కాని ప్రతిసాయింత్రం సరిగా ఆరింటికి భగవాన్ నన్ను పట్టుకుంటారు. సినిమాకి బయలుదేరినవాణ్ణి రాత్రి పదింటిదాకా సముద్రంవొడ్డునే వుండిపోతాను.

ఈ అనుభవమంతా వయసుమళ్ళిన హిందువుల్ని బద్ధకంగా, పనులుమానుకొని, ఏంచేతకాని సనాతనుల్ని నిష్ప్రయోజకుల్ని చేసి కూచోపెట్టే మామూలు నిర్వీర్యత్వం కాదుకద! లేక నిజంగా 'నేను సత్యాన్ని' తెలుసుకునేమార్గాన వున్నానా? ఇప్పుడు చావంటే భయంపట్టుకుంది. భగవాన్ పొందిన మొదటి అనుభవం జ్ఞాపకంవొస్తోంది. ఆ మధ్యాన్నం ఆయన నాకిచ్చిన గొప్ప చిరునవ్వు— దాని అర్థం " You Agnostic! " అని అయివుంటుందా.

ఇంకో ఒకటి, రెండేళ్ళలో తద్దినాలూ, పూజలూ చేసే మూర్ఖాచార పరాయణుడైన బ్రాహ్మడుగానో, బూడిదపూసుకున్న బైరాగి గానో, తయారవుతానా! మీరూ సుబ్బారావుగారూ నన్నుచూసి 'ఏమోయ్ నిరీశ్వరవాదీ, ఆంధ్రదేశ అపనమ్మక మహాసభాధ్యక్షా! ఏంచేస్తున్నావు?' అని వెక్కిరిస్తారుగావును ఇంకోసారి!

ఈ మీ ధ్యానం వ్యవహారం ఎందుకు పెట్టుకున్నానా అనిపిస్తోంది. It is passing the states of mere inquisitiveness. నాకు దానిమీద ఇష్టంపుట్టుతోంది. ఇంతా చేసి యిది నల్లమందు అలవాటువంటిదికాదుగద! మానేసి దీన్ని వొదిలించుకోనా? దీనివల్ల నేను, నాకూ ఇతరులకీ ఉపయోగం కాకుండా, ఐపోనుకద? భగవాన్ అట్లాకానంటారు. కాని ఆయనకి మాత్రం తెలుసా? Is he too not a victim perhaps to this self doping! ఈ స్వకీయ కృతనిషా వలలో ఆయనా పడి మోసపోలేదుకద! మనని బద్ధకస్తులుగా చేసే, ఏ నరమో ప్రజ్వల మౌతుందేమో? ధర్మాలూ, విశ్వాసాలూ, ప్రేమా వొదిలిపోయ్యే lotus-eaters అవుతామా? ఈ ధ్యానం బలవత్తర మయ్యేట్టుంది.

Arresting and perhaps sweet too.

నా కింక సినిమాలులేవు. కథలు వ్రాయడమనేది లేదు. రోజులో ఉత్తమమైన గంటలన్నీ భగవాన్ తీసుకుంటున్నారు. పదిన్నరకే నిద్ర. ఎంత మధురంగా వుంది!

౬౪

*Vizagpatam*
6-7-37

నేను చాలా అదృష్టవంతుణ్ణి. భగవాన్ పట్టుకున్నారు నన్ను చివరికి. G. V. the girl hunter, and story writer is going to die. స్త్రీకాముకుడు, కథకుడు, చలం చచ్చిపోబోతున్నాడు. అప్పుడే భగవాన్ కొంచెం ముక్కతినేశారు. అతనిలో, ఈశ్వరసందేహంలో, శృంగార తత్వంలో మునిగి బీకుతాగే, మాంసంతినే ఆడవాళ్ళని ముద్దుపెట్టుకునే Beer drinking mutton eating, girl kissing, G. V. జీవిలో ఆత్మవుందని గుర్తించ కలిగింది- మీరూ, అవును మీరూ-మీరూ.

నా కేదో సాక్షాత్కార మయిందనుకోకండి. కాని నాలోని యీ కాస్త మార్పే, గాలిని మరింత చల్లగానూ, కాంతిని ఎక్కువ తేజోవంతంగానూ, సముద్రాన్ని యింకా నీలంగాను మార్చింది, ద్వేషాలు కరిగిపోతున్నాయి. తోడి మానవులమీద కొత్త ప్రేమ పుదయించింది. చివరికి ట్రెయినింగు స్కూలుకూడా నాకు 'టెబర్నికిల్' అయింది. భగవాన్ నిజంగా నన్ను స్వీకరిస్తారంటారా? అవును పడమటి దేశాల్లో తన సందేశాన్ని వ్యాపించమని బ్రంటన్‌ని నేరుకు న్నారు, భగవాన్. ఆంధ్రదేశంలో ఆపనికే ఇద్దరు గొప్ప రచయితల్ని పట్టేశారు- టక్కరు భగవాన్.

నాకు పొగరెక్కిం దంటారా?

అవును. ఈ కాస్త కొత్త అనుభవమూ నాకు గర్వా న్నిస్తోంది. Dear Self, రోడ్డులో ఒక్క వొంపు తిరగాలి అంతే. చివరికి మీ D. I. పనికూడా love 's labour కింద మారుతుంది. మీకు నేను పాతాలు చెప్పడం చూడండి. మీకు! మీకు? నిర్మలులు, పరిశుద్ధులు మీకు!

నిన్న సాయంత్రం నాకు వొళ్ళు బావుండలేదు. 'ఈవాళ భగవాన్ దొరకడు ఎట్లాగూ. సినిమాకన్నా వెడదాం' అను కున్నాను. సైకిల్ మీద బయలుదేరానో లేదో నవ్వు వినపడ్డ ట్టయింది. 'నువ్వు నావాడివి. నీ కింక సినిమా లెక్కేమిటి?' అన్నట్టు.

ఐనా వెళ్ళాను - సగందూరంలో స్నేహితులు కనపడి ఆపేశారు. ఇంటికి వొచ్చి మంచి పిల్లాడిమల్లే నిద్రపోయి నాను. కాని ఎన్నటికైనా సినిమాల ఆకర్షణగాని, చిరునవ్వు అందంగాని, నామనసులోనించి పోతుందా? నాకు పోవాలని లేదు - ఎందుకంటే యీ ఆకర్షణలు పోయినాయా, జీవం లేని వాళ్ళతో జమ ఐపోతాను. కాని భగవానే తినేస్తే, మృత్యువు అద్భుతంకాదా? ఏదో నాలో పుట్టిన ఏతాత్కా లిక సంచలనాన్నో, (a subjective mood) —a phase of passing exhiloration గొప్ప చేసుకోటంలేదు కద ? ఏ వుదయమో పక్కమీదనించి లేచి, మళ్ళీ యథాప్రకారం అయిపోనుకద! పోనీండి ఏమైతేనేం. ప్రస్తుతం నవ్వుతో. ఏడుస్తో, యీ అర్థంలేని గొడవనంతా వ్రాసాను మీకు.

ఎందుకు వ్రాసాను మీకు? మరి నా ఉత్తరాలు చదవడం సరదాఅని ఎందుకనాలిమీరు? ఈ దీర్ఘమైనబాధనిభరించండి.

So long it lasts, this mood is sincere.
వొచ్చినంతవరకు ఈ ఆత్మానుభవం వాస్తవం. ఎక్కడో ఏ రహస్యపు జలో (fountain) బైటికి చిమ్మి ముంచెత్తు తోంది. వుంటుందా! పోతుందా?

భగవాన్ కే తెలియాలి. అల్ప ఆత్మజ్ఞే, ఈచిన్న వైను చుక్క నా పెదిమలపై రుచిచూసి, తల తిరిగి (losing my balance) యీ గొడవంతా వ్రాస్తున్నాను మీకు. ఇది పిచ్చిగొడవా? అవునే అనుకున్నా, ఎంత మధురం!

Yours in Bhagavan
G. V.

Indeed the prophecy is fulfilled Bhagavan has come to
కృష్ణాతీరం
for you and even for me.

౬౫

విశాఖపట్నం
8—7—37

*My dear Joint Firm,*

ఈ simple repetition నేనెవరు? అనే ప్రశ్నని జపించడం నన్ను ఏదో స్థానానికి తీసుకుపోగలదని విశ్వసించగలిగితే! 'నేనెవర్ని?' అని అడగడానికి నేనెవర్ని? ఆ నేను అనేది ఏమిటి: ఇదంతా Puzzling గా వుంది. ఈభగవాన్ నాతో చలగాట మాడుతున్నారు. దాగుడుమూత. నాదో

వల్లో ఆశలూ ఆకర్షాలూ కల్పించి నన్ను పరీక్షిస్తున్నారు. ఆరోగ్యం బాగాలేదు. ఆరోగ్యం బాగాలేకపోతే భగవాన్ దగ్గిరికిరారు. నాకే ఈసంగతిలో నిశ్చయంగా నమ్మకం కలిగితే అన్నీ వొదిలి భగవాన్‌నే అనుసరిద్దును.

౬౬

విశాఖపట్నం
11—7—37

*My dear happy one,*

మూడురోజులనించి వొంట్లో బాగాలేదు. భగవాన్‌కి రోగగ్రస్త శరీరంచూస్తే, అసహ్యంగావును.

ఆయన సామీప్యం తప్పిపోయింది. ఈవాళ (ఆదివారం) దాకా నేను ఆగవలసి వొచ్చింది. నిన్న నేను నిద్రపోయి లేచే ప్పటికి, మీ వుత్తరం నాకోసం ఎదురుచూస్తోంది. చదివాను. హఠాత్తుగా ఏడవడం ప్రారంభించాను. నా హృదయం భగ వాన్‌కి తెరుచుకుంది. నాతోనే వున్నారు ఆయన.

వొడిలిపోయే మన ఆత్మల్ని—ఒకరి కొకరం వికసింప చేసు కునేందుకు సహాయపడాలని వ్రాసి వున్నట్టుంది.

ఒక వారం గొప్పగా గడిపాను. ఇక ముందు ఏం జరిగినా ఏమైనా, మీకు వ్రాసిన నా అనుభవం ప్రతిమాటా వాస్తవం. ఒకప్పుడు నేను భగవాన్ పాదాలకి, చాల సమీప వర్తినైనానని అనగలను. మళ్ళీ సందేహాలు.

వృత్తనిర్గుణమైన శాంతి (negative peace) వల్ల నాకేమీ తృప్తిలేదు. I should prefer unrest and turbulance. అంతకన్న అశాంతీ, తీవ్రమైన బాధా నయం.

'తొందరపడకండి' అంటారు మీరు. కాని ఏమీ తెలీని వాణ్ణి, ప్రథమస్థితిలో వున్నవాణ్ణి, ఏం కలుగుతుంది నాకు, ఇంత తొందరగా! కొన్ని జన్మల తరవాతగాని, ఏమీ లాభంలేదేమో! కొన్ని లక్షల జన్మల తరవాతగాని, ఏమీ లాభంలేదేమో! కొన్నిలక్షల జన్మలతరవాత లభించే దాని కోసం, (అదీ చాలా సందేహం) ఇన్నేళ్లూ నాకు సుఖాన్నిచ్చిన వాటినన్నిటిని వొదులుకోనా?

కనక భగవాన్‌కి అల్టిమేటం Ultimatum ఇస్తున్నాను.

'నీకు అవసరమైతే నీ పూజకు యీపుష్పాన్ని తొరగా ఏరుకో. కాకపోతే దుమ్ములోపడి నశిస్తుంది' —టాగూర్.

ఇల్లాంటి 'అల్టిమేటం' అరుణాచలానికి ఇవ్వలేదా భగవాన్?

ఆయన అరుణాచలమాల, బైబిల్లో, Songs of songs గీతాంజలిలో కొన్ని గీతాల్ని జ్ఞప్తికి తెస్తోంది.

అవును. గుడ్లూ, మాంసమూ మానేశాను. భగవాన్ సాత్వికాహారం తీసుకోమన్నారని సౌరిస్ చెప్పింది. రెండు మాట్లు తింటే, రెండుసార్లూ, ఘోరంగా డోకులువెళ్ళాయి. నా జీర్ణకోశాన్నిసద్ది, ఆరోగ్యాన్నిచ్చే ఆహారం అట్లా ఐయింది. తాగినా అంతే, కక్కులు వెళ్ళిపోయినాయి.

ఆహార పానీయాలు నా స్వాధీనంలో వుంచుకోగలను. ఎందుకంటే ఎప్పుడూ వాటినిచూసి నాకు గొప్పమోహం లేదు.

కాని ఆడపిల్లలా?– ప్రయత్నిస్తాను. అయినా, ఆడవాళ్ళు నావేపు రాకండా భగవానే జాగ్రత్త తీసుకుంటున్నట్టు న్నారు. ఏమైనా, నా అంతట నేను వేటకు బైలుదేరను.

'ప్రస్తుతం కొన్నాళ్ళు మానండి' అంటారు మీరు. నా ఆత్మ ఏ కొంచెం సాక్షాత్కారమైనా, నాకు ఆడపిల్లల అవసరంలేదు అంటాను నేను. చివరికి హాయిగా నవ్వుతారు మీరు నన్నుచూసి. భగవాన్ సంగతి ఎవరితోనూ చెప్పను. చెప్పుకోడానికి సౌరీన్ తప్ప ఎవరూలేరు అయినా.

మా డాక్టరుగారు వున్నారు. ఆమెనించి, ఏమీ దాచను. ఆమె చిరునవ్వుతో 'సరేకానీ– యీ కొత్తపిచ్చి నీకు సరదాగా వున్ననాళ్ళు' అంటారు తెలిస్తే.

## ౬౭

విశాఖపట్నం
11-7-37

ఇప్పుడే మీ కో ఉత్తరం టపాలో వేశాను. తమాషా జరిగింది. అది మీకు వ్రాయాలి. భోజనంచేసి, నా భగవాన్ కోసం, కూచుందామనుకున్నాను. భోజనం తరవాత, అరగంటసేపుదాకా, మెదడుతో పనిచెయ్యలేను, చదువుకూడా చాతకాదు. కాని మెదడు పనులలోకి అన్నిట్లోకీ, కేంద్రీకరిం

చడంలో, బలవత్తరమైన భగవాన్ ధ్యానం పొట్టనిండా భోజనం చేసినాకూడా సాధ్యమవుతుంది.

తరవాత-బట్టలులేవు-లాండ్రీ చాకలి రాలేదు బట్టలతో పారిపోయినాడేమో ననుకున్నాను లాండ్రీకన్నా వెళ్ళాలి, లేకపోతే, బట్టలు కొని కుట్టించుకోవాలి, లేకపోతే కుట్టడానికి వచ్చిన, కొత్త బట్టలన్నా తెచ్చుకోవాలి దర్జీనించి. వూరికి ఆ చివరికి వెళ్ళాలి

కాని భగవాన్ ఏమంటాడు—'(Dont worry) ఆదుర్దా వద్దు. కాలంవొచ్చేప్పటికి అన్నీ జరుగుతాయి.' సంఘసంస్కారము -స్త్రీలబాధల విషయమూ అంతేనేమో!

కాని నాకు విశ్వాసంలేదు. లేచి బట్టలువేసుకుని, బయలు దేరుతున్నాను. ఎవరో తలుపు కొడుతున్నారు. చాకలి. బట్టలు ఇంట్లో పెట్టాను. ఎట్లానూ బైలుదేరాను కదా అని దర్జీదగ్గిరికి వెడదామని రోడ్డువెంట 20 గజాలు వెళ్ళేనో లేదో, ఓ మనిషి నన్నాపాడు.

'నువ్వెవరు?'

'నేను మీా దర్జీని. ఎప్పుడు పంపను బట్టలు?'

నన్ను వెళ్ళవద్దని, త్వరపడవొద్దని భగవాన్ సుదేశం. కాని ఉత్తరాలు వెయ్యాలే? కాని ఇక్కడి టపాపెట్టెలు ఆదివారాలు తెరవరు. మళ్ళీ బయలుదేరాను ఆ చివరికి. పక్కపోస్టు పెట్టెలో ఎవరో ఉత్తరాలు వేస్తున్నారు. ఆ పెట్టెని మాత్రం ఆదివారాలుకూడా తెరుస్తారని చెప్పారు.

ఇవి (coincidences) కావొచ్చు. కాని ఆశ్చర్యంగా ఓసారే జరిగాయి - ఎవరో ఉద్దేశించినట్టు. ఇల్లాంటివి ఇది

వరకూ జరిగి వుండవొచ్చు. ఎంత అదృష్టం? అనుకొని వుంటాను అప్పుడు. కాని ఇప్పుడు భగవాన్ కావలసి చేశారు అనిపిస్తోంది.

నాకు భగవాన్ పిచ్చి పట్టలేదుకద? ఇంకా సాయంత్రం దాకా భగవాన్‌తో కూచోవచ్చు.

నిన్న సాయంత్రం 'ఇవాళ నువ్వు సినిమాకి వెళ్ళవు' అన్నారు భగవాన్.

'ఇవాళ చాలా మంచిబొమ్మ త్రివర్ణచిత్రం. Marlene Deibrich కథానాయకి—' మొదలైనవి చెప్పాను నేను.

'కాదు వెళ్ళకు' అన్నారు భగవాన్.

'చూద్దాం మీరు నాతో వుంటే వెళ్ళను లెండి' అని జిత్తుగా అన్నాను.

'అట్లాకాదు. ముందు ఇప్పుడే వాగ్దానంచెయ్యి' అన్నారు ఆయన.

చాలా అయిష్టంగా వొప్పుకున్నాను.

ఆరయింది. ఒకటేవాన. చీకటి-వొంటరితనం- గది పక్క అమ్మాయి ఇక కనపడకుండా వెళ్ళిపోతుంది వూరికి. దిగులు లోంచి ఏంచెయ్యను? సినిమాకి వెళ్ళితీరాలి. కాని వాగ్దానమో! కాని నా వాగ్దత్తం-ఎవరికి? నామనసులో మాయకి. ఇట్లా వొంటరితనంతో బాధపడమని భగవాన్ ఆజ్ఞా? వాన లోనే బైలుదేరాను. ఇరవైగజాలు వెళ్ళాను. వానలోతడిసే కుష్టురోగికి తిండిలేదు! భోజనానికి డబ్బిచ్చాను. ఎందుకో యింక వెళ్ళలేనంత జబ్బుతోచింది నాలో. తలనెప్పి. తిరిగి వొచ్చాను. మా యింటి పక్కఅమ్మాయి ప్రయాణం మాను

కుంది. కాని నా తలనెప్పి? ఇట్లా బాధపడవలసిందేనా? కాని యీ తలనెప్పితో సినిమాలో యింకా బాధపడేవాణ్ణే కదా!

అని వెళ్ళడం యోచన మానుకున్నాను. వెంటనే వాన ఆగింది. అందమైన నిద్ర. సాధారణంగా జరిగే పనులకి ఏదో మహాత్యం ఆరోపించి, ప్రాముఖ్యత నిస్తున్నాను. కాని మామూలుగా జరిగే పను లనేవి వున్నాయా లోకంలో? ప్రతిదీ అద్భుతమే మహాత్యమే. ప్రతి చిన్నదానిలోనూ, Mystery ని (మహాత్యాన్ని) చూడడంవల్ల చివరి మహాత్యాన్ని, Ultimate mystery ని తెలుసుకునేందుకు శిక్షణ పొందుతోంది మనసు.

Glory to Bhagavan భగవాన్‌కి జై.

మీకు ఒకటి చెప్పడం మరచిపోయినాను. మొన్న పింగళి లక్ష్మీకాంతంగారు అడిగారు నన్ను - 'మీరు రమణమహర్షి ద్వారా మారిపోయారట కాదా?' అని. ధైర్యంగా 'లేదు' అన్నాను. 'అవు నవును ఆయన శాసించే యోగసాధన చెయ్యలేము' అన్నారు ఆయన. క్రైస్తుని నిరాకరించే పీటరు మల్లే లోపల సిగ్గుపడుతూ పైకి నవ్వాను. కాని నేను చేసిన పని మంచిదే అనిపిస్తోంది. నేను అవునంటినా నన్ను ఒకటే ప్రశ్నలు వేస్తారు ఆయన. నమ్మించేటట్లు అబద్ధం చెప్పడం చాతకాలేదు. బాధ పడేవాణ్ణి ఆ ప్రశ్నలతో. ఎవరికి గాని నాహృదయ రహస్యనిధి Secret treasure of my Heart ఎట్లా చూపగలను.

డిశంబరులో భగవాన్ దగ్గిరికి వెడదా మంటారా? సరే వెడదాం. పిలుపు గట్టిగా రానిండి. డిశంబరు వొచ్చేటప్పటికి ఏది ధర్మమో, ఏదికాదో, నా హృదయానికి, చెప్ప గలగ నన్నా గలగాలి, లేక నన్ను వొదిలిపో నన్నా పోవాలి భగవాన్.

రోషాలు పట్టే చిన్నపిల్లవాడినై నానా ? అవును నాకు నరకమన్నా, పాపమన్నా, ఆడపిల్ల లన్నా భయంలేదు.

ఏమిటి! పడ్డకుడు చచ్చిపోతే దుఖ్ఖమా మీకు ? నాకు వుండే యిద్దరు షడ్డకులూ చచ్చిపోయారు. సంతోషంతో నిండిపోయినాను, ఇంకా లేరుగాని. షడ్డకుడి చావుకన్న ఉత్సాహమైనవార్త - ఏబావదో మరణవార్త(ఒక్కడుతప్ప) తప్ప ఇంకేంఉంటుంది ? మళ్ళీ ఎక్కిరింపు mocking mood లోకి దిగానా ? అవును ఇంకాపోలేదు—పోదు.

నాచుట్టూ ఇన్నేళ్లు స్థాపించుకున్న, ఆలోచనలపద్ధతులూ, సుఖాల అలవాట్లూ వీటిని వొదుల్చుకోవాలనే తలుపు, నాకు భయమేస్తోందని మీకు తెలుసు. నేను ప్రవేశించబోయే, కాంతివంతమైన శూన్యం (void of light) నాకు కనబడుతోంది. ఈ కొత్తపద్ధతి, మరణమంత భయంకరగా ఉంది. కాని, చావుకాని యీ ఆధ్యాత్మికానుభవంగాని, నే ననుకున్నంత భయంకరం, కావేమో కాని—
But I feel so lost

yours in Bhagavan still
V.

౬౮

వైజాగ్
12—7—37

I regret why I undertook this Bhagavan's business. He is very, exacting and I am not having a dot of Peace. One fine morning I have done with Bhagavan. You will say Bhagavan has not done with me yet. We will see.

Very restless and ill, in Body and soul.

ఈ భగవాన్ వ్యవహారం ఎందుకు పెట్టుకున్నానా, అని పశ్చాత్తాప పడుతున్నాను. ఒక్కరవ్వ శాంతి లేదు. ఏ ఉదయాన్నో, భగవానకి స్వస్తి చెపుతాను. కాని భగవాన్‌కి, నాతో పని, తీరలేదంటారు మీరు. చూద్దాంకదూ?

శరీరంలో, ఆత్మలో చాలా చికాకుగా జబ్బుగా వుంది.

౬౯

వైజాగ్
13—7—37

*My dear boy,*

లేదు. పాపం చేశాననికాని, తప్పు చేశాననిగాని నాకేమాత్రమూ లేదు.

(చలానికి ఒకస్త్రీతో సహవాస మయింది)

నేనేం పాపం చెయ్యలేదు. ఆధ్యాత్మిక జీవనానికి నే నింకా 'పక్వం' కాలేదు. అనుకుంటున్నాను.

అది పోనీండి - చాలాఖేదంలో - బాధలో— చికాకులో వున్నాను, చాలాకారణాలవల్ల. కాని, నిజంగా కారణమే లేదు.

Life is a dirty lie. No saul. No realisation. All foolishness and illusion. A few cells have gathered together, to suffer and be duped and rend themselves, with misery and extinction. That is Life.

జీవితం అసహ్యమైన అబద్ధం. ఆత్మ లేదు. ఐక్యమూ లేదు. అంతా వెర్రి - మాయా - కొన్ని జీవాణువులు చేరాయి యిట్లా బాధ పడటానికి, మోసపోవడానికి, ఖేదంతో నాశనంతో చీల్చుకుపోవడానికీ. అదీ జీవితమంటే.

ఇంకా ఇట్లా బతకలేను. ఇట్లా పీలైనప్పుడల్లా, ముక్కు- మూసుకుని, మూలకూచుని దేహంలో జబ్బుతో, అర్థంలేని ఆ బడిపనితో బాధపడుతూ.

This thing must end.

ఆఖరు కావాలి యీ వ్యవహారం. తాగి మరిచిపోతే!! నామీద నాకే తిరగబాటు చెయ్యా లనిపిస్తోంది.

I am bitt er.

౩౦

విశాఖపట్నం
17—7—37

సందేహా విశ్వాసా లనే అలలమీద, ఇటూ అటూ వూగుతున్నాను. ఏమైనా ఇంతకన్నా నాకేమీ అందకపోతే,

గంటల కొద్దీ, ఈ ధ్యానంలో కూచోలేను. కాని ఇప్పుడే ఓ ముష్టి అతను పాడుతున్నాడు.

"మూడు మూళ్లా బావిలోనా
ఆరు మూళ్లా చాపవొకటీ
మూలమెరిగీ గాలమెయ్యరా
జై గంట లింగా శ్రీరామలోల
దీని భావము నీకు తెలుసూరా"

ఎవరికి తెలుసు?

పాడి అణా సంపాయించాడు నానించి. అణా ఇవ్వడం కాదు ముఖ్యం. అర్థంలేని యీ తుక్కు (arrant foolish-ness) పాడే అతనికి, అణాలు ఇస్తున్నానని:

ఈవేళ పొద్దున్న, ఇంకో ముష్టి అతను ఒక సొరకాయ బుర్ర వీణ పట్టుకొచ్చాడు. క్షవరం చేసుకొంటున్న నా గుండెల్లో ధ్వనించింది ఆమోత. ప్రత్యేకం పోయి అతనికి డబ్బు లిచ్చాను. My usul equelibrium is disturbed. నామామూలు స్తిమితం తబ్బిబ్బయింది.

కాని ఎందుకు? ఏం లాభం? అని నిరంతరం ప్రశ్నించు కుంటున్నాను. నేను యీ ముష్టివాణ్ణిచూస్తే మండిపడేవాణ్ణి-ముఖ్యం, బుర్రలు మీటుతో యీచెత్తపాటల్నిపాడేవాళ్ళని చూసి.

ఆ "మూలమెరిగీ గాలమెయ్యరా"

నా హృదయాన్ని వెంటనంటి పలికిస్తోంది. ఎంత గొప్పగా అన్నాడు. నా ప్రస్తుతస్థితిలో అట్లాంటికవిత్వమే, కవిత్వ మనిపిస్తోంది.

అది పోయింది - చాలాఖేదంలో - బాధలో— చికాకులో వున్నాను, చాలాకారణాలవల్ల. కాని, నిజంగా కారణమే లేదు.

Life is a dirty lie. No saul. No realisation. Al l foolishness and illusion. A few cells have gathered together, to suifer and be duped and rend themselves, with misery and extinction. That is Life.

జీవితం అసహ్యమైన అబద్ధం. ఆత్మా లేదు. ఐక్యమూ లేదు. అంతా వెర్రీ - మాయా - కొన్ని జీవాణువులు చేరాయి యిట్లా బాధ పడటానికి, మోసపోవడానికి, ఖేదంతో నాశనంతో చీల్చుకుపోవడానికీ. అదీ జీవితమంటే.

ఇంకా ఇట్లా బతకలేను. ఇట్లా వీలైనప్పుడల్లా, ముక్కు మూసుకుని, మూలకూచుని దేహంలో జబ్బుతో, అర్థంలేని ఆ బడిపనితో బాధపడుతూ.

This thing must end.
ఆఖరు కావాలి యీ వ్యవహారం. తాగి మరిచిపోతే! నామీద నాకే తిరగబాటు చెయ్యా లనిపిస్తోంది.

I am bitt er.

౭౦

విశాఖపట్నం
17—7—31

సందేహా విశ్వాసా లనే అలలమీద, ఇటూ అటూ వూగుతున్నాను. ఏమైనా ఇంతకన్నా నాకేమీ అందకపోతే,

గంటల కొద్దీ, ఈ ధ్యానంలో కూచోలేను. కాని ఇప్పుడే ఓ ముష్టి అతను పాడుతున్నాడు.

"మూాడు మూళ్లా బావిలోనా
ఆరు మూళ్లా చాపవొకటీ
మూాలమెరిగీ గాలమెయ్యారా
జై గంట లింగా శ్రీరాములోల
దీని భావము నీకు తెలుసూరా"

ఎవరికి తెలుసు?

పాడి అణా సంపాయించాడు నానించి. అణా ఇవ్వడం కాదు ముఖ్యం. అర్థంలేని యీ తుక్కు (arrant foolishness) పాడే అతనికి, అణాలు ఇస్తున్నానని.

ఈవేళ పొద్దున్న, ఇంకో ముష్టి అతను ఒక సొరకాయ బుర్ర వీణ పట్టుకొచ్చాడు. క్షవరం చేసుకొంటున్న నా గుండెల్లో ధ్వనించింది ఆమోత. ప్రత్యేకం పోయి అతనికి డబ్బు లిచ్చాను. My usul equelibrium is disturbed. నామామూలు స్తిమితం తబ్బిబ్బయింది.

కాని ఎందుకు? ఏం లాభం? అని నిరంతరం ప్రశ్నించుకుంటున్నాను. నేను యీ ముష్టివాణ్ణిచూస్తే మండిపడేవాణ్ణి-ముఖ్యం, బుర్రలు మీటుతో యీచెత్తపాటల్నిపాడేవాళ్ళని చూసి.

ఆ "మూాలమెరిగీ గాలమెయ్యారా"

నా హృదయాన్ని వెంటనంటి పలికిస్తోంది. ఎంత గొప్పగా అన్నాడు. నా ప్రస్తుతస్థితిలో అట్లాంటికవిత్వమే, కవిత్వ మనిపిస్తోంది.

గుడ్డి ముసలిఅతనూ, అతన్ని నడుపుతో ఒక పిల్లా-
ఆపాట పాడింది.

నేనూ, సారిస్.

ఆశ్రమంనించి వొచ్చిన ఉత్తరాన్ని మీకు పంపుతున్నాను, కొంత దారి చూపుతోంది. నిరంజనానంద్ ఎప్పుడూ బళ్ళో టీచరుపని చేయలేదుకద! "ఈధ్యానంకోసం నాతక్కిన సుఖాలూ, పనులూ, పిల్లలతో ఆడుకోడంకూడా వొదిలి వెయ్యాలా?" అని నేను అడిగితే, సైకాలజీ పుస్తకం లాగు జవాబు వ్రాశారు, ఆయన.

ఓపిక పట్టండి. కాలం రానీండి. నేను మిస్టిక్ కథలూ, నాటకాలూ వ్రాస్తాను.

Glory to Bhagavan.

౨౧

విశాఖపట్నం
31-7-37

*My dear Deekshit Bhagavatar,*

భగవాన్ నన్ను వొదిలేశేప్పటికి, స్త్రీ చేతుల్లోకి వెళ్ళాను. I am feeling dirty and sick in soul. ఈ వాళ ప్రొద్దున ఆమె చక్కగా, అలంకరించుకొని వచ్చినా, ప్రాయశ్చిత్తంకింద ఆమెవంక చూడనన్నా లేదు నేను.

మళ్ళీ భగవాన్‌తో సంధిజరిగింది. క్షమించారేమో నన్ను! ముందు యీ సౌఖ్యాల నన్నిటినించీ, నాకు రుచి లేకుండా చేశేట్టున్నా రాయన.

రైల్లో వొస్తో కాలమూ, దూరమూ, వృత్తభ్రమ అని తెలుసు కొన్నాను. 'సద్దర్శన్'లో ఆ సంగతే చదివాను ఇవాళ.

భూత భవిష్యత్తులు 'ఇప్పుడు' మాత్రమే ఎట్లా కాగలవో అర్థంకాలేదు. How past and future are only 'now' I understand but do not realise. అర్థమవుతుంది. కాని అనుభవం కాదు.

నిరంజనానంద్ వ్రాసిందాంట్లో నేను ఇది వొప్పుకోను. ఆయన, ధ్యానం వైరాగ్యాన్ని ఇవ్వాలంటారు. ముందు ధ్యానాన్ని నాకు ఆనంద మివ్వమనండి అంటాను నేను. వైరాగ్యం దానంతట అదే రావాలి. కాని నేను దేన్ని వొదులుకో బోవటం లేదు. తిండీ, తాగుడూ, మోహం, తాత్కాలికంగా శిక్షణక్రింద యీ Experiment కోసం వొదులుకున్నాను. ఆత్మలో కలిగే ఆనందంలో నాకు నమ్మకం లేకపోలేదు. యీ ధ్యానంవల్ల 'త్యాగం' వొదులు కోడం (abstinence) సులభ మాతోంది. కాని దేన్ని నాకు వొదులుకోవాలని ఇష్టంలేదు. అవును, సినిమాకాని, ప్రేమదృష్టిగాని, మంచి పుస్తకంగాని వొచ్చినా ధ్యానం చెడకొడుతుంది.

V. V. P. S is my friend of old Eton days continuing into Oxford and Guntur. అతను పేచీ కోరు. కాని అతని హృదయం బంగారం. అతని భార్య, చాలా ఉత్తమురా లంటారు. కనుక కానీండి పెళ్ళి.

ఎందు కా బాధ మీకు ?

భగవాన్ యీ తమాషా చేస్తారు. ముందు మనని బాధ లోకి తోసి, తన శరణు చొచ్చేటట్టు చేస్తారు. Bhagavan plays this bad trick of making us meserable, and forcing us to seek him for refuge. Cheer up, my boy, every thing is going to be alright with us two.

మీ స్నేహితులు నాపుస్తకాన్ని విమర్శించారు చూశారా? తాను గొప్ప 'అర్టిస్టు'ని అని స్వవిశ్వాసంవున్న ఆయనే వ్రాసివుంటాడు ఆ విమర్శ. నా నీతులతో వాళ్ళకి వున్న తగాదాలతో, నాకు తగాదా ఏమాత్రమూ లేదు - కాని అశ్లీలం వ్రాయడమే నా ఉద్దేశ్యంకాదని వాళ్ళు గుర్తించకలిగితే - ఆ కథల అందం చూడనంత గుడ్డివాళ్ళు ఎట్లా కాగలరో నేను ఆలోచించుకోలేను. అందులో కొన్ని కథలు technically perfect.

Cheerio

ఇంతమంది చిన్నకథను గురించి వ్రాస్తున్నా - చిన్నకథ ఏమిటో తెలిసినవాళ్ళు ఒకరూ కనపడరు.

౩౨

వైజాగ్
5-8-37

*My dear cunny-boy,*

హాల్లో, హాల్లో ఎట్లావున్నారు మీరు? హాల్లో హాల్లో? మాట్లాడరేం? ఎక్కడవున్నారు? ఏం చేస్తున్నారు? ఏమిటి? బిగ్గిరిగా చెప్పండి. తనిఖీలా? కమానులా? Thank you.

నేనా! నేనా! Smoking and laughing. సిగరెట్లు కాలుస్తో, నవ్వుతున్నాను. లేదు - మాంసం తినటంలేదు. త్రాగుడూలేదు.

దోవ చేసుకుని ముందుకి పోతున్నాను. I am pushing on. భగవాన్ నాపైని దయగావున్నారు. అవును. ఏళ్ళనించీ, పేరుకొన్న కిలుము, క్రమంగా తోమేస్తున్నారు ఆయన. ఈ పాతహృదయంమీద అక్కడక్కడ వెలుతురు రేఖలు పడుతున్నాయి. Glory to Bhagavan.

ఈ గాడిదని వెనకనించి వెడుతున్నాను. ముందునుంచి బతిమాలి ఆకర్షిస్తున్నాను. కాని ఆడగాడిదలంటే ఇష్టం దీనికి. వాటిని వొదలనంటుంది.

It is indeed cruel, you are not allowed the time to call your soul your own. శలవు పెట్టండి.

అవును మార్గం కష్టతరం. మనకి గొప్ప ఉపయోగించే సమయాలని, అనారోగ్యమూ, స్నేహితులూ మింగేస్తారు. కాని వొంటరిగా బతికే నాకు ఒక గంటసేపు కబుర్లు చెప్పే స్నేహితులన్నా లేకపోతే, జీవితం మరీ ఒంటరి ఐపోతుంది. సాహసం కావాలంటే ఏదో ఒకటి ఇచ్చి కొనుక్కోవాలి. We have to pay for the company we get భగవాన్ బోధించే మార్గం తప్ప నాకు ఇంకేంగతి లేదని స్పష్టమౌతోంది. భగవాన్ సహాయం చేస్తేనేకాని చాలా కాలంపట్టేట్టుంది నా ప్రయత్నం. ఆసక్తులు ఎన్నో వొదులుకుంటున్నాను. కాని absolute surrender కావాలం

టాను భగవాన్! నాకే విశ్వాసం పుడితేనా! కాని అవిశ్వాసినై గడిపిన కాలానికంతా ఫలం అనుభవించాలి ఇప్పుడు.

౭౩

Vizag
12-8-37

My dear Buddy john,

(ఎవరో భారతిలో చలాన్ని తిట్టారని
దీక్షితులుగారు వ్రాశారు)

మీరు చెప్పేమాట నిజమే నేను కథలు మానేశాను. వ్రాసినన్నాళ్ళూ నాకథల్ని తిట్టినవాళ్ళే. నేను వ్రాయడం మానేశానా, ఇంక 'ఎంతమంచి కథలు వ్రాశేవాడు ఇట్లా ఐపోయినాడు?' అంటారు. మొగవాడు స్వార్థపరుడైన ప్రభువనీ (tyrant) సృష్టి స్త్రీపైన చూపే క్రౌర్యాన్ని ఆధారంగా స్త్రీని బాధపెడుతున్నాడనీ, నేనువ్రాసే చేదు సత్యాన్ని Bitter truth ని చెప్పడానికి నేనుపూసే శృంగారపు చెక్కెరని చప్పరించుకోడం కోసమే, ఇప్పుడు నా కథలు చదువుతున్నారని నాకు తెలుసు.

అతను ఏ సుబ్రహ్మణ్యమో, ఆ వ్రాసిన ఆయన్ని నే నెరగను.

బాధ పడే శరీరాన్ని వేరుగా చూడాలని మీరు చేసిన ప్రయత్నం చాలా గొప్పగావుంది. మనసులోనన్నా అందటం లేదు. ఆ ప్రయత్నం నాకు కొంత కాలానికి చేతనవుతుందేమో!

నాదగ్గిరికా? శాంతికోసమా! !

మీారు !

మిమ్మల్ని చూడాలనే సంతోషానికి, స్వార్థంగా లోబడి మిమ్మల్నీ రమ్మంటున్నాను.

కాని నాదగ్గిరికి శాంతికా మీారు!

శ్రీ శ్రీని కలుసుకున్నాను యీా వూళ్ళో. ఇప్పుడు అతనూ విశ్వేశ్వరావూ జంట. నేను వృత్త పశువుల్లో పశువు bestial brute అని విశ్వేశ్వరావు రహస్యాభిప్రాయం.

శ్రీశ్రీ 'సరైనవాడు. కాని భగవాన్‌కి లాభంలేదు. కాని నాకు చా · సరిపడ్డమనిషి. ఆధ్యాత్మికంగా promise కల వాడు, కామరాజు బాపయ్య. మీాకు అతను తెలుసు. అతనికి మీామీాద చాలా ప్రేమ. నేను అతనితో భగవాన్ సంగతి మాట్లాడలేదు.

భారతిలో విమర్శకి జవాబు వ్రాయడం తప్పకుండా అవసరమని మీారు నమ్మితే, మీా కిష్టమైతే మీారే వ్రాయరాదూ! ప్రత్యుత్తరం? మీారు ఏం వ్రాశారు అనేది కాదు ముఖ్యం. It would be just wonderful and great for me to have your public moral support మీారుబహిరంగంగా మీానైతిక ఆశ్రయాన్ని, నా కివ్వడం, నాకు చాలా గొప్పగా వుంటుంది. కాని నా కన్నిటికన్నా సంతోషం, మీా admirers కి కలిగే shock షాక్ చూడాలని.

Yes detachment should give you the strength to do unrighteous things, as it should give me strength to discard them. I am unwell to day. That is why, I am preaching and advising you to get into a dirty muddle. Sweet nice peaceful you and you and you.

నేను ఓ mystic కథ ప్రారంభించాను. చివరికి ఎట్లా వుంటుందో! పూర్తి కానీండి. పొద్దున్నే ఆ గంటా ధ్యానం తరవాత, రోజంతా, చాలా శాంతిగా వుంటోంది. ప్రస్తుతం సందేహం లేకండా నాకు మంచి జరుగుతోంది యీ ధ్యానం వల్ల—చివరికి ఏమన్నా కానీ.

ఇప్పటికీ నేను doubter ని. సందేహిస్తున్నాను! ఈ శాంతి నిచ్చేది ఏది? నావొంటి ఆరోగ్యమా? నా మనో ఆరోగ్యమా? లేక యీ ధ్యానమా? ఇట్లా అంటిపెట్టి సాధన చేస్తే, ఇంతకన్న స్పష్టమైనది, నిశ్చయమైనది, అనుభవం లోకి వొచ్చితీరాలి. స్వాధీనం తప్పి, అతివేగంతో పరిగెత్తే భయంకరమైన, ఇంజనుమల్లే పనిచేస్తుంది నా మనసు. ఎప్పుడూ. యీ మనసువల్ల చాలా బాధపడ్డాను. ఈధ్యానం నా మనసుని శాంతిపరుస్తోంది.

నా ఆలోచనలు, moods, చూచి గర్వపడ్డాను. అభివృద్ధిచెందిన, ఔన్నత్యాన్నందుకున్న ఆత్మకి కలిగే గొప్ప లక్షణాలని, Intellectual heights, artists temperaments,—all that restlessness and suffering ఆ బాధఅంతా ఇప్పుడు మనసుకి పట్టినజాడ్యం లాగు కనపడుతోంది. అంతేనా?

సందేహాలు అనంతరం, మనసుకి అవి సహజం. ఒక్క జ్ఞానమే సందేహాన్ని అణిచేస్తుంది. కాని ఆ జ్ఞానం ఎక్కడ దొరుకుతుంది? ఎక్కడ వుంది? ఈ ధ్యానం, ఆ జ్ఞానాన్నిస్తుందా? సందేహిస్తాను. జవాబు చెప్పకొని నమ్ముతాను. మళ్ళీ సందేహిస్తాను. మీకు వ్రాస్తాను.

౭౪

బెజవాడ

16-10-37

*My dear disappointed,*

తెనాలినించి సుబ్బారావూ, నేనూ చాతకాలవలె ఎదురుచూశాము మీకోసం. దిక్కుమాలిన పక్షుల దాహం తీర్చడానికి, ఒక్కచుక్క 'బీరు' కూడా దొరకలేదు. నన్ను డిజప్పాయింట్ చేయడానికి భయపడకండి. Hope is sweet Expectation is all that life holds bright for me. జరుగుతుందనే నమ్మకం మధురం. జరుగుతుందని ఎదురు చూడడం మాత్రమే జీవితానికి కాంతి నిస్తోంది నాకు.

మామూలుగా వున్నాను. దేనికోసంకూడా (ఒక్క స్త్రీకోసంతప్ప బహుశా) నేను భగవాన్ని వొదలను. తృష్ణపడే నా ఆత్మకి సంతుష్టి నియ్యగలది ఏదో జీవితంలో జరుగుతుం దనే, ఎంతకీచావని యీ నమ్మకం నశించి, నిమిషాన్నించి నిమిషానికి, ఏ దిగులూ, ఆశా, లేకండా పోస్టాఫీసు గుమాస్తాలవలె, పిట్టలవలె బతకగలిగితే బావుండును. నాశలవ మంజూరు చెయ్యడానికి చాలా ఇబ్బంది పెడుతున్నారు. తలవొంచడానికి వొప్పుకోకపోతే ఎన్ని కష్టాలు ?

నాకే ఆరోగ్యం వుంటేనా– All India Craw-ling tourపోదును.Hyking and walking toursమామూలైపోయినా గనక.

౭౫

వైజాగ్
27-10-37

*My dear self,*

మీరు పంపిన పళ్లకి, ఆశ్రమంనించి నాకు, ఆశీర్వచనాలు వొచ్చాయని, మీకు వ్రాయడం మరిచిపోయినాను. ఆపళ్ళు, స్టేషన్‌కి మనం తీసికెళ్ళిన సాయింత్రం ఎంత అందంగావుంది? మీ సాన్నిధ్యమే అంతగొప్పగాచేసింది.

I am progressing. ఈ మనోస్తితి, ఇట్లానే కొనసాగితే-(ఇప్పుడు ఇంకమనోస్తితికాదు-అనుగ్రహం అయింది) కొన్ని నెలలు యీ అనుగ్రహం నాతో వుంటే యీ వెర్రి అహం (this poor ego) ఏమవుతుంది? సుందరమైన యీ హృదయకాంతిలో చంద్రరేఖమల్లే కరిగిపోతుంది.

చాలా గొప్పగావుంది నామనసు. I am having a glorious time. నా సందేహాలు మాయ మవుతున్నాయి చాలాసందేహాలలోంచే, ప్రత్యుత్తరాలు బయలుదేరుతున్నాయ్.

పిచ్చిబుజ్జి (Poor dear old) భగవాన్‌దగ్గిరికి ఎప్పుడు వెడదాము? ఇకముందు అరుణాచలం వెళ్ళడానికి తొందర పడేవాణ్ణి నే నౌతాను గావును! కొద్ది నెలలలో నాసంగతి నాకు నిశ్చయ మవుతుంది. (i.e)అంటే నేను నేను కాననిన్నీ నేను ఇంకోటి (self)అనిన్నీ నిశ్చయపడతాను.

ఎట్లా వున్నారు? ఆదుర్దాలా?

మీకు ఉత్సాహం కావాలేమో, ఇద్దామని వ్రాస్తు న్నాను. భగవాన్‌లో, తాను చాలా గొప్ప అనుభవంలో ఉన్నానని, సౌరీస్ వ్రాస్తోంది. అనండి ముందుకు సాగుతున్నానని. అవును నాకు తెలుసు.

Your Own self
V.—

౨౬

నైజాగ్
27-10-37

*My dear self,*

ప్రొద్దున్నే వ్రాస్తున్నాను మీకు. Blessed be D. Is and D. V. K. Sastry's. I am not interested. It is Bhagavan and nothing else.

డిప్టీఇన్‌స్పెక్టర్లనీ, కృష్ణశాస్త్రిలనీ, సుఖంగాబతకమనండి. నాకేం పట్టలేదు. భగవాన్ తప్ప, నా కింకేం అక్కర్లేదు. ప్రతి ఖాళీ నిమిషమూ ఆయనకి ఇస్తున్నాను.

మొన్న బెజవాడలో ఒకటి జరిగింది. మిమ్మల్ని స్టేషన్‌లో వొదిలి, ఇంటికి వెళ్ళాను. ఎవరూ లేవలేదు ఇంకా. మీరు పడుకుని లేచిన బెంచీమీద కూచున్నాను. ధ్యానంలో పడ్డాను. వెన్నెముకలోంచి పెద్ద వొణుకు బయలుదేరింది. వొళ్ళంతా పాకులు Huge spasms of breathing. తరవాత శాంతి.

ఈ లోపల నాకు బదిలీ ఉత్తరువు వొస్తే కొత్తపనిలో చేరేలోపల భగవాన్ దగ్గిరికి వెడతాను. మీరు వొస్తారా?

ఇప్పుడు వెంటనే వెళ్ళాలనిపిస్తోంది. ఆనాటినించీ నేను నా ఆత్మకి చాలా సమీపంగా వున్నాను. ప్రతిదినమూ దగ్గిరిగా వెడుతున్నాను. కాని యీఆత్మ ప్రయాణం మైళ్ళకి మైళ్ళు వెళ్ళాలి. వెళ్ళేది అంగుళాలు. ఎన్నటికి? కానీండి. కాలం అనంతం. ఏనిమిషానైనా బళ్ళోనైనాసరే, ధ్యానంలో పడడం నా స్వాధీనంలో వుంది. కాని విశ్రాంతి లేని యీ ఆత్మకి శాంతి లేదు. ఈ సాధన, నా అలవాట్లతో, వాంఛ లతో, పద్ధతులతో, నిరంతరమైన యుద్ధం చేస్తోంది. నాకు బాధ.

మూడు రోజుల క్రిందట ఒక అద్భుతం జరిగింది. దూరం నించి, ఎన్నిరోజులనించి, నేను ఒక ఆమెని, ఆరాధిస్తు న్నాను. ఆమెస్నేహం నాకు తటస్థిస్తుందని, ఎన్నడూ ఆశ లేదు నాకు. అన్నివిషయాల్లోనూ, అంత ఉన్నతురాలు. కలలోకూడా, నేను, ఆమె నా దౌతుందని అనుకోలేదు. ఆ అమ్మాయి, అకస్మాత్తుగా, సమస్తమూ వొదిలి, నాతో వస్తానన్నది. ఈ సంగతి ఒక్క నెలకింద జరిగివుంటే ఆలో చనే వుండేదికాదు. కుటుంబంనించి, భర్తనించి ఆమెని నేను తీసుకునేవాణ్ణి. కాని ఇప్పుడు నేను భగవాన్ మనిషిని, ఆమె ప్రేమకి ప్రతిఫలం ఏమివ్వగలను? ఇంకా నేను ఆ శృంగారపు కథల కర్తనే అని విశ్వసిస్తోంది. భగవాన్ యుద్ధం, ఇంకా ప్రారంభంకాలేదు నాలో యీ వ్యవహారం విషయమై. కాని మాయిద్దరిమధ్యా ఆమె ఆకారం అడ్డమవుతోంది.

ఏం జరుగుతుంది? ఏం చెయ్యను?

ఇది నాకో పరీక్షా? Then it is too early and too cruel. ఐతే అప్పుడే నన్నింత పరీక్షించడం చాల క్రూరం.

నా జీవితంలో అసంభవమనుకున్న దివ్యమైన కల నిజమైంది. To look at her is to love her. ఆమెని చూస్తే చాలు ప్రేమించకండా ఉండలేను. తలచుకోలేనంత మధుర మూర్తి ఆమె. కాని ఆత్మసాక్షాత్కారం అంతకన్న మధురం. ముసలితనం లేదు – ఆకలిలేదు – ఏడుపులేదు. చివరికి ఆమె కళ్ళల్లో నేనుచూసే, మాధుర్యమూ, ప్రేమా, నా మనసు కల్పించుకుంటున్న వేకద?

కాని ఆమె నాకు కావాలి. I can resist and sacrifice my need of her, but if I become her need and she demands it? ఆమె నాకు అవసరం కావడాన్ని అణచుకోగలను. త్యజించగలను. కాని నేను ఆమెకి అవసరమైతే! ఆమె నన్ను తనకి కావాలంటే! I am in for a great fight with the nearest and the dearest even. నాకు చాలా ప్రియులు, సన్నిహితులైన వారితో, పోట్లాట సంభవించ పోతోంది, ఆమె కోసం.

I say sweet soul, leave not Bhagavan. Suddenly you will make up, no doubt, for all this delay. But even, mean while – self is great, sweet and bright.

ఉద్యోగమూ సారస్వతమూ ఏమీ లేవు. మాటలు, ఆలోచనలు, ధ్యాసలు, ధ్యానం, అన్నీ భగవాన్ పరంగానే.

*(డిప్టీ ఇన్‌స్పెక్టరు పని పరవాలేదని చలాన్ని నమ్మించి ఆ పనిలోకి చలాన్ని పంపారు దీక్షితులుగారు.)*

౭౭

నరకం
10-1-38

*My dear Enemy,*

శుద్ధ యీర్ష్యవల్ల గొప్ప శృంగార కథకుడు చలాన్ని హత్య చేశారని మీ మీదపడ్డ అపవాదు ముందుయుగాలలో వ్యాపించబోతోంది. నాలుగు గజాలయెత్తున వున్న కాయితాల గోకి అడుగునించి మీకు వ్రాస్తున్నాను. ఈ అంకెలు నాచెవుల్లో గింగిరు మంటున్నాయి నన్ను పలకరించేందుకు ప్రయత్నించకండి. లాభంలేదు.

మృత్యువులో
మీ చెలం.

౭౮

పామర్రు బంగళా
17-2-38

*My dear Baba - ba,*

ఈ కొత్త వుద్యోగం జిత్తులన్నీ నేర్చుకుంటున్నాను. I am sick, sick, sick— అసహ్యం - అసహ్యం - శరీరంలో ఆత్మలో జబ్బు. I am damned మార్చి చివరిదాకా ఇటానే వుంటుందంటున్నారు సూర్యనారాయణగారు.

మీ వటీరావు చదివాను, It is ripping. Quit wodehousean

రేపు మాలపిచ్చమ్మగారి దగ్గిరికి వెళుతున్నాను. Jolly, Boy, you are jolly ? మీకథ చదివితేనే తెలుస్తోంది.

మీ రెంత జాలీగా వున్నారో! నేను సందేహాలలో ఖేదంలో చచ్చిపోతున్నాను. మొన్న ఆశ్రమానికి వెళ్లిం తర్వాత ఎట్లావున్నారు మీరు? ఏమన్నారొ త్తమాగ్పలా? చాలాపని, తప్పించుకునే ఉపాయాలు ఆలోచిస్తున్నాను. పోనీలెండి-ఇట్లా పనిలో నిమగ్నుణ్ణాయి, నన్ను నేను మరిచి పోతాను, మేలుకోమని పిలుపు వచ్చించాకా.

మీకు తెలుసుకదా - నన్ను కొన్నాళ్ళు ధ్యానం మానె య్యమని ఆశ్రమంనించి అన్నారని.

౭౯

*My dear Nudist-reformer,*

గుడివాడ
20-3-38

నా పుస్తకంగొప్పగావుందని వ్రాశారా మీరు! నాపుస్త కం గొప్పతనం, నాలోంచి వొచ్చింది. నాలో గొప్పతనం మీరు కలిగించారు.

నాకు భారతి దొరకలేదు. మీకథ షా చదివిందట. చాలాబావుంది అంది. 'వీణ' వాళ్ళు మీ కథని ఎందుకు ప్రచురించలేదు? వాళ్ళకళాభి రుచికి సరిపకలేదా? శివశంకర శాస్త్రిగారి లేఖలు ప్రచురించే రుచికి!

మీవంటి మనుషులుకూడా ఈఉద్యోగంవల్ల ఖేదపడుతో వుంటే, నాకు తృప్తిగావుంటుంది. ఎంత దుర్భరం-అసహ్యాం యీపని! పైనించి D. E. O. కిందనించి ఆఫీసు గుమాస్తా మరింత ఘోరం చేస్తున్నారు. నాకు పారిపోవా లనిపిస్తోంది.

సూర్యనారాయణగారు అరుణాచలం వెడుతున్నారు. Blessed man, he is in peace.

భగవాన్‌గారు యీ అపకారం చేశారు. సుఖం, ఐశ్వర్యం, కీర్తి, ధనం, ఏవన్నీ మనిషికి సంతోషాన్ని, తృప్తినీ, ఇస్తాయో అవి నాకేమీ సంతోషాన్నివ్వకండా చేసి, మనుషుల్ని ఏవి బాధపెట్టవో ఆసందేహాలూ, ఉద్యోగమూ, చీదర్లూ నన్ను నలిపి పిండిపెట్టేట్టు ఏర్పాటుచేశారు ఆయన. మీసంగతీ అంతే. ఎంత అన్యాయం—బుద్ధిలేని యీ బాధవల్ల (senseless suffering) చివరికి ఏమన్నా గమ్యస్థానం వుందా? ఓమార్గం వుందనీ, యీ పరిస్థితులనించి మారితే శాంతి వొస్తుందనీ, నాకే విశ్వాసంవుంటే! కాని విధినించి తప్పించుకోగలమా ఈ ఇన్‌స్పెక్టరుపనినుంచి తప్పించుకో వచ్చు కాని... తరువాత... ...

What a believer in fate I am becoming?

Yours in misery.

౮౦

బెజవాడ
18-4-38

My dear friend,

మీ ఉత్తరం నాకు అరుణాచలంలో అందింది. పాపం, పిచ్చినాయనా, మీరు రాలేక పోయినారు. అనంతాచారి మీరు రాలేదని చాలాఅనుకున్నారు. ఈసారినాయాత్రఅంతా ఖేదావృతమయింది. This time the whole business was miserable భగవాన్ మాత్రం ఒకటేపెద్ద ఆహ్వానం చిరునవ్వులు. ఎవరినో అడుగుతున్నారు నన్ను చూపి

'ఎందుకు అట్లా కదలక ఆమూల కూచుంటాడు ఆయన?' అని. ఆశ్రమమూ, ఇక్కడివాళ్ళూ పరమ అసహ్యంగా వున్నారు. అరుణాచలం వెళ్ళడంవల్ల కించిత్తులాభం కలగ లేదు. Only misery misery all though bad health etc. నేనూ, సౌరీస్, రంగనాయకమ్మగారూ వెళ్ళాము Only Sou fell into intense meditation. She says thoughtless and dreamless.

ఆయన ఉత్తరవు ప్రకారం-భగవాన్ నన్ను కొంతకాలం వూరికే కూచోమంటున్నట్టుంది

ఎట్లా ఉన్నారు?

౨౧

గుడివాడ,

1—6—38

*My dear boy,*

నేను భగవాన్‌ని వొదిలేశాను. నేను తన భక్తుడుగా కావాలని వుంటే ఆ భగవాన్ని నన్ను వెతుక్కుంటూ రమ్మనండి. మొన్న నేను వెళ్ళినప్పుడు ఆయన అడుగుతున్నారు. 'ఎందుకు గంటలకొలది అట్లా నిశ్శబ్దంగా కూచుంటాడు?' అని. వా శ్రైదో అరవంలో జవాబు చెప్పారు.

ఈ లోపల మీ మూల పిచ్చమ్మగారు నాకు స్నేహితులైనారు. She adores Sou త్వరలో షా చాలా గొప్ప జ్ఞాని కాబోతోందని తన శిష్యులలో ప్రచారం చేస్తున్నారు.

ఆమె - ఆ శిష్యులు షో కోసం వస్తున్నారు. షోని వాళ్ళ వ్రాళ్ళకి ఆహ్వానిస్తున్నారు. She gives secret audienees to Souris.

'మహర్షి చాలా పక్వమైనవారికిగాని ఉపయోగించరు' అంటారు ఆమె.

నన్ను చూడగానే ఆమె నా చేతులు పట్టుకుంటారు. ప్రతిసారీ తనకి ఏమన్నా తెచ్చిపెట్టమని అడుగుతారు. పళ్ళూ - గోధుమలూ - యిట్లాంటివి. ప్రతీసారీ నాచేత ఏవోఒకటి తినిపిస్తారు. తనముందే తినమంటారు. కొంచెంసేపు తనపక్కన కూచోపెట్టుకుని, ఇంక వెళ్ళమంటారు. ఓ రోజు నాభూత భవిష్యత్తులు చెప్పారు.

'పూర్వజన్మలో ఇతను చాలాధర్మాత్ముడు. యోగ్యుడు. ఈ జన్మలో చాలా ఉపకారాలు చేస్తున్నాడు. ఆధ్యాత్మిక జీవనం కావాలని తంటాలు పడుతున్నాడు. కాని యీ జన్మకి అది అందుకోలేడు. కాని యీయన కూతురు తరతరాల, వాళ్ళని తరింపచేస్తుంది' అని.

musings తప్ప ఇంకేం వ్రాయటంలేదు. ఆ ప్రతిభ పత్రికని తెలుగు సారస్వత రాచకుంటుంబాలు మాత్రమే స్థాపించి, అచ్చేసి చదువుతారు. దాని కాపీ దొరకదు. అందువల్ల మీగొప్పకథ చదవడానికి వీల్లేక పోయింది.

సరేలెండి, ఒకటి రెండు నా కథలు తర్జుమా చేస్తాను. కాని నాయింగ్లీషు ఛండాలంగా ఉంటుంది. వాన. నాగుర్రం యీ బురదలో కదలనంటోంది. మీ రేంజి చాలా అందంగా

వుంటుంది. కరువు ఎట్లావుంది ? భగవాన్ ఆధ్యాత్మిక సందేశం ఎప్పుడూ నాతోనే వుంటుంది. కాని ధ్యానం మాత్రం, ఆయన అనుగ్రహంమీద ఆధారపడి వుంటుంది అనుకుంటాము నేనూ, సారిస్.

ఆశ్రమాన్నిచూస్తే నాకు చాలా కోపం. వీల్లేదు. నేను వాళ్ళకి మామిడిపళ్ళు పంపను. They are all a set of crude selfish scamps.

ఎప్పటికో మనం కలుసుకోడం ! చాలా miserableగా వున్నాను కాని జీవితానికి ఖేదం అలవా టయింది.

చ లం

గుడివాడ,
10—6—38

*My dear devotee.*

మీ వుత్తరం, నా కీ ఖేదంలో కొంచెం ఆశారేఖను గల్గించింది.

అబ్బా ఎంత 'మిజరీ' నాకు ! కారణం ఏమీలేదు. మృత్యువే శాంతి. జీవితాన్ని ఎంత ప్రేమించేవాణ్ణి ! చావంటే నా కెంత ద్వేషం ఇదివరకు !

నాకు శాంతినిచ్చే మిగిలిన ఒక్కటీ'పుస్తకం' కూడానన్ను వొదిలి పోతోంది. నాచూపు మందగించి, నామనసు ఘోరమైన వేగంతో పనిచేస్తోంది, నాశాంతిని, తనని, నాశనంచేసుకుంటూ. నా ఆశ అంతా భగవాన్ - ఆకాస్త ఆశా పోయింది.

లేదు. నాకథలు తర్జుమా చేయటంలేదు. ఇంగ్లీషు ఏమీ బావుండదు.

ఏదో సంస్కరణ చేయాలనే, నా ఆవేశంవల్ల టీచర్లకీ, మానేజర్లకీ, విరోధి నవుతున్నాను. How ever much I try, I cannot allow "Sleeping dogs to sleep" I try to rouse them and they bark and try to bite.

సమ్మోళ్ళాయన్న నా పుస్తకాలు Complete Works వాల్యూములకింద వేస్తాడట బావుంది!!!

సంపూర్ణ రచనల వాల్యూములు.

సత్కారం.

షష్టిపూర్తి.

చావు

But I feel dead already.

౮౩

గుడివాడ,

16—6—38

*My poor lad.*

It gives me an unholy delight to know you are suffering as I do. మీరు నాకు మల్లేనే బాధపడుతున్నారంటే నాకు ఉపశమనంగా వుంది. రెండురోజుల్నించి కొంచెం వ్యథ తక్కువగా వుంది. భగవాన్కి మామిడిపళ్లు పంపాను గనక నేమో!

This restless suffering, it seems is the path that goads us, on to something higher. So let us suffer with silent souls. ఈ నిలవ నీని బాధ, మనని ఉన్నతపధాలకి తీసుకుపోయ్యేమార్గంట. కనక మౌనంతో బాధపడదాము.

రంగారావు ఆకథని ఇంగ్లీషుచెయ్యడం పూర్తిచెయ్యారు. కాని పోనీండి నాకు పట్టలేదు.

కథలా? ఇంకా నేను కథలు వ్రాయబోతున్నానంటారా? అదంతా ముగిసింది. Musings తప్ప ఏమీ వ్రాయటంలేదు. అదికూడా ఆగిపోయేట్టుంది. కథలు వ్రాసినా Respectable రెస్పెక్టబుల్ భారతికి వ్రాయను.

V-is a good chap. He barks. If he feels you would retaliate, he would keep quite. Smile at him like Bhagavan and disarm him.

I am struggling in Bhagvan's Grace He seems. to have taken my case up for the present.

తెలుగైతేనేం, ఇంగ్లీషైతేనేం, ఏభాషలో ఉత్తరాలు వ్రాసుకుంటేనేం, మనబోటివాళ్ళకి! ఏం తింటేనేం, కట్టుకుంటే నేం, మాట్లాడితేనేం.

మాలపిచ్చమ్మగారు నన్ను రేపు రమ్మన్నారు. వెళ్ళగల ననుకుంటాను. ఆమె ఏమీ పట్టకండా కూచుంటారు నాతో. తటాలున ఒక దయాతరంగం ఆమెలో ఉదయిస్తుందికాబోలు! చిరునవ్వుతో, చాలా ప్రేమగా, నాముఖం చేతులు తాకు

తారు. ఈ ఇంగ్లీషుచదువుకున్న పశువుమీద యీ ముసలా మెకు యీ ప్రేమ ఏమిటా అని ఆశ్చర్యపడి చూస్తారు ఆమె శిష్యులు. She has funds of humour. "నా కీస్థలం అస హ్యాం పుడుతోంది ఓ చక్కని ఉదయం ఎగిరిపోతాను- అట్లా-అట్లా ఎక్కడికో" అని ఎంతో కొంటెగా నవ్వుతారు. మళ్ళీ ఒకప్పుడు ఆశ్రమం అంతా సౌరీస్ ఇస్తానంటారు.

ప్రతి సాయంత్రం సౌరీస్‌కి trance లో పడుతోంది. అదేమీ హానికరం కాదని వ్రాశారు ఆశ్రమంవారు.

నే నింక కథలు వ్రాయను. ఏదో సంస్కరించాలనే కోర్కె పోయింది. ఈ ఉపద్రవానికంతా మీరే కారణం. ముందు తరాలవారు మిమ్మల్ని తిడతారులెండి—వాళ్ళకి ఓకథకుడ్ని యిచ్చినవారూ, ఆ కథకుణ్ణి చంపినవారూ-మీరేనని.

నాకు సత్కారాలు చేస్తామని వ్రాస్తున్నారు. నాకు!!! అంతశవాన్ని, మర్యాదస్థుణ్ణి, అయినానా నేను? ఇంకఎందుకు బతికి! ఏం చెయ్యను? నగ్నమండలి (Nude colony) స్థాపిం చనా? అప్పుడు దాన్ని రుష్యాశ్రమం అంటారేమో?

పిచ్చమ్మగారు నాకు కొన్ని సలహా లిచ్చారు. ఎప్పుడూ "ఓం" అన మన్నారు. ఆమెఫోటోతీసి ఆమె జీవితం వ్రాయా లని వుంది నాకు, Sundy Times కో, కృష్ణాపత్రికకో. ఆమె జరగాలని అనుకుంటే జరుగుతుంది ఆపనీ. అందాకా...

౮౪

గుడివాడ
18—7—38

*My dear Advisor,*

శుభ్రమైన మార్కాపురంలో తిరగడానికే మీరంత కష్టపడుతూంటే, యీ Crooked rascals మధ్య యీ బురదఊళ్ళల్లో నాగతి తలుచుకోండి. మనందరికి ఒక ఆశ్రమం ఏర్పాటు చేయాలని కలలుగంటోంది, సౌకీస్. దానికి 'Mood ఆశ్రమం'అని పేరు పెట్టారు సూర్యనారాయణగారు.

ఈ ఆంధ్రులు, ముఖ్యము గుడివాడ తాలూకావారు - ఎంత ద్వేషం నాకు వాళ్ళని చూస్తే ! నా Musings లో వాళ్ళని చెండాడదలచుకున్నాను. 'వీణ' (పత్రిక) కిందబడి పగిలిపోయినట్టుంది.

వానవల్ల పిచ్చమ్మగారి దగ్గరికి వెళ్ళలేకపోయాను. Man of little faith and enterprise, I love that old girl. నాపాడుపని నాధ్యానాని కడ్డంవొస్తోంది. ఆనంద కిరణాలు దూరంగా కొంచెంకనిపిస్తున్నాయి. అంతా యింకా ప్రయత్నం. కాని వెడుతున్నాను—ఎక్కడికి ? ఆప్రశ్న వెయ్యకుండా ఉండడమే ఉత్తమం. ఎందుకంటే - అంతా సందేహం.

నా మనస్సుకి వ్రాయాలనిపించినప్పుడల్లా ధ్యానం వొస్తోంది. కనక వ్రాత అసంభవమైంది.

రాజు

బెజవాడ
24-7-38

*My dear Snappy,*

నాపైని భగవాన్ అనుగ్రహం బలమవుతోంది. ఈ సంపూర్ణానుగ్రహం ఇట్లా సాగితే, ఎక్కడో అంతం - భయమేస్తోంది. ఈ సౌఖ్యాలు వొదులుకోడం ఇష్టంలేదు నాకు. షౌ కూడా చాలా అభివృద్ధి పొందుతూంది. పిచ్చమ్మ గారు నిన్న చాలా చక్కని సంగతులు మాట్లాడారు. మిమ్మల్ని జ్ఞాపకంచేశాను ఆమెకి. కాని మిమ్మల్ని మరిచిపోయినారు. ఆమె అంటారు, 'నీకు అయిదు గురు కాదు, ఆరుగురు పిల్లలు. నేనొకదాన్ని. నువ్వు మా ఆరుగురికోసం ఇట్లా కష్టపడి సంపాయించాలి.' అని ఒకటే నవ్వుతారు. నాచేతులుపట్టుకుని ధ్యానంలో పడిపోతారు. నావొళ్ళంతా తాకుతారు, దూడని ఆవు తాకినట్టు. బస్సులో నేను ఆశ్రమంముందు వెడుతూవుంటే పరిగెత్తుకుంటూ వొచ్చి, తన శిష్యుణ్ణి తనకి చూపమని వాళ్ళని అడుగుతారు. నన్నూ షౌని ఆశ్రమంలో వుండిపొమ్మంటున్నారు.

మీరూ నేనూ సంచులు బుజాలవేసుకుని అట్లా వెళ్ళి పోదామా?

ఈ కొత్త అనుగ్రహంవల్ల నేను చేసేపనికూడా భారంగా లేదు. కాని పని ధ్యానానికి అడ్డువొస్తోవుంటుంది. మీరు చెప్పినసంగతి నాకు అనుభవం అవుతోంది. భగవాన్ మన

చేతికి పెద్దకాగడాలు యిచ్చారు. అది మనలో యుగాల్నించి పేరుకున్న చెత్తనంతా క్రమంగా తగలపెడుతోంది.

౮౬

గుడివాడ,
26-9-38

*My dear duckie,*

నేను ఆశ్రమానికి పళ్ళు పంపలేదు. భగవాన్ డిప్యూటీ (దీక్షితులుగారు) నించి ఆజ్ఞకోసం చూస్తున్నాను. 'భానుమతి'ని 'బ్రాడ్‌కాస్టు' చేశారు. అదో కథ!

కాశీలో ఏదో సంస్కృత పరిషత్తువాళ్ళు నాకు 'సాహిత్య మనీషి' అని బిరుదు ఇచ్చామని వ్రాశారు.

సౌరీస్ మీ appreciation కి చాలా సంతోషించింది. ఇప్పుడు ఒక చిన్న నావెల్ వ్రాస్తోంది.

నాకా బిరుదు నిచ్చినవాళ్లు 'సంస్కృత విద్యాలయా మందిర్' వాళ్ళు. మా హిందీ టీచర్ ఉత్తరహిందూస్థానంలో చాలాయేళ్లున్నారు, అక్కడి సారస్వతం చదువుతో. ఆ 'మందిర్' చాలా గొప్ప సంస్థ అనిన్నీ, సారస్వతంలోనూ, ఉద్దేశ్యాలలోనూ, తిరుగుబాటుని ప్రోత్సహిస్తుందనీ చెప్పారు. ఏమైతేనేం నాకా బిరుదు అక్కర్లేదని వ్రాశాను. పైగా డిప్లమాకి రెండురూపాయలు పంపాలిట.

నేను శరశ్చంద్రనా? ఎవరన్నారామాట! వినండి. మొన్న ఒక బెంగాలీ స్నేహితుడితో సారస్వతం మాట్లాడుతున్నాను. 'నన్ను ఆంధ్ర శరశ్చంద్ర అంటారు కొందరు'

అన్నాను. చాలా జాలిగా చిరునవ్వునవ్వాడు, 'ఏమిటి ఆంధ్రుడు...మా శరశ్చంద్రా! ఏమివిపరీతం!!' అన్నట్టు. 'శరశ్చంద్రకి సాటెవరు, బంకించంద్ర తప్ప!' అన్నాడు. సారస్వతంతోటి సంబంధములేని మెడికల్ ఏజంటు అతను. తమ రచయితల్ని కొట్టి పోసుకుంటూను తెలుగువాళ్ళు. su-ccess సక్సెస్ అనే బద్దతో కొలుస్తారు.

ఫిల్ముకి ఓ పాడుకథ వ్రాశాను గనక, మనుషులు 'ఈ మనిషిలోకూడా ఏవో కొంత ప్రయోజకత్వం, వున్నట్లుంది.' అనుకుంటున్నారు ఈనాడు.

మాలపిల్ల విడుదలయింది. ఇంతవరకు చూశే శ్రద్ధలేక పోయింది నాకు. చాలాజనం వెడుతున్నారట. చూడ్డానికి గుంపులు, గుంపులు—అంత ప్రజారంజకంగావుంటే, వృత్త తక్కువ చిత్రం అయివుండాలి అది.

సీతలు, సావిత్రిలూనా! మీరేం వ్రాసినా నేను కోపగించుకోను. ఇతరులతో సంబంధంలో తమ స్వంత అహాన్ని స్వార్థాన్ని అడ్డం రానీని చాలా కొద్దిమందిలో మీరొకరు. అందులో నే నంటే, మీలో గట్టిగా పాతుకున్న సెంటిమెంట్లనికూడా మీకూ నాకు అడ్డు రానీకుండా చూస్తారు, మీరు.

ప్రతిభ కాపీపంపారు. కాల్చే జవాబు వ్రాశాను. అతని Polished Mannersమనని మోసపుచ్చేటంత శుద్ధ బంగారం కాదు. జానకిరాం, సి. ఆర్. రెడ్డిగారికి నా పుస్తకాలు ప్రైవేటుగా ఇష్టం ఇప్పటికి కూడా. నన్ను వెలెయ్యడం

ఆయన Pubblic Policy గావును. లోకంలో బాగుపడే మనుషుల మార్గాలే అంత.

౮౭

బె జ వా డ
2-10-38

*My dear baba white-Sheep,*

నాకీపని అసహ్యంగా వుంది. చాలాకాలం శెలవపెట్టి-వ్రాయడమో-ఏదో చెయ్యాలని వుంది.

ప్రస్తుతం నా ప్రయత్నమంతా, పతివ్రతలకన్న - అంటే వుత్త శరీర నిర్మలత్వమే ప్రధానమైనవారి కన్న - తీవ్రంగా పాపాలుచేసే మనిషి ఈశ్వరుడికి సన్నిహితమని నిరూపించడం... ...

ఇంతకన్నా యింకాగట్టిగా వ్రాద్దును నాకథలలో, కాని యీ ఆధ్యాత్మిక దేశంలో మతమూ-వేదాంతమూ-సంగపరిత్యాగమూ- ఎంతో చవక అయిపోయినాయి. అన్నీ వొదిలి పారిపోవడం- బలహీనులు, అపజయులు (The defeated) జీవితం లోనూ సారస్వతంలోనూ- అవలంబించే మార్గమూ ఐనాయి.

కథని ఎట్లా ముగించాలో తెలియకపోతే, ఆ కథానాయకుణ్ణో, నాయకినో, ఓ ఆశ్రమానికిపంపి, దేశభక్తి కీర్తనలు పాడిస్తే సరిపోతుంది. Dirty Sentimentalism!

తెలుగు దేశానికి మాలపిల్లమీాద పిచ్చిపట్టింది. ఒకటే తగాదాలు, విమర్శలూ. అదేదో వెళ్ళి చూద్దామనివుంది ఆ చిత్రాన్ని. ఇవాళ వెళ్ళాలని. కాని చాలా సందేహం.

సారీస్ చాలా మంచి పెద్దకథ వ్రాసింది. అందులోకొన్ని భాగాలు ముఖ్యంగా కష్టాలలోవున్న స్త్రీ అనంతత్వాన్ని గురించిన వర్ణన, చాలా గొప్పగావుంది. అంత గొప్పగా ఎన్నటికైనకూడా నేను వ్రాయలేననిపిస్తోంది. నేను ఓ పెద్దకథ వ్రాశాను యిప్పుడు—డజన్ మంది మొగాళ్ళని ముక్కుకి తాడేసి లాగుతున్న స్త్రీ, ఒకరాత్రి చప్పున అన్నీ వొదిలి తప్పించుకుంటుంది. ఆమె అరుణాచలం వెళ్ళిందని వ్రాయడం గాని సూచించడంగాని చెయ్యనా? మీ అనుజ్ఞ కావాలి.

'దీక్షితులుగారు అట్లాంటి ఆమెనే అరుణాచలం ఆశ్రమంలో చూశామని చెప్పారు. ఆమేనేమో!'

అట్లా ఆఖరు చేద్దామనుకున్నాను కథని.

చాలా త్వరలో నేను, షా మా ఉద్రుత కవిత్వ చాతుర్యంతో అనంతత్వంలోకి అందుకునే పాపం, బాధా, స్ట్రగుల్ కనపర్చే కథలతో ఆంధ్రదేశాన్ని నింపబోతున్నాము.

మీ సీతమీద కొత్తవి కొన్నిరంగాలు వ్రాయాలనుకుంటున్నాను. ఈసారి ఆమెకి ఏమీ కష్టం కలగ చెయ్యను. మీకు బావుంటుందనుకుంటాను. యీసారి నేను వ్రాసేది.

మీపూజసంగతి – ఏం ? దంధ్యం వేసుకుని నేను వొచ్చేవాణ్ని – ఒకటే అభ్యంతరం – ప్రజల్ని మోసగిస్తున్నానేమోనని. మొదటినించీ దంధ్యం వేసుకోడానికి నా అభ్యంతరం అదే. దంధ్యం వేసుకోడంవల్ల కొన్ని ఉపయోగాలున్నాయి. (advantages) కాని దంధ్యం ఆధిక్యంలో నాకు నమ్మకం లేదు. అది మెళ్ళో వేసుకుని లేని ఆధిక్యాన్ని

నటించలేను. ఈ అభ్యంతరం నాకు దంభ్యంమీాది భక్తి వల్ల నే నేమో ! మనుష్యహృదయపు నిగూఢమైన లోతులు ఎవరికి అర్ధమాతాయి !

భగవాన్ చాలా చాలా దూరమైనారు నాకు.

మద్రాసులో అరవ బుడబుక్కల అతను పద్మావతిని కలుసుకుని, 'ఇంకా ఆలిస్యం చేస్తావేం ? అరుణాచలంలో వున్న మహర్షిగారి దగ్గిరికి వెళ్ళవేం?' అన్నాట్ట. డిశంబరులో మనతో వొస్తానంటున్నారు ఆమె.

౭౭

బెజవాడ
22_10_38

*My dear counseller.*

Yes Ethil Manin is G. V. of 1937, the fiery rationalist. I go the whole length with her- only a bit biyond.

నేను మాలపిల్లని చూశాను చివరికి.!

It has some very striking good points and some nearly bad. It is a picture for the masses, and for propaganda, and artistically poor.

అవును. చాలామార్చారు నాకథని - కాని చేసిన మార్పులు ఏమీా అంత అసందర్భంగా లేవు. నన్ను చాలా విమర్శిస్తున్నారుట ముఖ్యం మీా చెరుకువాడ నరిసింహంగారూ కృష్ణాపత్రికా. ఆ చిత్రంలో బ్రాహ్మల్ని తిట్టేది చంం కాదనీ ఈనాటి పంచముడనీ తెలుసుకోరువాళ్ళు.

yes my superior isan unbearable.

నేను అతనికిచ్చిన క్రికెట్ మొంబుతో మాడి పోతున్నాడు. ఏం జరగబోతుందో తెలీదు. శలవపెట్టాల్సి వొస్తుందను కుంటున్నాను. నన్ను అణగ తొక్కుతానని బెదిరిస్తున్నాట్ట ......... చూస్తాడు 'నేనెవరు? ఎందుకు తగాదా! ఏమైనా చివరికి అతను నాశించి వేరా' ఇట్లాంటి ఆలోచనలే అడ్డు రాకపోతే, వ్యధతో గిల గిల తన్నుకునేట్టు చేద్దును అతన్ని. బ్రాహ్మలంటే ఎంత ద్వేషం ఆయనికి! వీళ్ళూ మన అధి కారులు – మనం! వాళ్ళకింద పనిచేసే వాళ్ళం.

రావు

బెజవాడ
25-1-39

*My dear Sadmore,*

అర్థంలేని వ్యధబోలెడు అనుభవిస్తున్నాను. దిన దినమూ ఎక్కువగా అడ్డమవుతోంది–యీ వ్యధ. అంతా అందని తెలీని కారణాలు. మనసుమీద పనిచేసి కలిగిస్తున్నామని మీకు వొచ్చిన కల మిమ్మన్ని ఆనందంలో నింపెయ్యలేదా!

నాకూ ఒక విశేషం జరిగింది. నిన్న పిచ్చెమ్మగారు మేలుకువుండే రోజనుకుని (ఆమె రెండురోజులు సమాధిలో, ఒకరోజు మేలుకునీ వుంటారు) ఆమె ఆశ్రమానికి వెళ్ళాను. మేలుకునే రోజు కాదు. ఆశ్రమంలో ఒకరూ లేరు. ఎవరో ఒక అమ్మాయి కనపడి పిచ్చెమ్మగారు సమాధిలో పడుకునే గది చూపి నన్ను లోపలికి వెళ్ళమంది. ఆమె ఆగదిలో

మేలుకుని వున్నారనుకుని వెళ్ళాను. ఆమె సమాధిలో పడు కుని వున్నారు. నేను వెళ్ళగానే ఆమె కళ్ళు కష్టంమీద కొంచెంగా తెరిచి, చేతులు నావేపు జాచారు. నన్ను ఆమె తన నడుంమధ్య వొంపులో కూచోపెట్టుకుని, ఒక చేతిని నా వీపుమీదవేసి, రెండో చేతితో నాగుండె కోసం వెతికారు. కాని డబ్బా, నాకళ్ళ అద్దాలూ వున్న నా జేబు అడ్డ మయింది. ఆ ప్రయత్నంమాని, ఇంతలో మళ్ళీ సమాధిలో పడ్డారు. నా కాళ్ళనించి పైకి విద్యుల్లతలు పాకడం ప్రారం భించాయి. రక్తమంతా తలలో చేరినట్టయింది. చెవులలో పెద్దహోరు - అయిదునిమిషాలలో వెళ్ళిపోవాలనుకున్న నేను - అట్టా గంట కూచున్నాను.

నేను వెళ్ళడానికి లేచినప్పుడు, ఆమెకళ్ళు తెరిచి, నాకళ్ళ మధ్యచూపి, అక్కడ కాంతి కనపడ్డదా అని అడిగారు; సౌంజ్ఞలతోనే. లేదన్నాను. ఆమెనిట్టూర్పు విడిచి 'ఎందుకో! ఎవరికి తెలుసు?' అన్నారు సౌజ్ఞలతోనే. ఆమెకళ్ళలో నామీద చాలా జాలి కనపడ్డది.

మళ్ళీ కొంతసేపు కూర్చోపెట్టి, వెళ్ళమన్నారు. ఎవరూ అటు రాలేదు, అంతసేపూ. అక్కడి బడి విజిట్‌కి వెళ్ళాను. వేళ్ళమధ్య కలం నిలవలేదు. వొళ్ళంతా వొణుకుతోంది. సాయంత్రం ఇంటిదగ్గిర అందరూ నాలో మార్పు గమ నించారు. మొహం ఎర్రనై అందంగా ఎంతో శాంతంగా సంతోషంగా కనపడ్డదట. నామట్టుకు, నాహృదయం అందరి యెడలా ఏదోగొప్ప ప్రేమతో పొంగిపోవడం గమనించాను.

ఈవాళ పొద్దున్న తలనొప్పితో లేచాను.

ఆమె అన్నారు ఒకసారి, 'నువ్వు గుడివాడనుంచి వెళ్ళిపోతావు. నన్ను వొచ్చిచూడవు' అని. 'నేను తప్పకవచ్చి చూస్తాను. ఎక్కడ వున్నాసరే' అన్నాను. 'రావులే' అన్నారు. నన్ను చాలా దూరం పంపేస్తారు అన్నారు. (ఇది అంతా నిజమైంది తరవాత)

తా నింక నాలుగు సంవత్సరాలె బతుకుతారట.

ఈ అనుభంవల్ల నాకు ఎంత లాభం కలిగినా, కలుగక పోయినా, ఇప్పుడు నిశ్చయంగా జరిగిన విషయం ఒకటి నా అనుభవంలోకి వొచ్చింది. ఇతరులు ఈ ఆధ్యాత్మికమంతా ఉత్త మోసమన్నప్పుడు, ఔన్నత్యాన్ని పొందిన మనుషులు, ఇతరులలో ఎట్లాంటి అద్భుతమైన మార్పు తీసుకురాగలరో స్వంతంగా అనుభవంమీద మాట్లాడగలను. కాని ఎవరికి కావాలి? ఎవరు అన్వేషిస్తారు? అక్కరికివచ్చే శ్లేషనలిష్టు మూఢనమ్మకాల్లోకి లొంగిపోయినా డనుకుంటాను.

మళ్ళీ ఆమె అనుగ్రహం నాపైకి ఎప్పుడు ప్రసరిస్తుందో? ఇట్లానే రెండుమూడుసార్లు నాలో శక్తిని విజృంభింపజేస్తే ఇం కేంకావాలి? కాని నేను ఆమెని అడగతలచుకోలేదు.

నా అధికార్లు నన్ను బాధిస్తున్నారని కూడా చెప్పలేను ఆమెతో. ఆమె మనస్సులో వాళ్ళకి కీడుతలుస్తారేమో ననే భయంతో.

కాని అతను ... అతనికి అంతరాత్మ, feeling ఏమీ లేవు. వృత్త గర్వం, డాబు, ఈర్ష్య ... పోసీలెండి నా కేంపట్టింది. కాని

రా...కూడా ప్రేమించ గలిగినంత గొప్పలోకి నేను పెరగ గలిగితే!

ఆమె ప్రేమని పొందడానికి నాకేం అర్హతవుందా అని ఆశ్చర్యపడుతో కూచుంటాను. ఆమెని తలుచుకున్నంత మాత్రాని; నాహృదయం కృతజ్ఞతతో నిండిపోతుంది.

ఏలూరు
26-7-59

My dear doctor,

నరసింహంగారు నాకు నచ్చారు. నచ్చక ఏంచేస్తారు. మీమీద అంతమంచి అభిప్రాయం వున్నవారు?

మీకు తెలుసు గడిచిన ఆరు సంవత్సరాలు నేనుకారణం లేని విపరీతమైన బాధలో బతికానని, ప్రస్తుతం మెల్లిగా మార్పు జరుగుతోంది. పాతసంతోషం, ప్రకృతిలో స్త్రీలో సౌందర్యం చూడగలుగుతున్నాను. సౌరీస్నూ, డాక్టరుగారూ నా రూపమే మారిందంటున్నారు. జీవితంలో కొత్త అనురక్తి తోస్తోంది.

భగవాన్‌లో ఆశ్రయం తీసుకునే మనోస్థితిపోయింది. ఎంత ప్రయత్నించినా రావటంలేదు. జ్యోతిష్కులు ఇంక నేను మళ్ళీ లోకంలో పడిపోతానంటున్నారు.

వీలైనంతత్వరలో అరుణాచలం వెళ్ళాలి మీరువొస్తారా?

కానీండి. ఎట్లాజరగాలో అట్లా జరగనీండి.

మీ జాతకచక్రంచూసి జ్యోతిష్కుడు ఎంతపొగిడాడని మిమ్మల్ని? మీరెవరో తెలీకండానే! పాలంత తెల్లగా నిష్కలంకంగా, అంత మధురంగా వుంటారన్నాడు. నిజం కాదా మరి! ఇంక మీకు సంసారవిషయమైన చిక్కులు రాబోతున్నాయి. మీ ఆరోగ్యంకూడా బావుండదట. ఈ

చిక్కులు మిమ్మల్ని తయారుచేస్తాయి, సన్యాసానికి. తప్పకుండా మీజీవితంలో కాంతిని చూస్తారుట.

సారిక్ గొప్పనాటకమూ, కథలూ వ్రాసింది.

౭౧

ఏలూరు
౬-8-39

My Dear good fellow,

భగవాన్‌తో సంబంధం తెగిపోయింది. ఆయన్ని మళ్ళీ చూసేవరకు ఇట్లా కాలాన్ని పోకనిస్తున్నాను.

ఆ జోస్యాన్ని మీరు సందేహించకండి. మీకూ సారిక్‌కీ నాలుగేళ్ళలో ఆత్మసాక్షాత్కారం రాబోతోంది. మీకు ఇంకా కొంచెం ఆలస్యమేమో.

సిగరెట్ల ఖరీదు హెచ్చింది. నశ్యంఖరీదుకూడానా? మీరు పంపే మాత్రలతో వొంటికి ఆరోగ్యమే కాదు, మనసుకి ఉత్సాహాన్నికూడా పంపేట్టున్నారు. You are destined to guid me over this rough world- A big responsibility.

నిన్న ఆశ్రమానికి అరటిపళ్ళుపంపాను,— a freak, an impulse, reasonless, stupid.

ఈ మెదడు గడ్డకట్టింది. పనిచెయ్యడం మానింది. వ్రాయాలంటే ఏమీతోచదు. చివరికి మీకు ఉత్తరం వ్రాయాలన్నాకూడా.

Dull usual routine.

Bhagavan surely takes care of us-to us often his care means additional pain and pang. భగవాన్ మన జాగ్రత్త తీసుకుంటున్నారు. నిశ్చయంగా. కాని ఆయన వీక్షణమంటే మనకి బాధా, ఖేదమూ చాలాసార్లు. భగవానునించి దూరమౌతున్నాను. కాని ఆయన్ని మళ్ళీ తెచ్చుకుంటానంటోంది జాతకం.

౯౨

బెజవాడ
11-9-39

My dear Deekshitar,

రేడియోలో మిమ్మల్ని విన్నాను. ఆ పాత జ్ఞాపకాల స్మరణ వింటే నాగుండె కొట్టుకుంది.

అరుణాచలం వెళ్ళడమంటె ఇన్నిరోజులూ చాలా బద్ధకం వేసింది. అతాత్తుగా భగవాన్ నాపైని అనుగ్రహం కురిపించారు. వెళ్ళాలని ఒకటే ఆతురతగావుంది.

అబ్బా! సారస్వతం కోసం వ్రాయడమేమిటి? పోనిద్దురూ నేనూ మానేశాను.

అరుణాచలం నించి కొత్త జీవంతో తిరిగివస్తానని ఆశ. ప్రసాదం పంపుతాను అక్కణ్ణుంచి.

మునిమాణిక్యంగారికి జవాబు వ్రాయకండి. మనిద్దర్నీ చూస్తే ఆయనకి ఈర్ష్య. మన రచనల్ని (Scandalise) దూషిస్తున్నారు. ఆయన మీవిషయమై వ్రాసింది Very poor silly stuff అని అందరూ అంటున్నారు. మీరు

జవాబు వ్రాస్తే తను (Condescend) చేసి మీామీాద దయ తలచి వ్రాసిందానికి మీారు చాలా కృతజ్ఞత చూపుతున్నారని బడాయిలు కొట్టుకుంటాడు.

*(మునిమాణిక్యం నరసింహారావుగారు కృష్ణాపత్రికలో దీక్షితులుగార్ని గురించి వ్యాసం వ్రాశారట. దాంట్లో సంగతులు అబద్ధమని ఎవరో విమర్శించారట. దీక్షితులుగారూ. ఒక్కవిషయంలో తప్ప ఆ వ్యాసమంతా అబద్ధమేనన్నారు. మొత్తానికి misrepresented. పైగా తానువ్రాసింది నిజమో కాదో వ్రాయమని నరసింహారావుగారు దీక్షితులుగారికి వ్రాశారు. దీక్షితులుగారు చలం సలహా అడిగారు.)*

౯౩

మ ద్రా సు
22—9—39

My dear child,

అరుణాచలంనించి వచ్చాము. అక్కడికి మాావెంట పద్మావతిగారుకూడా వొచ్చారు. భగవాన్ ఒక చిరునవ్వుతో ఆమెని పట్టేశారు. మెక్కైవర్ బంగళాలో మంచి బస దొరికింది మాాకు.

ఆశ్రమంలో కొన్ని కొత్త నిబంధనలు బైలుదేరాయి. పాతవాటిని ఇంకా కఠినంచేశారు. భగవాన్ కొండల్లోకి వెళ్ళిపోతారనుకుంటున్నారు కొందరు. మేము వొచ్చేసేప్పుడు భగవాన్‌తో నేను,

'దీక్షితులుగారు మీకు తెలుసుకదా' అని అడిగాను.

'ఏ దీక్షితులుగారు?'

'చింతాదీక్షితులుగారు'

'ఓ తెలుసు. ఏమి?'

'ఆయన రాలేకపోయినారు. నేను వొస్తున్నానంటే మీ ప్రసాదం తీసుకురమ్మన్నారు'

'మంచిది. మంచిది' గొప్పచిరునవ్వుతో.

ఈ సారి భగవాన్‌ని ఆయనకోసమే ఆయన్ని ప్రేమించడం నేర్చుకున్నాను. ఆశ్రమంవాళ్ళుకూడా ఎక్కువ మర్యాదచూపారు మాపట్ల.

అరుణాచలం సాయింత్రం ఆరింటికి చేరుకున్నాము. ఇదివరకు మనం బసచేసిన బంగాళాలో సామానులు పెట్టి,

భగవాన్‌ని చూడ్డానికి వెళ్ళాము. భగవాన్ సౌరిస్ వంకేచూశారు. తనలోంచి thrill పరిగెత్తిందని చెప్పారు పద్మావతీగారు. వేదపఠన జరుగుతోంది. నిరంజనానంద స్వామిగారిని ఆశ్రమంలో భోజనం చెయ్యడాని కనుజ్ఞ అడిగాను. ఆయన ఇదివరకుకన్న స్నేహంగావున్నారు. హాల్లో కూర్చున్నంతసేపట్లో ఆడవాళ్ళు వెళ్ళిపోవాలని ఒకటేగోల-ఒకటే డిస్టర్బు చేశారు మమ్మల్ని. తిరిగి బసకు వెళ్ళేటప్పటికి, పక్కన బంగళాలో యూరోపియన్ ఆమె మేము అక్కడ వుండకూడదని తగాదా ప్రారంభించింది. మేము కదలం అన్నాను. చివరకి పక్కబంగళాలో బస దొరుకుతుందంటే వొప్పుకున్నాను. అక్కడ చాలాబావుంది. మంచాలు-

కుర్చీలుతోసహా. భగవాన్‌ని కృతజ్ఞతతో స్తుతిస్తో నిద్ర పోయినాము.

మర్నాడు పొద్దున్న మబ్బులు. తెల్లారకట్టే వేదపఠనం సమయానికి వెళ్ళి చాలా ఉత్సాహంగా వొచ్చాము.

భారతివాళ్ళు సౌరిస్ లేఖని ప్రచురిస్తామన్నారు. అవును శివశంకరశాస్త్రిగారు ఈమధ్య నన్ను గురించి మంచి మాట్లాడుతున్నారట. తన ప్రతిష్టకోసమన్నా ఆ పని తప్పనిసరి అయింది గావును. ప్రతిభలో తుక్కు విమర్శ వ్రాసింది మొ—టి.

మీ రిచనల్ని గురించి whimsical (శ్రీశ్రీ.)అనడం మెచ్చుకోటమే. Wodehouse అప్పుడప్పుడు Whimsical గా వుంటారు. మీరు చాలాసార్లు- ఎంతో Whimsical గానేకాదు, Child like గా వుంటారు.

అరుణాచలం సంగతి-మర్నాడు తెల్లారకట్ట హాలు లోకి సాయంత్రం, నన్ను, పద్మావతీగారినీ, షా, కొండలకీ న్న తిప్పింది. వేదం సమయానికి తిరిగివొచ్చాము, హాలులోకి.

తాను అరుణాచలంలో వుండిపోవడానికి ఏర్పాట్లని గురించి మాట్లాడుతోంది సౌరిస్. ఇప్పుడు. ఈ వూరినించి కూడా ఎప్పుడు అరుణాచలం వెళ్ళిపోతానా అని ఆలోచి స్తోంది. డిశంబరులో వెళ్ళినప్పుడు అక్కడే వుండిపోతుందిట. ఆశ్రమం మనుషులకి. ముఖ్యం ఆడవాళ్ళకి. షౌనిచూస్తే చాలా ప్రేమ. మళ్ళీ ఎప్పుడూ వాళ్ళతో మాట్లాడదు. షౌపక్కనించి వెళ్ళినప్పుడల్లా భగవాన్ వెనక్కితిరిగిచూసి గొప్ప చిరునవ్వు నవ్వుతారు.

౯౪

బెజవాడ
2-10-39.

My Dear H. M.

విరామంగా వుంది. కాలమంతా భగవాన్ ముట్టడికి వినియోగిస్తున్నాను. కాని ఆయన లన్డన్ టవర్ కన్నగట్టి. గవర్నరుగారు వొస్తున్నారని వూరంతా శుభ్రం చేస్తున్నారు, మన గవర్నరుగారు ఎప్పుడు వస్తారు? ఇంకా పట్టణం కావలసినంత శుభ్రం కాలేదేమో? కాని అశుభ్రం కూడా ఆయనేవొచ్చి చేసుకోవాలి. మనవూరు శుభ్రం చెయ్యడానికి ఆయన పంపిన దూత గావును యీ అశాంతి.

అయిదేళ్ళ కిందట ఆశ్రమంలో కొన్నాళ్ళు వున్నఆయన వున్నారిక్కడ. మళ్ళీ ఆ ఆశ్రమానికి వెళ్ళాలంటే డబ్బు లేదుట ఆయనకి. ఆయన యీ కబుర్లు చెప్పారు.

'ఈ సర్వాధికారి అన్నా పోవాలి నేనన్నా పోవాలి యీ ఆశ్రమంనుంచి' అన్నారుట భగవాన్ ఒకసారి.

ఓసారి సర్వాధికారిని కర్రపెట్టి కొట్టారుట భగవాన్.

ఈ స్నేహితుడు భగవాన్ని,

'మీరు దేవుణ్ణి చూశారా?' అని అడిగారుట.

'ఆ చూశాను.'

'ఎట్లా వుంటాడు'

Bhagvan sits serious and wistful.

'ఎట్లా చెప్పకలను? చూడు ప్రతి సంవత్సరం అరుణాచ శ్వరుడికి ఉత్సవం జరుగుతుంది. అతివైభవంగా వుంటుం

నేను చూడ్డానికి వెళ్ళేవాణ్ణి. నాది చైతన్యుడిమల్లే మధుర భావంకాదు-అద్వైతం. ఆ అరుణాచలేశ్వరుడే నేను. కాని ఆ వైభవంచూస్తే నావొళ్ళు గగురుపొడిచేది. కళ్ళంబడి నీళ్ళు వొచ్చేవి.' అంటో భగవాన్ నిశ్శబ్దంలోకి వెళ్ళారట.

ఎట్లావున్నారు, మీారు?

నాకు అరుణాచలం వెళ్ళాలనేకోర్కె తీవ్రంగా వుంది. వీలుచేసుకోగలననుకుంటాను. సారిస్ లేఖ ఎట్లావుంది? ఆధ్యాత్మికంగా అభివృద్ధికనబడుతోంది నాలో. 'ఇప్పుడు నేను భగవాన్ భక్తుణ్ణి' అని అనడానికి సంశయించను. భగవానిచ్చే అమృతంవల్ల తప్ప-ఇంక ఏవిధంగాను నాకు పిచ్చెక్క లేదని నాగర్వం కూడా.

చలం

ఏలూరు
27-11-39

My dear Joy,

సారీస్ 'లేఖ' మీాకు బాగున్నందుకు ఎంతో సంతోషంగావుంది. వాగ్దానం చేసినట్లు ఆలేఖ కాపీలు పంపలేదు, భారతివాళ్ళు. These Editors !

భగవాన్ 'లాకెట్లు' నాకు అక్కర్లేదు. అవి మీాకూ అక్కర్లేదు. I am feeling I have locked him in my heart !

సారీస్నూ, ఆమెతల్లీ, అరుణాచలంలో స్థిరపడే ప్రయత్నం చేస్తున్నారు.

మనకి ప్రమోషన్లు ఇంకోచోట పడుతున్నాయి. 'బార్' దాటడమా ? భగవాన్ అనుగ్రహంతో శీఘ్రంలో నేదాటు

తాము. భగవాన్ ఆత్మమార్గంలో చాలాసహాయం చేస్తు న్నారు. ఆయనమీద ప్రేమకూడా ఉదయిస్తోంది నాలో. కనక నాకూ 'హోప్' వుందన్నమాట.

చాలా వుపద్రవం సంభవించింది. నన్ను Text book committee మెంబరుగా. 'కో ఆప్టు' చేసుకొన్నామని వ్రాశారు. ఎంత దుర్గతిలోకి పతితుణ్ణి అయినానో? ఆ గౌరవాన్ని నిరాకరించాను.

మన మిత్రులు, భూషణ్, మునిమాణిక్యం, శ్రీ శ్రీ త్రివేణిలో తమని పేర్కొనలేదని ఎవరిద్వారానో, Protest చేసి నన్ను తిట్టించారు. శ్రీశ్రీ మంచి ప్రత్యుత్తరంఇచ్చారు. రేడియోలో మునిమాణిక్యంగారితో కలిపి మిమ్మన్ని పొగిడారు ఎవరో.

అరుణాచలం వెళ్ళడంలేదు. డబ్బులేదు. మీరు వెడుతున్నారా? మా హెడ్మాస్టరుగారుకూడా వొస్తారట. you will have nice company.

ౘ

బెజవాడ
21-1-40

My dear dove,

హైద్రాబాదు వెళ్లాను. దోవలో రైల్లో ధ్యానంలో పడ్డాను. ఇంగ్లీషులో స్పష్టంగా. 'When you win a calender, send it to the Ashram' 'కాలెండరు దొరికినప్పుడు, ఆశ్రమానికి పంపు' అని వినపడ్డది. అర్థంకాలేదు.

అయినా హైదరాబాదులో కాలెండరు కొనాలని ప్రయత్నించాను; తిరిగివొచ్చి యీ వూళ్లో, తరవాత ఏలూరులో ప్రయత్నించాను. దొరకలేదు. సౌరీస్‌తో చెప్పాను.

ఈవాళ పొద్దున్న ఎవరో నన్ను ఆపి, ఒక కాలెండరు చుట్ట చేతిలో పెట్టారు. అది తీసుకొచ్చి సౌరీస్‌కి చూపించి, ఆశ్రమానికి పంపుతున్నానన్నాను. 'లోపల ఏం బొమ్మవుందో చూడు' అంది! విప్పిచూస్తే శ్రీ సుబ్రమణ్యా పటం. నెమలీ అంతా (భగవాన్ శ్రీ సుబ్రమణ్య అవతార మంటారు.) భగవాన్ నన్ను మూర్ఖనమస్కరస్తుణ్ని చెయ్యడానికి పూనుకొన్నారు.

చాలా మంచి సినీమాచిత్రం చూస్తో 'ఎవరు చూస్తున్నారు ?', అని ప్రశ్నించుకున్నాను. వెంటనే చిత్రం చిన్నదై పోయింది. నల్లని తెరమీద తగిలించిన చిన్న painting మల్లే అయింది. దాంతో నటిస్తున్న వాళ్ల emotions భావనలు నన్నంటడం మానేశాయి. ఇట్లా చాలాసేపు. కథ చాలాగొప్ప Climax లోనికి వెళ్ళినప్పుడు నేనెవరు? 'మరచిపోయి మళ్ళీ మాయలో పడ్డాను.' నేనెవరు ? ఆ ప్రశ్నకి ఎంత శక్తివుందో తెలుస్తోంది.

మొన్న నాకో కల వొచ్చింది. శిష్యులు కాఫీ తయారు చేస్తోవుంటే చూస్తోవున్నారు భగవాన్ మేడకింద.

నేనూ కొందరు ఆశ్రమవాసులూ మేడమీన మాట్లాడుకుంటూ నుంచున్నాము. పక్కగదిలో నా సిగరెట్ పెట్టె మరచిపోయినాను. ఆ గదిలోనే నా 'టీ'కి నీళ్ళు కాగుతున్నాయి. భగవాన్ మేడపైకి మాదగ్గరికివొచ్చారు. మేము

నిశ్శబ్దమైనాము. భగవాన్ నాతో 'నాకో సిగరెట్ ఇయ్యి.' అన్నారు. నేను స్తంభించిపోయినాను. ఆమాట అంటూనే ఆగదిలోకి సిగరెట్ పెట్టెకోసం వెళుతున్నారు. నేను వెనకనే పరిగెత్తివెళ్ళి పెట్టెతీసుకొని ఆయనకి Offer చేశాను. ఆయన ఒకసిగరెట్ తీసుకుని నోట్లో పెట్టుకున్నారు. నేను అగ్గిపుల్ల గీశాను. భగవాన్ నావేపు వొంగి సిగరెట్ వెలిగించుకొని, పొగవూత్తో వెళ్ళిపోయినారు.

ఈకలవొచ్చిన రాత్రికి కొన్నిరోజులుముందునించి సిగరెట్ కాల్చడంవల్ల మెదడు మందగించి, ధ్యానానికి అభ్యంతరమౌతోందా అని ఆలోచిస్తున్నాను.

౯౭

ఏలూరు
12-2-40

My dear man,

అమ్మాయికి జ్వరంవచ్చిందా? డబ్బుసంగతి ఆలోచించకండి, మీరు నాకు ఖర్చుపెట్టేదీ, నేను మీకు ఖర్చుపెట్టేదీ. కాని మీకు పళ్ళు పంపేందుకు మనిషి దొరకడం కష్టం. నేను వుండనుమరి. వసంత్ వున్నాడుగాని, చాలా బద్ధకస్తుడు. అడిగిచూస్తాను ఏమంటాడో.

నా పుస్తకాల్లో ఇన్టరెస్టువున్న నలుగురు Young Men ప్రతిసాయింత్రం వొస్తున్నారు నాదగ్గిరికి.

భగవాన్ సంగతి అడిగారు. వాళ్ళకి సామ్యవాదంలో నమ్మకం. వాళ్ళు భగవాన్ ఆశ్రమానికి వెళదా మనుకొ

న్నారు. హైదరాబాదునుంచి ముగ్గురు Young Men, 'చలానికి మంచిగా తోచినమతం మాకూ మంచిదే, అరుణాచలం వెళ్ళా' లంటున్నారు.

Glory to Bhagavan భగవాన్‌కి జయ్.

సౌరిస్ వరసగా Surrealistic pieces వ్రాస్తోంది. అన్నిట్లోనూ ముఖ్యవిషయం భగవాన్.

నిన్న రాత్రి సరిగా నిద్రపట్టలేదు. తెల్లవారకట్ట మెలుకువ వచ్చింది. నామనసువంకచూస్తే యేమాత్రం ధ్యానస్థితి సూచించలేదు. 'భగవాన్ నన్ను వొదిలేశారా?' అని, మళ్ళీ నిద్రపోయాను. ఓ కలొచ్చింది. ఏదో యింటివరండాలో భగవాన్ కూచునివున్నారు; నేను ఆయనదగ్గర కూచునివున్నాను. మీరు కొంచెం దూరంగా కూచునివున్నారు. మన ముగ్గురమే. భగవాన్ యేదో అన్నారు. నాకు సరిగా తెలీలేదు. మీరు విన్నారు; చిన్నగా నవ్వారు. ఆయన్ని యేమిటని అడిగారు; ఆయన, 'అమ్మణ్ణి (అది దగ్గిరగావున్న కుక్క) సంగీతాన్ని appreciate చేస్తుంది. ఆనందిస్తుంది' అన్నారు. తరువాత తనకు కొంచెం నీళ్ళు తెమ్మన్నారు భగవాన్.

ఇంటోకివెళ్ళి, మాయింట వున్న చెంబుతో నీళ్లుతీసుకొని ఆలోచిస్తూ నుంచున్నాను అక్కడే. మీరు తొందరగావచ్చి ఆత్రుతతో, 'ఏమి టాలోచిస్తున్నారు? త్వరగా తీసుకురండి,' అన్నారు.

'ఇంకెవరన్నా నన్ను నీళ్ళుతెమ్మని ఆజ్ఞాపిస్తే నిరాకరించేవాణ్ణి. చూశారా, మరి భగవాన్ అయిపోయినారు గాని!'

అని వెళ్ళాను. భగవాన్ నాచేతిలోంచి చెంబుతీసుకొని (spiral) వంకరతిరిగే మెట్లమీాదనించి పైకి వెడుతున్నారు. ఆ మెట్లమీాద ఒక నల్లటిస్త్రీ ఆయనతో ఆ నీళ్ళచెంబు తనకు కావాలని పోట్లాడుతోంది. దిగ్భ్రమచెంది, ఆయన సహాయార్థం పరిగెత్తాను. కాని వెడుతూ 'ఆమె ఆ చెంబును తను ఆయనవెంట మోసుకువస్తానని పంతం పట్టిందేమో!' అనుకుంటున్నాను. మెళుకువ వచ్చింది.

ఆ నలుగురు స్నేహితులూ చాలాకాలంనించి ప్రతి సాయంత్రం వొస్తున్నారు. ఇదివరకు సారస్వతం చర్చించేవాళ్ళు. ఇప్పుడు భగవాన్ని, వేదాంతాన్ని చర్చిస్తున్నారు. నా struggles వాళ్ళతో చెప్పాను. భగవాన్ నన్ను జయించి లాగేస్తారు చూడమని మీరు నన్నెట్లా ఛాలెంజి చేసిందీ, ఎట్లా నేను మీామీాదా భగవాన్‌మీాదా నవ్విందీ? ఒక్క చిరునవ్వుతో భగవాన్ నన్నెట్లా వశ్యుణ్ణిచేసుకున్నదీ మాట్లాడాను.

నా ధ్యాన సమయాలుకూడా మాని వాళ్ళతో మాట్లాడుతున్నాను. కర్మ మానవొద్దంటారుకదా భగవాన్ అందుకని

చలం

ఏలూరు
21-2-40

*My dear Blessed,*

నాకు ఆశ్రమంనించి వొచ్చిన వుత్తరం భగవాన్ దగ్గిర్నించే వొచ్చిందా అని సందేహం. ఆ విషయాలు మళ్ళీభగ

వాణ్ని స్వయంగా అడగాలనివుంది. నేను బళ్ళో పాఠాలు చెప్తోవుండగా మధ్య ధ్యానంలో పడుతున్నాను. అట్లాంటప్పుడు ధ్యానాన్ని వొదిలించుకోనా, పాఠాన్ని వొదిలించుకోనా అనేది ప్రశ్న.

ఈస్టరులో నాతో అరుణాచలం వొస్తామంటున్నారు ఇక్కడి స్నేహితులు. వీళ్ళునాకు సెక్సువిషయంలో, జ్ఞానవిషయంలో admirers. నా life struggles and aspirations, నేనుచివరికి అరుణాచలం ఎట్లాచేరానో, ఓ పుస్తకం వ్రాయమంటున్నారు నన్ను. కాని వ్రాస్తానా? వ్రాయగలనా? వ్రాయాలని నిర్ణయింప బడ్డదా? కాని నేను మీకువ్రాసిన ఉత్తరాలు మీదగ్గిర ఉన్నాయన్నారుగా? అవే రికార్డుగా వుంటాయి చిక్కుల్లో వెతుక్కునే యువకులకి మార్గాలు చూపుతాయని చెప్పి పుస్తకమే వ్రాయమని నన్ను tempt చెయ్యప్రయత్నం చేస్తున్నారు.

Bhagavan seems to have taken my case up for help.

భగవాన్ బెజవాడలో మా యింటిని పడుచుపిల్లలతో నింపారు. మళ్ళీ ప్రేమలో పడ్డాను. తీవ్రంగా కాదులెండి.

ఓ తమాషా జరిగింది. మా డాక్టరుగారి పేషన్ట్లు patients కొందరు, ఆమెనించి భగవాన్ సంగతి విన్నారు ముందు. కొన్నాళ్ళకి ఆ కుటుంబానికి వున్న ఒక్క మొగపిల్లవాడూ చచ్చిపోయినాడు. ఆ రాత్రే ఆ ఆడవాళ్ళందరూ ఇల్లుతాళ మేసి మాయమైనారు. తరవాత చాలారోజులకి తెలిసింది వాళ్ళు అరుణాచలం వెళ్ళారని. నెలతరువాత

నవ్వుతున్న మొహాలతో తిరిగివొచ్చారు. వాళ్ళుచెప్పిన సంగతులు—

సారిన్ భారితిలో వ్రాసిన లేఖని భగవాన్ వాళ్ళచేత చదివించుకున్నారట. 'నాకు ఆభాష సరిగా తెలీలేదు-చదివి అర్థంచెప్పండి.' అన్నారట- the cunning saviour· 'నిగొప్పదయ—' అని వాళ్ళుచదువుతోంటే; 'దయా! పాపం; దయ చూపించాను గావును?' అంటూరుట.

ఆమాటలు విన్నప్పుడు నా హృదయం కంపించింది. బాలకృష్ణుడికన్న అల్లరివారు. భగవాన్ దుఃఖంలోవున్న ఆ స్త్రీలచేత. వాళ్ళ ఎరిగివున్న అమ్మాయి వ్రాసిన లేఖని చదివించి, తద్వారా వాళ్ళకి శాంతినియ్యాలని ఉద్దేశించి, తనకి అర్థంకాలేదని నాటకం ఆడారు. భగవాన్! చిన్నపిల్ల వ్రాసిన పిచ్చి వ్యాసాన్ని ఎంతగొప్పగా ఉపయోగిస్తున్నారో చూడండి.

కౌస్తుభంగారు వొచ్చారు. సారిన్ ఎవరో తెలీకండానే ఆ లేఖని తాగేస్తున్నారట ఇన్నాళ్ళా.

ఇవన్నీ మీచేతలే. మీమూలానే భగవాన్ నాకు.

భగవాన్ నావేపు దృష్టిమరల్చడం తెలుస్తోంది నాకు. కొద్దిరోజులు ఓపికపట్టండి; మనం ఏదో కాబోతున్నాము. కాదు—ఏమీలేకుండా కాబోతున్నాము—చాలాత్వరలో.

అవును, మనం గొప్పవి రాయబోతున్నాము. ఈఅహాన్ని చావనీండి.

౯౯

మా రేరు
24-3-40

My Dear Searcher,

ఇక్కడ ప్రయాణీకుల బంగళాలో వున్నాను. అవును. మీరు చెప్పేదినిజం. భగవాన్ అనుగ్రహం లేనిది జీవితం ఏమీ ఫలితంలేని నిరంతర శ్రమ, బాధే. కాని క్రమంగా బలం సంపాయించుకుంటున్నాము.

Reading Maeterlink's Fourth Dimension. He almost says the Fourth Dimension, Time, the ever Present, is God. Reading Russel's A B C of Relativity. We see quite plainly that higher mathematics and physics take you to That or Nothing.

సినిమాలు చూస్తోకూడా, ప్రజలు ఇంకా ఈ లోకం వాస్తవమని భావిస్తున్నారు.

వూరికే worry పడి మనసుని analyse చేసుకోకండి. అంత శ్రద్ధ చూపించవలసిన ప్రాముఖ్యతలేదు మనసుకి.

మీకు వ్రాయడానికికూడా ఏమీ లేకండాపోతుంది నాకు. మీరు ఆ నవ్యసాహిత్య సభలకి బెజవాడ వెళ్ళననడం చాలా బుద్ధిగావుంది. They are trading on your goodwill, Those Thugs !

నామీద భగవాన్ ఇంత దయ చూపుతున్నా, I feel despondant and get black moods అట్లాంటప్పుడు

భగవాన్ వ్యథారూపంలో నన్ను దర్శిస్తున్నారని తెలుసు కుంటాను.

Let me find you not only in success but even in my defeat.

నా విజయంలోనేకాదు నా పరాజయంలోకూడా నిన్ను చూసే శక్తి నియ్యి.

అప్పుడు నిశ్శబ్దమైన నల్లని రాత్రిలో, ఆయన అనుగ్రహం కనిపిస్తుంది.

నావంటి వాణ్ణికూడా ఆయన తీసుకున్నారంటే...

రోజూ చిరునవ్వుతో.

'Is it your wish to appear through your absence?' అనండి.

వొంటరిగా వొదలడంగాని, తాను తిరిగి కనిపించడంగాని, ఆ భారమంతా భగవాన్ మీదనే వొదలండి ఆయన దూర మైనకొద్దీ, ఈసారి మరింత చేరువౌతారు.

మనకి తెలీకండా, మన ఆత్మలో ఏ చీకటిమూల ఆయన పనిచేస్తున్నారో మనకి తెలీదు.

Through the very intensity of desertion one day his smile will break, you will see he has been always with you while you were sleeping.

కాలం అనంతం. తొందరేంలేదు. మీతో శాశ్వతంగా వుండిపోయినా రాయన.

మీరు నాకు ఇదివరకు చెప్పిన సంగతులే మళ్ళీ మీకు జ్ఞాపకం చేస్తున్నాను.

Like a child who bables the mother's words, when she is weeping.

ప్రతిగంటా భగవాన్‌ని ఒకసారి జ్ఞాపకంచేసుకుని 'నీకోసం చూస్తున్నాను. నీ ఇష్టమైనప్పుడు రా. వొస్తావని నాకు తెలుసు. అప్పటివరకు కాచుకుని వుంటాను. ఏడవను' అనండి.

ఈ నిశ్శబ్దం తప్పకండా ఆనందాశ్రువులతో బద్దలవుతుంది ఆ రోజుకోసం చూడండి.

౧౦౦

ఏలూరు
10-4-40

My Dear doctor

భగవాన్ నా కలలో కనపడి!

'నాకేం తోచటంలేదు. దేనిమీదా బుద్ధిపోదు' అని నేనంటే,

'అది అంతేలే' అని smile చేశారు.

విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీశ్రీ పద్యాల్ని పుస్తకంగా అచ్చువేస్తారట. నేను పీఠిక వ్రాయాలిట.

I am passing through dull times. కాని వ్యథగా లేదు. ఈ dullness కూడా అవసరమేమో మనకి. వొదిలేశారు గావును భగవాన్, గోలపడకండి, ఆధ్యాత్మికానికైనా సరే. బాధనించి తప్పించుకోలేనప్పుడు బాధపడండి. Perhaps it is truism. బాధనించి తప్పించుకునేందుకు సులభమైనమార్గం దొరికితే తప్పించుకోండి. చాతకాకపోతే

పట్టువొదిలి బాధని దానిపనిని దాన్ని చేసుకోనీండి. ప్రస్తుతం అదీ నా ఫిలాసఫీ.

శ్రీశ్రీ పుస్తకానికి నేను వ్రాసిన పీఠిక అతని ఆరాధకులకి అది అసంతృప్తిగావుంది. మీరు అనే దానికన్న శ్రీశ్రీలో ఆధిక్య ముంది. కాని అతని ఆరాధకులు మనని నమ్మమనేటంత గొప్పలేదు.

మీ సాహిత్యసభ అధ్యక్షకోపన్యాసం నేను చదవలేదు. బెజవాడనంతా ఆహ్వానించారు గాని, నన్ను పిలవలేదు సభకి. పైగా మీరు నన్ను ఆసభలలో అధ్యక్షత వహించమంటారు.

సత్యనారాయణగారి శ్రీ శ్రీ మీది adm_aton Publicity trick అయివుండవొచ్చు. కాక వాస్తవమూ అయి వుండవొచ్చు. ఆయన ఉపన్యాసంలో మిమ్మల్ని పేర్కొనడంకూడా వొదిలారట. చూడండి.

నర్తకుడు బోస్ మాతో వున్నా రిప్పుడు.

తిని సంభోగించి సంతోషించి తృప్తిపడే మృగాల్లా తప్ప. అట్లా కాని మనబోటివాళ్ళకి భగవాన్ ఒక్కడే ఆశ, అవధి.

౧౦౧

బెజవాడ
19-6-40

My Dear Kurnool-wallah,

అవును. టాగూరుగారి statements చూశాను. గడిచిన పుట్టినరోజున ఆయన 'ఇంకా నేను యీ మాయ

ల్లోనే కొట్టుకుంటున్నానని అనవొచ్చు ప్రజలు. కాని వాస్తవం మనకి ఈ మాయారూపాల ద్వారానే వ్యక్తమాతోందంటాను.' ఇట్లాంటి మాటలన్నారట.

ఆయన గీతాంజలీ, Fruit gathering and crossing అన్నీ ఆయన ఆధ్యాత్మికానుభవాలు. నలభై యేళ్ళ విజ్ఞానాన్ని రంగుల కవిత్వంలో అల్లారు.

బెంగాలు ఆయనకి అర్పించిన గౌరవాన్ని మీరు రేడియోలో వినవలసింది.

మదర్ క్రిష్ణాబాయి నా ధ్యానానికి కావలసిన భావనని ఇయ్యడంతో ఆమె పనిపూర్తి అయినట్టుంది. క్రమంగా ఆమె రూపం నా ధ్యానంలోంచి మరుగు పడుతోంది. ప్రస్తుతం నేను ఆత్మలోకి దిగినప్పుడు, ఒక శూన్యప్రదేశం, కొంచెం నీలం రంగుగా, (దాన్ని వర్ణించడానికి చాతకాదు) కనపడుతుంది. ఆకాశంలాగు వుంటుంది. దానివంక చూస్తో వుంటే, మెత్తని శాంతినిస్తుంది. అప్పుడు వూపిరి పీల్చడం కూడా ఆనందంగా వుంటుంది. అది విశాలమై, నన్నూ, లోకాన్ని నిలపాలను కుంటూను. అదే అభివృద్ధేమో? కాని ఆ నిమషాలు ఎంతో fleeting. సరేలెండి. నాపాల భగవాన్ వున్నారు కద. భారం ఆయనదీ.

అవును. ఒకనాడు మదర్ కృష్ణాబాయిని దర్శిద్దాము.

ఈ లోపల మీరు అనుభవిస్తున్న miserable disgust ద్వారా మిమ్మల్ని లాగాలని చూస్తున్నట్టున్నారు భగవాన్.

౧౦౨

ఏలూరు
11-9-40

My own self,

మీ ఉత్తరం చదవడం పూర్తికాకముందే నా కళ్లు నీళ్ళతో నిండాయి. అవును. ఏమీ వ్రాయకండి. వ్రాయడానికి ఏముంది? చాలాకాలం వ్రాసే శక్తిలేక, నేను యీ ఉదయం musings వ్రాశాను. కాని అవన్నీ భగవాన్‌తో వేదాంతంతో నిండిపోయినాయి. భాగాలు తీసెయ్యాల్సి వొచ్చింది,

అన్నీ వొదిలి శాంతంగా కూచుందామనే మీ ఆశని నేను వొప్పుకోను. అన్నీ వొదిలి శాంతంగా కూచోగలిగినంత అనుగ్రహమే మీకు లభిస్తే, పనిచేస్తోకూడా, అన్నీ వొదిలి శాంతంగా కూచోగలరు. బడీ, సంసారం చిక్కులతో మనసు అలిసి, "అబ్బా! అన్నీ వొదిలి శాంతంగా కూచోగలిగితే, ఎంతబావుంటుంది!" అని ఆశపడుతుంది. ఆకాలంవొస్తేసరి, బళ్ళో పాఠాలు చెప్తూకూడా శాంతంగా ధ్యానంలో కూచోగలరు.

ఈ అనారోగ్యం తప్పితే, నాకు శాంతంగా వుంది. ఉన్నతమైన ఆధ్యాత్మిక శాంతంకాదు. వుత్త భౌతిక శాంతం (animal peace). అంతా శుక్రుడిపని. మన మనోస్థితి ఇంతగా యీ గ్రహాలమీద ఆధారపడివుందా అని ఆశ్చర్యం వేస్తుంది. నాకే ఆరోగ్యంవుంటే. నా నరాలద్వారా, భగవాన్ వైపు నామనసు తెరచుకుంటుందని నా నమ్మకం.

నా స్నేహితురాలు- భగవాన్ మాఇద్దర్నీ కలిపి బాగా నవ్వుతున్నారు. నేను అడక్కుండా వొచ్చింది ఆమె. చాలా తీవ్రమైన మోహాసక్తి ఆమెకి. కామవిద్యలో రసికురాలు; కళాశాలి. ఇద్దరికీ స్వేచ్ఛ. అట్లా ఏ చింతా లేకండా కలిసివుండిపోతామేమో ననిపించింది. కాని ఆ అనుభవం నాకు విసుకుపుట్టి ఎప్పుడు తప్పించుకుంటానా అనిపించింది.

౧౦౩

బెజవాడ
6-5-40

My dear Laddie,

మీకు కొన్ని tips (టిప్సు) పంపుతున్నాను. వాటివల్ల నాకు ఉపయోగం కనపడ్డది. మీకు సహాయపడతా యనుకుంటాను. భగవాన్ మనదగ్గిర లేనప్పుడు ఆయన్ని మనదగ్గరికి బలవంతాన రప్పించుకోవాలి. కాదు ఆయన వొచ్చేట్టు మనం ఆయనకి సహాయం చెయ్యాలి. రెండూ ఒకటేనేమో లెండి.

1. తప్పనిసరి అయినప్పుడు తప్ప, మౌనం పూనండి. చదవకండి, మాట్లాడకండి. ఆలోచనల నట్లా తేలిపోనీండి మౌనం పూనండి. కాని పనిపెట్టుకుని ఆలోచించకండి. వార్తాపత్రికలు కూడా చదవకండి.

2. మనసు ఏకాగ్రం కావాలని బెంగపెట్టుకోకండి. ఏకాగ్రం కాలేదని దిగులు పడకండి. వొదిలెయ్యండి అట్లా.

3. ఏకాగ్రం చెయ్యాలని చాలా గట్టిగా ప్రయత్నం అక్కర్లేదు. Be idle. Be ready. అనుగ్రహంవచ్చినప్పుడు సిద్ధంగా ఉండండి.

4. ఇంటిపనులలో గాని (పిల్లలతోనైనా సరే), ఆఫీసులో గాని, ఇతర విషయాలలో కాని ముందు మీరు కదిలించ కండి. ఇతరులువొచ్చి మీ మనసుని కదిలిస్తేనే గాని కదల కండి. ఇతరుల దగ్గరికి మీ అంతట మీరు వెళ్లకండి. యితరులతో ముందు మాట్లాడకండి. వాళ్ళు మాట్లాడి స్తే తొరగా ముగించండి.

ఇంకా అక్కడ చేరలేదని వ్యధ పడకండి.

మీరు 'అక్కడే' వున్నారు.

చాలాసార్లు- 'భగవాన్ Is it your pleasure to come?' అని అడగండి. Watch, wait and 'do not' pray.

ఫరవాలేదు. నేను నడుస్తూనేవున్నాను. భగవాన్ ఈ దోవన చాలాసార్లు వెడుతున్నాడు.

భగవాన్ మీద మీరు ఫిర్యాదు చేసుకునేందుకూ, మీకు సలహానీ, ధైర్యాన్నీ ఇచ్చేందుకూ, మీకూ ఓ సారిన్ వుంటే బావుండును. సారిన్ నాకన్న ఓ అడుగు ముందు వుంటుంది. She beckons, reassures and smiles.

నిరాశ్యాపారాన్ని మనసు భరించలేనప్పుడు తప్ప చద వకండి, మాట్లాడకండి. అప్పుడైనా పిల్లలతో ఆడుకోండి, భగవాన్ సంగతులు మాట్లాడండి.

ధ్యానమైనా బలవంతం చెయ్యకండి. ఏకాగ్రతలేకండా నైనా సరే, నిరంతర నామజపం సహాయం చేస్తుందేమో ?

౧౦౪

ఆరుణాచలం
13-5-40

My dear Toy

మీ పద్యం భగవాన్ ముందు పెట్టేధైర్యం తెచ్చుకుంటున్నాను. రేపు ఇక్కడేవుంటే నేను, భగవాన్‌కి ఇయ్యగలనేమో? ఇదివరకటి మల్లేనే కొట్టుకుంటున్నాను ఇక్కణ్ణించి ఎప్పుడు బైటపడతానా అని. ఈసారి భగవాన్ నాకు ఇంకా దగ్గిరిగా వొచ్చారు. సారిస్ సంగతి ఏదో ఒకటి మాట్లాడతారు భగవాన్. సారిస్‌ద్వారా ఆయనదృష్టి నామీదికి వొస్తోంది.

౧౦౫

బెజవాడ
17-5-40

My dear Boy.

ఆశ్రమం సంగతులు నేను చెప్పేందుకు, మీ రిక్కడ వుంటే బావుండును. ఆశ్రమంలో పదిరోజులు వుందామని వెళ్లాము. మూడురోజుల్లో తరిమేశారు మమ్మల్ని భగవాన్. హాలులో మిమ్మల్ని తలుచుకొన్నాను! మీ పద్యం భగవాన్‌కి ఇయ్యలేకపోయినాను. ఆయన అట్లా ఉద్దేశించలేదు గావును ! ఆశ్రమంమీద అపవాదులు హెచ్చుతున్నాయి.

మీ పద్యం నాకు బావుంది. మీ హృదయ మంత సింపుల్‌గా నిర్మలంగావుంది. సూర్యనారాయణగారికి బావుండలేదు అది. సారిన్‌కి బావుంది.

ప్రతిరోజూ భగవాన్ సారిన్ సంగతి మాట్లాడు తున్నారు. సారిన్ మీద ఆయనకి శ్రద్ధ.

ఇన్ని ప్రయత్నాల ఫలితం అప్పుడప్పుడు కనపడు తుంది. ధ్యానంలో ఆనందం కలుగుతోంది. కాని ఎప్పుడో ఓసారి, కొన్ని నిమిషాలుమాత్రం.

మహానందిలో ఓవారం వుండాలని నా కల. కాని కదల డానికి బద్ధకం. చూడడానికీ, తెలుసుకోవాలనీ, వుండే కొంచెం వాంఛా ఇప్పుడు అసలు పోతోంది.

ఇదేం ముఖ్యం కాకపోయినా, ఈ సంగతి మీ రికార్డులో వుంటే మంచిది. ఈమధ్య 'మదర్ కృష్ణగారు' నాధ్యానంలో కనపడుతున్నారు. నా ధ్యానానికి ఆమె భావన నిచ్చారు. ఆమెరూపం నా మనసులో నృత్యంచేస్తుంది, పిలుస్తుంది. నవ్వుతుంది. కొంతప్పుడు ఆమె హృదయంలోంచి నా హృద యంలోకి ఆనందం పొంగుతుంది.

ఇది మనం గడపవలసిన ఒక stage గావును

ఆశ్రమానికి మామిడిపళ్ళు పంపాను.

౧౦

ఏ లూ రు
19-7-40

My dear Laddie,

శుక్రమహాదశ ఈరోజు ప్రారంభం, నాకు; మీ అందాల వుత్తరాన్ని తీసుకొచ్చింది ప్రప్రథమం.

భయంలేదు. శుక్రుడిచ్చే సుఖాలనించి, పాపాలనించి, భగవాన్ కాపాడతారు నన్ను. శుక్రు డేంచెయ్యగలడు? అది గాక శుక్రు డివ్వగల భోగాలన్నీ భగవాన్ అనుగ్రహానికి పూర్వమే అమ్మేసుకున్నాను.

చాలా స్పష్టంగా తెలిసేట్టు, నేను అభివృద్ధి చెందుతున్నాను.

ఈమధ్య అడపా తడపా కొందరుసామ్యవాదులు,నాకీర్తిని విని, నన్ను చూడ్డానికి వొస్తున్నారు. నా వుద్దేశంలో వారిని 'బజారు సోషలిస్టులు' అని ఓవ్యాసం వ్రాయాలనిపిస్తోంది. కాని వ్రాయాలని లేదు.

౧౦౨

ఏ లూ రు
4-9-41

My dear Viceroy,

ఎంతో అనిపిస్తోంది మీకు వ్రాయక తప్పదని, అన్ని మర్యాదింగ్సు. కాని వ్యవధి ఏదీ? గంటలుకొట్టారు. నేను క్లాసుకి వెళ్ళాలి. అవును జోస్యులు చెప్పారుకదా మీకు

కష్టదినాలు అని! అయితేనేం? ఈ దిగుళ్ళన్నీ హోమపతీ మాత్రలు, దేహాత్మబుద్ధిని నయంచేసేందుకు, నేను చెప్పాలా మీకూ? మీరు వ్యధపడుతున్నారని సంతోషిస్తున్నాను.

చాల గొప్పవాడిమల్లే మాట్లాడుతున్నానా? అయితే ఆ గొప్పతనమంతా భగవాన్‌ది. మీరు తెచ్చిపెట్టిన భగవాన్‌ది.

మధ్యాన్నం టీ దగ్గర అప్పుడప్పుడు భగవాన్‌సంగతి మాట్లాడుకుంటాము నేనూ నరసింహంగారూ యింకా ఉదారులైన మిత్రులూ. ఇవి చాలా ముఖ్యమైనదని చావుబతుకుల కన్న ముఖ్యమైన విషయమని గుర్తించరు. వాళ్ళేకాదు, చాలామంది. స్త్రీనిగురించి ప్రజలతో అదే నా తగాదా. అది స్వల్పమైన విషయంకాదు. It is not a passing fancy.

నాకు ఇప్పుడు రాత్రింబవళ్ళు మొదటి ఆలోచనా, చివరి ఆలోచనా, 'నే నింకా పక్వంకాలేదు – ఏదీ అందుకోలేదు ఎప్పుడు! ఎప్పుడు! ఎట్లా? ఎట్లా?' అని కాలుతున్నాను. అదొక్కటే నాకోర్కె, అదే ఆశయం. నా శరీరపు అనారోగ్యం భగవాన్ అనుగ్రహాన్ని నాకు చేరనీకుండా చేస్తోంది. 'ఈ శరీరాలమీద కొంతవరకన్నా ఆధారపడక తప్పదు. అవి మన మనసులకీ ఆత్మలకీ ఆధారాలు.'

మీరు భయపడ్డ మార్గాల శుక్రుడు పనిచెయ్యడం ప్రారంభించాడు. ఒక ఆమెని తీసికొచ్చాడు. చాలా మోహాతీవ్రత గల అనుభవం. కాని ప్రస్తుత మనోస్థితిలో ఆమె విసుకు పుట్టింది నాకు. But you know how Bhagvan summerily disposed off my previous glamour.

సంబంధము తీసి పోలేదు ఇంకా ఈమె నాతో స్థిరపడాలని ఉద్దేశిస్తోంది.

ఎంత సులభంగా నేర్పుగా భగవాన్ గడిచిన నా మోహ సంబంధాన్ని తెంచేశారో మీకు తెలుసునుగా! ఆ అమ్మాయిని నాకు అందనంతదూరంగా లక్నో పంపించేశారు.

ఇప్పుడు దీని కళ్ళల్లోకి చూస్తోంటే రెండుసార్లు ఆమె కళ్ళలో భగవాన్ని చూశాను. అది అలవాటైపోయింది. ఎప్పుడైనా మనదృష్టిని ఏకాగ్రంచేస్తే తీవ్రమోహంవల్ల కానీ, లేక ఘోరమైన నేరం చెయ్యడానికి కానీ - అల వాటుచొప్పున భగవాన్ కనపడతారు. ఈ శరీరానుభవం ఆధ్యాత్మిక అనుభవంగానన్నా మారాలి. లేక భగవాన్ సంబంధం మన శరీరానుభవమంత materially intense భౌతికంగా అంత తీవ్రమన్నా కావాలి. అట్లా అనిపించింది నాకు. నేనూ అనుకుంటున్నాను. శుక్రుడు స్త్రీలని నాకు తెస్తాడని, మీరు అన్నది నిజమౌతుందని.

కానీండి, శుక్రుణ్ణి తన డ్యూటీని చేసుకోనీండి. Let the women come. I feel I am storng with the strength of ten men and one Bhagvan.

౧౦౮

బెజవాడ
9-10-40

My Prophet,

జ్వరం—కాని, రాత్రి వొచ్చిన ఈకల వ్రాయకండా వుండలేను.

గొప్పవుత్సవం జరుగుతోంది భగవాన్‌కి. తెలుగువాళ్ళు కూడా వేలకొలది నేలమీద గుంపులు గుంపులుగా కూచు న్నారు రాత్రి చీకట్లో. అక్కడక్కడ దీపాలు, భజనలు. వేదం, పూజలు, శూన్యంవంక చూస్తో, నిర్లక్ష్యంగా, నడిచి పోతున్నాడు చలం ఆమనుషుల్లోనించి. మనుషులు అతన్ని గుర్తుపట్టి, అతని పేరుని గుసగుసలు పలుకుతున్నారు. అతను తనవేపు చూడాలని 'జోక్' చేస్తున్నారు, ముఖ్యం మన సాహిత్య మిత్రులు. అతను తల కిందికివొంచి చూడకన్నా చూడకు గుర్తుపట్టడు. అట్లా నడుస్తో వెడుతున్నాడు.

గొప్పపూజ. అందరికీ ప్రసాదం పంచిపెడుతున్నారు. ఆ పూజ ఉదకం గ్లాసులతో తాగుతున్నారు. ఆ ప్రసాదమూ, ఆ ఉదకమూ, ఏదీ లక్ష్యంలేదు చెలానికి. తనవేళ్ళచివర్లు మాత్రం పూజ నీటిలో ముంచి, వెళ్ళిపోతున్నాడు చాలా ఠీవిగా.

దూరంగా భగవాన్ ఎత్తైన dias డయాస్‌మీద, నల్లని ఆకాశంముందు silhouette (సిలూఏట్)గా కనబడుతున్నారు. నల్లటి కుర్రాళ్ళు ఆయనకి పూలూ, పూజాద్రవ్యాలూ తయారుచేస్తో, ఆయనదగ్గరిగా తిరుగుతున్నారు.

తెల్లటి frock and skirt వేసుకుని సౌరిస్ తిరుగు తోంది. అక్కడఎట్లాఉన్నదాఅనిఆశ్చర్యపోతున్నాడు చలం.

మామూలు ప్రకారం భగవాన్ 'ఆ అమ్మాయిని, సౌరిస్‌ని, రమ్మనండి' అన్నారు గావును. వెళ్ళింది అని జ్ఞాపకం తెచ్చుకున్నాను.

చలానికికూడా భగవాన్ దగ్గిరికి వెళ్ళాలని వుంది. వాళ్లు పిలవకండా అక్కడికి వెళ్ళడానికిగాని, సారిన్ తప్పడినని వెళ్ళడానికిగాని చలానికి చాలా బిడియం.

'భగవాన్‌కి చలం అక్కర్లేకపోతే పోసి. చలానికి ఏం లెఖ్ఖ!' అనుకుంటో వెళ్ళిపోయినాడు చలం.

అట్లా వెళ్ళి మాతృ భూతేశ్వరి ఆలయద్వారంవంటి దేవాలయంద్వారం దగ్గిరికి వెళ్లాడు. లోపల అరుగుమీాద ఓ కుర్రాడు ఒక లింగాన్ని ఒక కొయ్యతొట్టిలో పెట్టి పూాయిస్తున్నాడు. భగవాన్ తనకి కావాలని చలానికి పెద్ద వాంఛ పట్టుకుంది.

ఆ కుర్రాడు 'భగవాన్‌ని ఆరాధించాలనివుందా నీకు?' అన్నాడు. చలం తలవూాయించాడు. ఆ కుర్రాడు ఆ శివ లింగాన్ని చూపి 'ఇదే భగవాన్. రా, పూజచెయ్యి' అని ఆ పుయ్యాలని చలానికిచ్చి పూాయించమన్నాడు. పైగా 'పాడు' అన్నాడు. చలం ఓపాట యీాలలో ఊదుతున్నాడు. ఆ కుర్రాడూ ఈలతో పాడాడు. ఆ కుర్రాడి ఈలలోంచి ఒక పెద్ద ఆర్కెస్ట్రా వాయిస్తున్నట్టు వినబడ్డది.

'నువ్వు నామల్లే ఊదు' అన్నాడు ఆ కుర్రాడు.

తన చాతకాదన్నాడు చలం. అయితే పాడమన్నాడు ఆ కుర్రాడు. చలం 'వరములొసగి బ్రోచుట నీ' అని పాడుతున్నాడు. ఆ పాట చలానికి అసహ్యం, సాధారణంగా. భగవాన్‌ని తలుచుకుంటూ పాడుతూ; 'అయినా భగవాన్‌ని అడగవలసిన వరమేముంది నాకు? పోనీ యీాజబ్బు పోగొట్ట

మంటాను' అనుకుంటున్నాడు చలం. ఇంకా బిగ్గరిగా, ఇంకా బిగ్గరిగా, పాడించాడు చలంచేత ఆకుర్రాడు. ఇంతలో బైట భగవాన్ దగ్గిర గొప్పవాయిద్యాలు ప్రారంభించారు. వాటి ధ్వని పైన వినబడేట్టు అరిచి పాడాల్సి వచ్చింది చలం. లేకపోతే, ఆ లింగాన్ని, ఆ కుర్రాడు వూపనియ్యడని భయం.

ఆ కుర్రాడు సంతోషించి 'నీకు భగవాన్ ప్రసాదం కావాలా?' అని అడిగాడు. ఆ ద్వారంలోంచి దూరంగా కనబడే భగవాన్ని చూపుతో. ఆత్రుతతో కావాలన్నాడు చలం.

ఆమూలనున్న ముసలి ముష్టివాణ్ణి చూసి,

"ప్రతిరోజూ భగవాన్ ప్రసాదం అతనికి వస్తుంది. ఇవాళ రానీ, అతన్ని బతిమాలి నీకు కొంచెం యిప్పిస్తాను" అన్నాడు.

ప్రసాదం వొచ్చింది. విభూతిముద్ద, వొంగిన ఇనపచువ్వ చివర నూనె. అవికొంచెం ఇచ్చాడు చలాన్ని నుదుటకెట్టుకోమనీ.

మెళుకువ వొచ్చింది.

చాలా స్పష్టంగా వొచ్చింది యీ కల.

నా జ్వరంలో మొన్న ఆకస్మాత్తుగా వినబడ్డది.

"If you depend on experience alone,
you will have to take others experience
as your own experience" అని

దేనికో ఇది సంబంధం తెలీటంలేదు.
నా సందేహాలకి సమాధానాలేమో ?

౧౦౯

ఏ లూ రు
18-10-40

My dear Bhagvan dass

అరుణాచలం వెళ్ళారు మీరు అదృష్టవంతులు. భగవాన్ హాలులో చదువుతానని నన్నుఉత్తరం వ్రాయమని మీరేమో వ్రాశారు, నిన్నరాత్రే పదింటికి. నిస్సహాయుడైన భగవాన్ జోక్యం వొదులుకోవాలని నిశ్చయించుకున్నాను. ఎందుకంటే, గమ్యస్థానం ఏదైనా, భగవాన్ బోధించేమార్గం, వ్యధామయం. ఈ ధ్యానంగోల నాలో ప్రారంభించకముందు ఎట్లావున్నానో, ఆ స్థితికి వెళ్ళిపోవా లనిపిస్తుంది. కాని తిరిగి వెళ్ళడం చాతకాకండా చేశారని భగవాన్‌మీద కోపంగావుంది.

౧౧౦

ఏలూరు
21-10-40

My dear Deekshitar,

మళ్ళీ ఓ ఆధ్యాత్మిక అపాయస్థితిలో పడ్డాను. తిరగబాటు, నిస్పృహాత్వం, నిరీశ్వరత్వం.

మీ ఉత్తరంతో జాగుపడ్డాను మళ్ళీ. ఇరవైయేళ్ళు పని చేశాను, చాలు. వొదులుకోవాలని వుంది. పని దుర్భరంగా

వుంది. వొచ్చినఖర్మం ఏమిటంటే తాత్కాలికంగా భగ వాన్ మనచెయ్యి వొదిలితే మనం నిస్సహాయులమై పోతాం. మన పాతపగ్గాలూ, సంతోషాన్నిచ్చే సంగతులూ, మనకి సహాయం చే స్తావు, ఇప్పుడు.

మనని అందర్నీ ఒకేసమయంలో ఒదిలేశారు భగవాన్? కాని మళ్ళీ కావిలించుకోడానికే.

భగవాన్ కల్లోవొస్తే, కలలో ప్రతి చిన్నవిషయం చాలా స్పష్టంగా జ్ఞాపకంవుంటుంది.

సౌరిన్‌కి ఒక కల వచ్చింది భగవాన్ ఆమెకి నిశ్శబ్దం అర్థం చెవుతున్నటు...

నిశ్శబ్దం అంటే నిస్+శబ్దం, అంటే శబ్దం లేకపోవడం. శబ్దంవుం టేనేగాని నిశ్శబం ఎట్లా వుంటుంది?

'నిశ్శబ్దం అంటే ఏ శబ్దమూ లేకపోవడం కాదు-శబ్దంలేని శబ్దం అన్నమాట'అన్నా ర భగవాన్.

నా అనారోగ్యమూ అహమూ అనే మబ్బుల్ని చీల్చుకుని భగవాన్ కాంతివొస్తోంది నామీదికి.

తక్కిన ఉద్దేశ్యాలనీ, ఆశయాల్నీ నాశనంచేశారు భగ వాన్. తనమీదా, కొంతవరకు పిల్లలమీదా తప్ప తక్కిన వన్నీ—కాని మళ్ళీ మళ్ళీ స్త్రీ సౌందర్యంకోసం కాంక్ష తలెత్తుతోవుంటుంది. కాని క్రమంగా దూరమౌతోంది.

"That is how I am"

౧౧౧

ఏ లూ రు
28-11-40

My dear Bob,

తెల్లవారుతూనే తలనొప్పితో లేచాను. విరేచనానికి ఉప్పుతీసు కుని స్పెన్సరుతో టీ తాగటానికని రైలుస్టేషనుకు వెళ్ళాను. ఆ స్పెన్సరే నా ముఖ్యమిత్రుడు యీపూళ్ళో. ముందు టీ కప్పు పెట్టుకుని కూచుంటే, నాలోంచి గుబులు, లోకాలు అన్నీ ఖండాలం, భగవాన్ దూరం, నిస్సహాయుడు. అంతు లేనిఖేదం, లోకమంతా ఖేదం.

ఇంటికి వొచ్చాను. విరేచనమయింది. తలనెప్పి చెదిరి పోయింది. లోకం చాలా అందంగా కనపడ్డది. పక్షులు పాడాయి. ఉదయించే సూర్యుడు, అద్భుతంగా కనపడ్డాడు. నేను చాలా సంతోషవంతుణ్ని. భగవాను చాలా గొప్ప వారు. ఆయన లేకపోతే నేనేమయ్యేవాణ్ణి!!

కనక,జానీ, లోకపురంగు చక్కని విరేచనంమీద ఆధార పడివుంది. ఐనా తాము చూసేదీ, అనుభవించేదీ సత్యమనీ, వాటికి శాశ్వతమైన విలువలున్నాయనీ అనుకుంటారు ప్రజలు. ఇంకా.

నన్ను వుత్త ఫూల్‌ని చేస్తున్నారు మీరు. నేను వీటిని (విన్నపాలు) నా కోసం వ్రాసుకున్నాను. ఎట్లావున్నా యో చూడమని మీకు పంపాను. రాధ గీతంకూడా ఒకటి. తయా

రాతోంది. ఏంగతి పట్టింది చలం నీకు ? ఈ పతవానికంతా కారణం మీరు ?

ఓ రాత్రంతా పడ్డ ఆత్మక్షోభకి పర్యవసానం యీ గీతం. ఏ ప్రయత్నంలేకండా వొస్తున్నాయి యీ గీతాలు. అందు వల్లనే ప్రజలహృదయాల్లో శబ్దించాలి. కాక-నిశ్శబ్దించాలి.

ఈనాడు నేను భగవాన్ భక్తుణ్ణని నిశ్చయంగా బహి రంగంగా అనగలను. నీకు పిచ్చెక్కిందా అంటే, భగవాన్ వర్షించే అమృతం తాగి మత్తెక్కిందంటాను.

ప్రతిభవాళ్ళు నా పీస్‌ని వెయ్యరు. నామీద వుండే ద్వేషమేకాదు. ఇంకా కారణా లుంటాయి. కాని మీ రెందుకు వాళ్ళకి పంపారా అని నా ఆశ్చర్యం.

హరీన్ చటోపాధ్యాయ ఇక్కడ వున్నారు, ఆయన స్నేహితురాలు సునీతతో. వాళ్ళిద్దరూ భగవాన్‌మయం. వాళ్ళు అరుణాచలంలో కుటీరం కట్టుకుంటున్నారుట.

ఇంకా గీతాలు వ్రాస్తాను. కాష్ రాసేండి. అరుణా చలానికి మనుషుల్ని canvas చేస్తున్నాను.

౧౧౨

పేలూరు

11-12-40

My dear George,

I had a dream of a dream, a dream, a great dream. నాకో గొప్పకల వొచ్చింది.

ఆశ్రమంలో చాలా ప్రయత్నాలు జరుగుతున్నాయి. భగవానూ అందరూ ఏదో మందిరానికి, ఉత్సవాలకి వెడుతున్నారు. నాకు భోజనంలేదు. ఒంటిగంటయింది. వూళ్ళోకి వెడదా మనుకుంటున్నాను. భగవాన్ నావంకకి వొచ్చారు. ఏంచెయ్యడానికి తెలీలేదు. సాష్టాంగపడ్డాను. ఆయన అన్నారో, తెలిసేట్టుచేశారో నాకు 'ఆస్థలానికి (మందిరానికి) వెళ్ళు' అని.

తిండిలేకండానే వెళ్ళాను. హాలులో గొప్ప పారవశ్యంలో నృత్యం చేస్తున్నారు భగవాన్ (పాడుతున్నారేమో కూడానూ). ఎట్లాగో కదులుతున్నారు, తేలుతున్నారు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

చప్పున చిన్నవారైనారు. జుట్టు అంత నల్లగా ఎట్లా వుందాఅని ఆశ్చర్యపోతున్నాను.

... ... ...

హాల్లో ఎవరూ లేరు. నేనే వున్నాను. భగవాన్కోసం వెతుకుతో వెళ్ళాను. నవీన సాంప్రదాయంలో అలంకరించుకున్న స్త్రీ కనపడ్డారు. మొహానికి 'క్రీం' పక్కన దాసీతో సహా. ఎట్లాగో తెలుసు ఆమె భగవాన్ అని నాకు. ఆమె దగ్గిరికి వెళ్ళడానికిగాని, తాకడానికిగాని భయపడ్డాను. ఆమె నా చెయ్యి పట్టుకుని, ఓ గదిలోకి లాక్కెళ్ళారు. రంగుల చీరెలతో నిండిన ట్రంకు చూపి 'చూడు, ఇవన్నీ నా బట్టలు' అన్నారు.

మళ్ళీ వొంటరినైనాను. ఆమెకోసం వెతుకుతున్నాను. ఆమె స్తంబందగ్గిరిగా సగం బట్టలు వేసుకొంటూ, సగం

వొంటికీ ఏమీలేకండా వున్నారు. దాసీ బట్టలు అందిస్తోంది. వొణికి వెనక్కి వెళ్ళాను.

అదీ కల.

అరుణాచలం ఎవరెవరం వెడతామో తెలీదు ఇంకా. భగవాన్ ఆజ్ఞకోసం సౌరిస్ చూస్తోంది. నాకు ఆజ్ఞ అయింది.

౧౧౩

ఏలూరు
18-7-40

My Dear Jock,

నాకథల్లో 'సెక్సు' వుందని కోపడతారెందుకు? చలం నిండా 'సెక్సు' వుంటుందనేది యీనాడు తెలిసిన కొత్త విషయమా? 'ఇంకానా? ఈనాటికీనా?' అంటారా, 'మంగమ్మా, కలం' అయిదేళ్ళకిందట వ్రాసిన పాత కథలు. ఇప్పటికైనా సెక్సు వ్రాయడం నేరంకింద వొప్పుకుంటున్నాననికాదు. ఇది వరకంత 'సెక్సు'లో మునిగివుండటంలేదు. అంతే. అదికాక యేవిషయంలోనైనా, పూర్తిగా మునిగి దాని తార్కిక మానసిక పర్యవసానాలదాకా తరిచిచూచేవాడు త్వరలో సత్యమార్గం అందుకుంటాడని నానమ్మకం. సెక్సు నా ముక్తి మార్గం. ప్రతి స్త్రీలావణ్యమూ నాకు భగవాన్‌ని జ్ఞాపకం చేస్తుంది. ఆమె శరీర ఆకర్షణకి అంధుణ్ణి కాను. నామార్గం స్త్రీ అయినట్టు మీ మార్గం శిశువుగాను, మీ కథలనిండా శిశుత్వమని నేను ఆమార్గం నిందిస్తానా? స్త్రీమీది ప్రేమకూ శిశువుమీది ప్రేమకూ అట్టే భేదంవుందా?

అబ్బాయీ, యీ అల్పభేదాలనించి అతిక్రమించండి. సంబంధం దివ్యం.

౧౧౪

ఏలూరు

20-12-40

When you cannot know - you think
When you cannot think - you do
When you cannot do - you talk
When you cannot talk - you weep

నాగీతాలు మీరు చూడడానికే పంపాను. ప్రచురణకు కాదు. అల్లరి భగవాన్ మల్లే. మీరూ అందరూ నవ్వేట్టు నన్ను అచ్చులోకి లాగారు. నవ్వుతున్నారా బాగా మీరు? నేను వ్రాసినవన్నీ కాపీచెయ్యవలసి వొచ్చిందని సణుకు తున్నారా?

శ్రీ శ్రీ అశాంతి అనే పత్రిక పెడతాట్ట. దానికి యీ గీతాలు కావాలిట.

పరిక్షహాలులో, వాచింగ్, వాచింగ్, వాచింగ్, అరుణా చలానికి మాత్రోవ సద్దుతున్నారు భగవాన్ వెడతామన్న మాటే. తప్పకండా రండి.

Hip Hip Hurrah అంటే అర్థం Glory to Bhagavan.

From Dronachalam
Somebody comes to Venkatachalam
To take him to Arunachalam

౧౧౫

ఏలూరు
7-1-41.

My dear Peacock,

అరుణాచలంలో మూడు తమాషాలు జరిగాయి నాకు యీసారి. రైల్లో మాతో కొందరు మహారాష్ట్రులు ప్రయాణంచేస్తున్నారు, చదువుకున్నవాళ్లు. నా స్నేహితులతో అన్నాను "వాళ్ళతో మాట్లాడి వాళ్ళని తిరువన్నామలై కి 'కాన్వాస్' Canvass చేస్తాన"ని. వాళ్ళని పలకరించాను. ఎక్కడికి వెడుతున్నారనివాళ్ళు అడిగితే, తిరువన్నామలై అన్నాను. అంతే. వాళ్ళెక్కడికో వెడుతున్నారు. మేము అరుణాచలం వెళ్ళిన రెండురోజులకి వాళ్ళూ వొచ్చారు. ఏమిటని అడిగితే, మా Plans మార్చుకున్నాము అన్నారు.

ఓ మధ్యాన్నం సౌరిస్‌తో మామూలు ప్రకారం గోల పెడుతున్నాను. 'ఎందుకొచ్చానో ఇక్కడికి ? ఇంటిదగ్గిర వుంటే రేడియోలో 'అకించన్' ఫిడేలు సంగీతమన్నా వింటోవుండేవాణ్ణి' అన్నాను. ఆ అన్నానన్న సంగతే మరిచిపోయినాను. సాయంత్రం బైటకూచున్నాము నేనూ సౌరిస్. భగవాన్ హాలులోంచి ఫిడేలు సంగీతం వినపడ్డది. అటువంటి సంగీతం ఎన్నడూ వినలేదనిపించింది—రాత్రిభోజనందాకా, మర్నాడూ వాయించారు ఫిడేలూ, వీణా, శర్మ సోదరులు. వాళ్ళు నాతో స్నేహంచేసుకున్నారు. నాకేం తెలియకుండానే వాళ్ళతో 'ఎన్నడూ ఇట్లాంటి సంగీతం ఎక్కడా

స్తుందేమోనని భయపడుతున్నాను నేను. నిజంగానే, ఓచిన్న కోతి వొచ్చి, నన్ను కరుస్తానని బెదిరించింది.

'ఆ కోతి భగవాన్ నేను. భగవాన్. అది న న్నెట్లా కరుస్తుంది?' అనుకున్నాను. కాని కరిచేట్టు బెదిరించింది ఆకోతి.

'భగవాన్' అన్నాను ఆకోతిని. బిగ్గిరిగా.

'భగవాన్' అని సన్న గొంతుకతో తిరిగి అంది ఆ కోతి.

అట్లా ఇద్దరమూ 'భగవాన్, భగవాన్, భగవాన్' అంటున్నాము, ఏదో పాఠం చెప్పుకున్నట్టు. నాకు ఆపాఠం సంతోషంగానే వుంది. కాని ఆపితే ఆ కోతి కరుస్తుందనిభయం-ఇంతలో ఓ పెద్దకోతి, మనిషిలాగే వుంది; పెద్ద కుంకంబొట్టు పెట్టుకుంది. నాపక్కనవొచ్చి కూచుంది. మీరు నవ్వుతో ఆ తమాషా చూస్తున్నారు. ఆ పెద్దకోతి 'అది భగవాన్ ఐతే నే నెవ్వరు?' అంది నాతో.

'నువ్వూ భగవానే' అన్నాను.

'ఎట్లాగేం? మే మిద్దరమూ భగవాన్ ఎట్లా కాగలం?' అంది నన్ను బెదిరిస్తో.

మీరు నవ్వారు.

నేను మేలుకున్నాను. దీని అర్థం వ్రాయండి.

౧౧౮

ఏలూరు
5-3-41

**My dear Patience.**

మీరు వ్రాయతగ్గది ఏమీలేక వ్రాయలేదు. ప్రతిభలో మీ కథ చాలా బావుంది. చక్కగా సాధించారు టెక్నిక్.

నాకో కల వొచ్చింది. నేనూ సోరిన్ రైలులోవున్నాము. రైలాగింది. రమణాశ్రమం సమీపంలో వుందిట. కాని మేము కదలలేదు. మాపక్కన వున్న సన్యాసి వొకడు రైలు దిగి, ఆశ్రమానికి వెళ్ళి తిరిగి వొచ్చాడు. ముఖాన దివ్యమైన ఆనందం తాండవిస్తో. తను తీసుకొచ్చిన పువ్వులు అందరికీ పంచిపెడుతున్నాడు. ఆ దృశ్యంతో నాహృదయశూన్యత్వం తలుచుకుని కాలిపోయినాను. నెమ్మదిగా రైలుదిగి నడుస్తు న్నాను. తోవకి రెండుపక్కలా పువ్వులు. నిశ్శబ్దంగా నున్న ఓ ఇంటిదగ్గర ఆగాను. లోపల భగవాన్ ఉన్నారని తెలుసు. కాని లోపలికి వెళ్ళలేదు. ఆ ఇంటిముందు సాష్టాంగంగా నేలమీదపడి 'నాకింక ఆశలేదా? నాకు శాంతి నిచ్చేందుకు నువ్వూ నిస్సహాయుడివా?' అని బిగ్గరిగా వెక్కి వెక్కి ఏడ్చాను. నిద్రలో నిజంగా ఏడ్చాననిపించింది. అక్కణ్ణించి రైలు వెళ్ళి పోతుందేమోననే భయంతో తొరగా వొచ్చాను. రైలు అట్లానే వుంది. అంతే కల.

ధర్మపురి భగవాన్ దగ్గిరికి వెళ్ళారుట. భగవాన్‌కి నమస్కారం పెట్టేదేమిటని తిరిగారుట. కాని సాయింత్రం నిలవలేక సాష్టాంగపడితే, భగవాన్ బిగ్గరిగా నవ్వారుట. ఆశ్రమంనించి తన వూరికి వొచ్చేటప్పటికి తన గదిలో భగవాన్ ఉన్నారుట కూచుని.

ఏమిటి విశేషాలు! ఎట్లా వున్నారు?

చాలా బాధలోంచి నడిచి, క్రమంగా మళ్ళీ స్తిమితపడు తున్నాను.

ఎందుకు అంత దిగులుగా వున్నారు? కాంతిని సమీపించిన మనబోటివాళ్ళు, ఈ శరీరం, ఈ మనసు ఏం చేస్తున్నా గొడవ పడకూడదు. పాపం చేశామని దిగులు పడడం, ఆ పాపకార్యంకన్న, పాపపు ఆలోచనకన్న ఘోరం. ఈ ఇంద్రియాలూ, వాటి జన్మస్థానమూ, అదంతా వాటితోవన వాటిని పోనివ్వండి. మనకేం పని వాటితో?

అదంతా భగవాన్‌కే వొదలేసి, ఆయన్నించి విరహాన్ని కూడా గుర్తించనంత నిర్లక్ష్యంగా వుండండి. ఆయనకి మీరు మరీ దగ్గిరిగా వున్నప్పుడు, మీకు ఆయన ముఖం కనపడదు.

౧౧౯

ఏలూరు
23-4-41

My dear Goose,

ఈ వసంతంతో భగవాన్ అందరియెడలా నిర్దయులైనారు. ఇతరత్రా పనిమీద వున్నారేమో!

చాలా ఖేదంలో వున్నాను, చీకట్లో తడుముకొంటూ. కాంతిరేఖ దర్శనమన్నా ఈ జీవితంలో ఎప్పటికన్నా అవుతుందా అని సందేహం. మన జీవితాలన్నీ ఏదో ఒకవిధాన ఖేదమనే చీకటి కొండగుహామార్గాన నడుస్తున్నాయి. ఆ చివరనన్నా ఏమన్నా కాంతి వుందా? భగవానే సత్యమైతే యీ బాధా, ఖేదమూ మనని కడగడమూ, రుద్దడమూ అయివుండాలి. కాని ఎన్నాళ్ళు? మనలో ప్రతివారూ అడుగుతున్న ప్రశ్నే అది. భగవాన్‌కూడా మనపట్ల అసహాయులా?

మనలో ప్రతివారూ అవస్థపడుతున్నారనడం కొంత ఆశాజనకంగావుంది. Wait, watch, and think not.

౧-౨౦

ఏ లూ రు
25-4-41

My dear Johnie,

ఏం పనిలేకుండానే, ఏదో మీకు వ్రాయాలని. భగవాన్ ఎంత దయచూపినా, నాకు ఇంకా black moods కలుగుతున్నాయి, ఎంతో కారణంలేని నిరాశ (despondence). అప్పుడు భగవానే ఈ వ్యధరూపాన నాకోసం వొచ్చారని పిస్తుంది.

నా జయంలోనే కాదు, నా అపజయంలోకూడా నిన్ను చూడనీ - అవును. కదలని నల్లనిరాత్రిలో, ఆయన కరుణని చూడాలి. నావంటివాణ్ణి ఆయన చాతపట్టారంటే,

You simle and say daily
'Is it your wish to appear through absence'

వొంటరిగా వొదలడం, మళ్ళీరావడం, యీ భారమంతా భగవాన్‌మీద వెయ్యండి. మనకి దూరమైనకొద్దీ, ఈసారి ఆయన స్పర్శ ఇంకా దగ్గిరిగా వుంటుంది మనకి తెలీకుండా మన ఆత్మలో ఏమూల చీకటిగదిలో ఆయన పనిచేస్తున్నారో మనకేం తెలుసు! మన నిట్లా విడిచిపెట్టేసిన వ్యధా తీవ్రత వల్లనే ఏరోజో ఆయన చిరునవ్వు చీకటిని చీల్చుకువస్తుంది. మనం నిద్రపోతున్నంతసేపూ ఆయన మన పక్కనే కూచుని వున్నారని గుర్తిస్తాం, అపుడు.

కాలం అనంతం తొందరేం లేదు. ఎప్పుడూ మనతో వున్నారాయన. మీరు నాకు చెప్పిన సంగతులే, మళ్ళీ మీకు వ్రాస్తున్నాను; ఏడ్చేపిల్ల తన తల్లినించి నేర్చుకున్న మాటల్నే మళ్ళీ ఎక్కిళ్ళమధ్య ముద్దుగా పలికినట్లు.

ప్రతిగంటా భగవాన్‌ని ఒకసారితలుచుకుని, 'మీకోసమే చూస్తున్నాను. మీకు అనుగ్రహం కలిగినప్పుడు రండి. మీరు వొస్తారని తెలుసు. అందాకా చూస్తోవుంటాను. ఏడవను' అనండి.

ఈ నిశ్శబ్దం తప్పకుండా ఆనందాశ్రువుల్లో బద్దలవుతుంది.

౧-౨౧

బెజవాడ
18-5 41

ఏమిటి? మీ గ్రహచారం బాగావున్నట్లు లేదు. అంతే లెండి. తన కెవరిమీద ప్రేమవుంటే వాళ్ళవిషయంలో భగవాన్ ఆధ్యాత్మికంగానేగాని, యింక ఏవిధంగానూ సహాయం చేసేట్లులేదు. తక్కిందంతా వాళ్ళ గ్రహచారానికి వొదిలేసేట్టున్నారు. కాని ఆయన అనుగ్రహంవల్ల ప్రతిసుఖమూ బాధా ఆధ్యాత్మిక కాంచనంగా మారతాయి.

మిత్రులు సూర్యనారాయణగారు మాతోనే వున్నారు. భగవాన్‌తో చాలా intaresting సంభాషణలు జరిపారు ఆయన. వాటి అంతరార్థం తెలుసుకునేందుకు మీరు ఇక్కడ వుంటే బావుండేది. ఆసంభాషణలు భగవాన్ అనుగ్రహించే పద్ధతుల్ని ఇంకా స్పష్టంచేస్తున్నాయి.

భగవాన్ ఆయనతో అన్నారుట,

'నువ్వు సాక్షాత్కారం పొందుతావు. ఇంతవరకు నీకు సహాయం చెయ్యలేదా నేను? చివరికాకా చూశనా?' అని చాలా నిశ్చయంగా మాట్లాడారట.

సారస్వత ప్రపంచానికి, చలం వ్రాతలంటే పిచ్చిపడుతోంది. శుక్రుడి మహత్యం.

సూర్యనారాయణగారి భార్య అడిగారుట భగవాన్‌ని,

'దేవుడున్నాడా?'

'ఉన్నాడు.'

'మీరు చూశారా?'

'నే నెవరనుకున్నావు?' అన్నారు భగవాన్ చాలాగొప్ప pose లో నుంచుని.

'మీరు మనిషిమల్లే కనబడుతున్నారు.'

'నువ్వు నన్ను ఎట్లా అనుకుంటావో, నిన్ను, అట్లా అనుకో.'

విన్నపాలూ యశోదాగీతాలూ మీవీ, భగవాన్‌వీ. ఏం చేసుకున్నాసరే. రెండోసారి మీరు నన్ను ప్రతిభతో Compromise చేయడం వొప్పుకోటంలేదు సౌరీస్.

౧౨౨

ఏలూరు
3-7-41

My dear flower,

బాగా గొప్పగావుంది ఇవాళ.

చాలా మధురంగా వుంది. నాచుట్టూ గొప్ప ఉత్సవం జరుగుతోం దనిపిస్తోంది.

'కృష్ణా- నన్నిట్లా నువ్వు కౌగిలించుకుంటే, పనిని ఎట్లా చేసుకోను?' అంటోంది ఈ యశోద.

ఇట్లా ప్రతిరోజూ ఐపోతే ఓభగవాన్ - పని ఎట్లా!

క్లాసుకి వెళ్ళాలి ... ఎంతబాధ!

భూమ్యాకాశాన్ని నింపుతోంది ఆనందం.

"ఈగని మళ్లే అట్టేపెట్టుకున్నావు. నీ చిత్తమైనప్పుడు తినడానికని."

కనక సమయమయిందాకా ఆగాలి. ఎట్లానూ సాలీడు సమీపిస్తాడు. తినేస్తాడు. ఇప్పుడూ మనకి తెలీకండానే రక్తం పీల్చేస్తున్నాడు.

అంతా భగవాన్ పని. ఇదంతా, మనని ఆయన బైటికి రమ్మన్నదాకా నిర్వహించుకోవాలి.

ఎవరో జ్యోతిష్కుడు నేను రెండేళ్ళల్లో పని మానేస్తానంటున్నాడు. ఎప్పటికో ఇంకా?

౧-౨౩

బెజవాడ
10-8-41

My Beloved,

ఎట్లావున్నారు? Too busy to break silence? నా కొత్త పుస్తకం (ప్రేమలేఖలు) పంపుతున్నాను. ఏళ్ళకి ఏళ్ళు చాలా బాధల్లో గడిపి, గడిచి, చివరికి దీక్షితులుగారి Smiling hand ఎట్లా పట్టుకోగలిగానో చెప్తోంది ఆ పుస్తకం.

నా ప్రాణాయామ సాధనలో కొన్ని భయపెట్టే విషయాలు జరిగితే, కువలయానంద స్వామిగారికి వ్రాశాను. గైడెన్సుకోసం నేను చాలాదూరం వెళ్ళాననీ, ఇక గురువు (Master) లేంది అపాయకరమని వ్రాశారు ఆయన. సాయపడమని భగవాన్‌కి వ్రాశాను. ఈవాళ నా వుత్తరం భగవాన్‌కి అందివుండాలి.

ఈ నాలుగు రోజులబట్టీ టాగూరుగారి అస్తమయం దుఃఖంలో పడివున్నాము – ప్రపంచమూ బెంగాలూ పడుతున్న విచారం రేడియోలో వింటూ. ఇంక ఆ కంఠం వినం.

అడుగు తీసి అడుగు ముందుకి నడుస్తున్నాను. స్పష్టంగా తెలుస్తోంది నాకు, భగవాన్ మీా అహం పునాదుల్ని క్రమంగా నిశ్చయంగా వూడకొడుతున్నాడని. ఏనాడో పైనించి ఆధారంలేని గోడలు కూలగానే, ఆశ్చర్యంతో చూసుకుంటారు – బంధ విముక్తులై.

దసరాల్లో ప్రయాణంకావాలని, అరుణాచలానికి. మీారూ?

౧–౨౪

ఏలూరు
20-8-41

My dear underworld,

నరకంలో వున్నారా? భగవాన్‌ని కలుసుకోవాలంటే నరకమే సరైన స్థలం. ఆయన అక్కడ ఎప్పుడూ వుంటారు.

శాంతి దొరుకుతుందేమోనని N. C. కృష్ణయ్య భగవాన్ దగ్గిరికి వెళ్ళాడు.

భగవాన్ మిమ్మల్ని ప్రాయించబోతున్నారని ముందే తెలుసు నాకు.

ప్రభూ, తీగెలకి శృతిపెట్టేప్పుడు చాలా బాధ.

గానం ప్రారంభించు, ఆనాటి బాధని నన్ను మరిచి పోనొట్టు.

"The pain was great when the strings were being tuned by master.

Begin your music, and let one forget the pain.

Very dull. లోపలికి వెళ్ళే మార్గం పూడిపోయింది. నెమ్మదిగా శాంతంగా గడుస్తోంది కాలం. మనస్సు నాకు ఓ సమస్య అయింది. చదవాలని లేదు. ప్రతిదీ trivial (చాలా చవకగా, స్వల్పంగా) తోస్తుంది; కాని ఆ మనసు ఆహారం లేంది నిలవదు.

కొత్త చైనా వేదాంతి ప్రాసిన The Importance of Living చదువుతున్నాను. వినడానికి మీరు వుంటే ఎంత బావుండేది ?

౧౨౫

అంబశాపురం
18–9–41

My dear Joke,

ఈ వూరు అందంగా వుంది. భగవాన్ నాతో వున్నారు. Oh my beloved to what a fountain of Grace, did you lead me ?

వ్యథనించి ఎట్లా తప్పించుకోగలం. మనం సోమరిగా సుఖంలో నిద్రపోకండా, మనని మన ప్రయాణంలో పొడిచి ముందుకుపంపే ములుకర్రవ్యథ. నా కెంత వ్యథో చూడండి. అర్థంలేని ఈ బదిలీ ఏమిటి? భగవాన్, ఎంత బాధాకూపాన నా దగ్గరికి వొస్తున్నావు? అంటో మనసుని మారుమోగ నీండి. వ్యథపోదు. కాని తెలీకండానే ఆనందానికి తోవపడ్తు తుంది. వ్యథ ఆనందమే అనుకోగలిగితేగాని, మనని వ్యథ వదలదు. ఆనందం తరవాత ఆనందానికి దగ్గిరవరం వ్యథ. అందుకునే మీకుకాని నాకుగాని శాంతి లేదు.

వ్యథ పడడానికి మీకు కారణాలున్నా వున్నాయి. నా ఈ వ్యథకి కారణమే లేదుకద! తన లోతులలోనించి వ్యథని సృష్టించుకునే గొప్ప శక్తి ఎప్పుడూ వుంది, నామనసుకి (ప్రేమలేఖలు చూడండి) మీ వ్యథకి కారణమూ నివృత్తీ వున్నాయి. నా వ్యథకి భగవాన్ తప్ప ఏది గతి!

నా విచిత్ర నలీయం అందిందా మీకు? నేను కొత్తలంక యేలీ, అనే మహమ్మదీయ యోగిదగ్గిరికి వెళ్ళాను. చాలా గొప్పవాడు & genuine. 'మీకు చక్కని దర్శనం ఇచ్చా రండీ?' అన్నారు అక్కడివాళ్ళు. ఆయన మాట్లాడలేదు. ఆయన దృష్టిని పొందడంకూడా కష్టం. ఆయనకి బైటచూపు లేదు. ఆయన చుట్టూ దొంగలు. అమలాపురంలో ఆయ నంటే ఎవరికీ లక్ష్యంలేదు. ఆయనకి గొప్పతనం ఇదివరకు వుండేది. ఇప్పుడు పోయిందంటున్నారు.

cheer up old one; we are getting neare.

౧–౨౬

బెజవాడ
27–9–41

My dear Leau,

దేనిమీాదా అనురక్తి లేదు. దేంటోనూ సంతోషంలేదు. ఏం చెయ్యడానికీ ప్రోత్సాహంలేదు. జీవితం మొద్దుబారి పోయింది. మిగిలిందల్లా నాలోపలి వ్యథా, బైటిబాధలూ, on these term Life is uubearable.

శివశంకరశాస్త్రీగారు నాపుస్తకం (ప్రేమలేఖలు) బాపుంది అనడం మిమ్మల్ని సంతోష పెట్టడానికి.

నెల్లూరు మీాకు హాయిగా వుంటుంది లెండి. అక్కడ భగవాన్ చేలాలు చాలామంది వున్నారు.

What more can l say even to poor dear Bhagavan, who is so helpless? He is for people like you who don't doubt hin.

౧–౨౭

బెజవాడ
18-11-41

My dear Lucky,

అరుణాచలం? ఎక్కడవుంది అది? ఎప్పుడూ వినలేదే ఆ పేరు? క్రిస్మస్‌లో నేను ఎందుకు వెళ్లాలి అక్కడికి?

నేను బళ్ళో పనిలోచేరి సంపాయించుకుంటేనేగాని దేనికీ డబ్బులేదు. 'మహర్షి గారి సందేశం' పోస్టుద్వారాగాని, అంత కన్న ఉన్నత మార్గానకాని, నాకు రాలేదు.

నాకు మళ్ళీ పనిలో చేరాలని లేదు. పనిలో చేరకండా manage చేసుకో గలిగితే! సంపూర్ణమైన సోమరితనాన్ని అభ్యాసం చేసుకుంటున్నాను. చదవను, మాట్లాడను, వ్రాయను అట్లా పూరికే వుంటాను.

నేను ఆనందవాణిని చూడలేదు. పత్రికలు చదవను, ఆ అలవాటు ఎప్పుడో పోయింది.

'మహర్షి' అందింది. పోస్టువాళ్ళకి చలం పురాతన పుస్తకాలు కావాలి. గృహలక్ష్మిపుస్తకాలు కాదు. వంటచేయడం, పూరగాయలు పెట్టడం, పనులు నాకు ప్రస్తుతం. ఎంతో వ్రాద్దామని ఆశపడ్డాను. మానంగా బాధపడుతున్నాను. నాకేం శక్తిలేదు. ఏ ప్రయత్నమూ చెయ్యలేను.

౧-౨౮

బెజవాడ
15-11-41

My dear Chirp,

Your letter is sweet and joyful. There is no repose in this heart. I am dry, no joy either in mundane or heavenly things. Body and mind are quite comfortable. Yet what is wanting? And how to get it? and get it permanently.

నాకు reprints ఇవ్వని 'ప్రతిభ' కోసం నా మానం నేనెందుకు వొదులుకోవాలో అర్థంకావటం లేదు. దీక్షితులు గారు అడిగినాసరే!

ఏమైతేనేం, ఏమీ ప్రాపేశక్తిలేదు. నేనెక్కడికీ కదలను. ఈ కవి సమ్మేళనాలకి అసలు కదలను. నాకు డబ్బువుంటే భగవాన్ దగ్గరికి వెళ్ళాలని వుంది. ఆకోర్కెకూడా బలంగా లేదు.

ఆరు రోజులే ఈస్టరు శలవలు. భగవాన్ దగ్గరికి వెళ్ళి రావడానికి పరిపోవు. భగవాన్నే మన దగ్గరికి రప్పించు కుందాం.

కాలం వృధాచెయ్యడం అనేమాటకి అర్థంలేదు. వృధా చెయ్యడాన్ని enjoy చెయ్యడం నేర్చుకోవాలి.

౧-౨౯

బెజవాడ
8-2-42

My dear boy,

శరీరం మనసు ఆత్మ అవన్ని జబ్బు. మీాకల ఎంతో అందంగా దీనంగా వుంది. భగవాన్ నానించి చాలాదూర మైనారు. ఆయన ఇష్టం వొచ్చినప్పుడు నన్ను సమీాపించడం ఆయనకే వొదిలాను. దేంటోనూ ఆసక్తిలేదు. ఎందుకు బతకడం? ఎందుకు చావడం? ఇదంతా అర్థంలేని వ్యవహారం. ఒక్కబాధే నిజం.

మెదడు గడ్డకట్టింది. సూర్యనారాయణరావుగారు ఆధ్యాత్మికంగా గొప్ప ఐపోతున్నారంటే నాకు గర్వం. భగవాన్ దగ్గరికి ఆయన్ని పంపడానికి తోడ్పడ్డ చివరి గడ్డి పరక Last straw నేను. ఆయనకి అవసరంకన్నానాలుగు రెట్లు

మహిమ సంపాయించమనండి. ఎందుకంటే మన ఖరారు నామాప్రకారం, ఆయన సంపాయించిందేదో, మీకూ నాకూ, చెరిసగం పంచాలి.

దీక్షితులుగారికి Selection grade ఇవ్వడం అధికారులు ఉపేక్షచేశారు. పైగా చలానికిఇచ్చారని ఉత్త వదంతి విన్నారు ఆయన.

What do you mean? Who will give me selection grade? తన హృదయం మంచితనంలో, నామీద యిష్టంలో, ఆ గ్రేడ్ వొచ్చి నాకు మంచి చేస్తుందనే నమ్మకంతో, కోర్టు—లో(పోతరాజు) వెంకట్రావుగారు అని వుంటారేగాని... నేను ఏబలహీనపు నిముషానో ఆ సెలెక్షను గ్రేడ్ సంగతి ఆలోచించి పోతానేమోనని, ఆభాషాపక్షికి వెళ్ళలేదుకూడాను. కనక దాని విషయమై బెంగలేదు.

You are one of the chosen. So you were ignored. మన అధికారులు! వాళ్ళహృదయూ లెంతనలుపో, మీకేమన్నా తెలుసా?

ఆరోగ్యంగా, శాంతంగా వున్నాను. నూనె వేసిన చక్రాల మీదమల్లే ఏశబ్దమూ లేకుండా సాగుతోంది జీవితరథం.

నాకు బాంబులు వినపడవు. నేను పత్రికలు చదువను. రేడియోని మాట్లాడనీము మాయింటో.

నా జీవితంలో చాలా గొప్పవిశేషం జరిగింది. మీరు ఇష్టపడరు. కాని నన్నుగర్వంలో తృప్తిలో ముంచుతోంది. దానిసంగతి మనం కలుసుకొన్నప్పుడు.

౧౩౦

బెజవాడ
8-3-42

My dear goose,

ఎన్నాళ్ళు మీకోసం ఇల్లా ఎదురు చూడడం ? వొచ్చి కనపడకండానే వెళ్ళిపోయినారా?

ఇక్కడ భవిష్యత్తులోకి చూడగల ఆయన ఒకరున్నారు. లజపతిగారని నిన్నరాత్రి మాయింటికి వొచ్చారు. ఇదివరకు నించీ నన్నెరుగుదురు. స్త్రీలోలుడుగా, ఏదో, ఏదోగా - ఆయన అన్నారు. 'మీ సాన్నిధ్యంలో నాకు శాంతీ, ఆనందం కలుగుతున్నాయి. నాకు వొక రుషి కనపడుతున్నారు. మీ భవిష్యత్తుని డెస్టిని ఆయన పరిపాలిస్తున్నారు. I see you within the aura of his spiritual influence. వారి ఆధ్యాత్మిక ఆవరణలో మీరు కనబడుతున్నారు. ఇక సంవత్సరంలో మీలో మార్పు జరుగుతుంది. ధనము ఉద్యోగాధిక్యతా ఇవేమీ లేవు మీకు. రెండేళ్ళతరువాత బహుశా మీరు పనిమానేస్తారు. ఇంకముందు జీవితమంతా నిర్మలం శాంతంగావుంటుంది. ఆధ్యాత్మిక ఔన్నత్యాన్నందుకుంటారు. మీరిప్పటికీ చాలా మారినట్లు తెలుస్తోంది నాకు' అన్నారు. ఏమంటారు మీరు.

౧౩౧

Bezwada
1-5-42

Thought of my lazy hours,

I am worried. I have come to the end of my patience. I wish to get away (from the job)

ఈ ఎండాకాలం A. R. P. వల్ల మమ్మల్ని కదలకూడదన్నారు. ఈవిధంగా యీసారికూడా భగవాన్ నన్ను దూరాన వుంచేశారు.

ఆంధ్రపత్రికలోని భగవాన్ మీది వ్యాసం చాలా బావుందంటున్నారు, మిత్రులు. మీకల చాలా బావుంది. తప్పకుండా ఇంకా బలంగాచూస్తారు ఆయన నాట్యాన్ని మీ హృదయంలో. ఈ దరిద్రుడికల చూడండి.

మధ్యాహ్నం ఆశ్రమానికి వెళ్ళాను. అందరూ భోజనాలు చేస్తున్నారు. భగవాన్ దర్శనంకోసం సర్వాధికారి అనుమతిని కోరాను. భోజనాలు కానీండి అన్నారు ఆయన. నేను అవమానపడ్డట్టు అనుకున్నాను. ఆలిస్యానికి చిరచిరలాడుతో నుంచున్నాను. కాని ఆలోచిస్తున్నాను.

'సరిగా దీన్నే జయించామంటారు భగవాన్ - నా అహం ప్రాముఖ్యత.'

ఈలోపల ఒక (చదువురాని ముసలి) స్త్రీ లోపలికి వెళ్ళి గుమ్మంలో నుంచుని భగవాన్‌ని చూస్తోంది. ఆమె మొహం మీద గొప్ప శాంతి.

'ఇట్లాంటి మనుషులు భగవాన్‌లో ఏం చూస్తారు?' అనుకున్నాను.

నాకు భగవాన్ దర్శనం కానే లేదు. మెళుకువవొచ్చింది ఈ హెడ్మాస్టరుపని అనే రోగంతో మూలుగుతున్నానని తప్ప ఇంకేం లేదు వ్రాయడానికి. మీకు బదిలీ అయి రారాదా ఇక్కడికి? కాని అక్కడ ఆశ్రమానికి దగ్గరగా వున్నారు; ఆయన భక్తులమధ్య భగవాన్‌కి దగ్గిరగాకూడా వున్నారేమో.

నా భార్యగారికీ, శాయిబాబా ఫొటో కావాలిట. భగవాన్, శుక్రుడూ, ఇద్దరూ కలిసి, నన్ను నాశనం చేస్తున్నారు. ఇద్దరికీ విరుద్ధం. బంగారమూ, మోహమూ, నా చేతుల్లో బూడిద. పవిత్రమైన బూడిదగా మారుతున్నాయి. నేను ఏది తాకితే అది విభూది అవుతోంది.

జులైలో పని వొదిలెయ్యాలని ప్రయత్నం.

ఓ భగవాన్ సాయపడండి.

౧౩౨

బెజవాడ
26-6-42

My dear bridegroomer,

ఎక్కడవున్నారు? మీకు పెళ్ళికొడుకు అక్కర్లేదా? మర్యాదగా? మీ అమ్మాయికి పెళ్ళిచెయ్య దలుచుకోలేదా?

చాలాదినాలనించి కారణంలేని మనోవ్యథతో గడుపుతున్నాను కాలం.

ఈ చీకటిరోజుల్లో నేను బైటికి వెళ్ళకుంటే వినే సహృదయు లెవరన్నా కావాలనిపిస్తోంది.

మళ్ళీ బడి, పిల్లలు, నన్నిష్టపడని టీచర్లు, నన్ను ద్వేషించే అధికార్లు. ఎంతకాలం? ఎంతకాలం ఇట్లా?

సూర్యనారాయణగారితో చాలా ఆహ్లాదంగా గడిపాము యీ కాసినిరోజులూ.

ఈ శరత్కాలపు సూర్యుడిమల్లే, నాడిగులు మబ్బుల్ని చీల్చుకుని ప్రకాశించడానికి ప్రయత్నిస్తున్నారు భగవాన్. Poor old Bhagvan with his broken collar-bone.

భగవాన్‌కి బంగినపల్లి మామిడిపళ్లు ఇష్టమని చెప్పారు సూర్యనారాయణగారు. పంపాను.

ఏం విశేషాలు?

౧౩౩

బె జ వా డ
15-7-42

My dear boy,

చాలా బాధగావుంది కాలం. మిమ్మల్ని 'అమీనా' అనే కథ ఒక్కటే చదవమన్నాను.

Chalam is the most discussed topic throughout krishna.

అదీ శుక్రుడు చేస్తున్నపని - చాతగాని శుక్రుడు! చాతనైతే భగవాన్ దగ్గరకువెళ్ళి నాకోసం ప్రాధేయపడరాదూ?

మీరుపంపిన భగవాన్ జాతకచక్రాన్ని మిత్రుడు వెల్లటూరిగారికి చూపించాను ఆయన 'యీ జాతకం sexual

perverted' అన్నారు అంతటితో వూరుకున్నాను. ఎవరి జాతకమో చెప్పలేను. ఆ రాత్రే వెల్లటూరువారికి కలవొచ్చింది. నేనూ, ఆయనా, రాఘవాచారిగారూ భగవాన్‌కి ఎదురుగా కూచున్నామట- రాఘవాచారిగారు వెల్లటూరిగారితో,

‘ఈ సాయంత్రం నా జాతకచక్రం మీకు ఇచ్చారు. కాని మీరు ఎవరిదో కనుక్కోలేక పోయినారు కద!’ అన్నారుట. భగవాన్ నవ్వుతున్నారు. భగవాన్‌తో ఏ సంబంధమూ లేని వెల్లటూరిగారికి ఈ కల!

౧౩౪

బెజవాడ
5-8-42

My Dear old horse,

ఓ వృదయం భగవాన్ నాతోవుండి తరువాత ఓ నెల నన్ను మానుస్తో వుంటే ఏం సంతోషం?

ఎప్పటికి ? ఎప్పటికి ? ఎప్పటికి ?

ఇట్లా ఎదురు చూస్తోవుండడం ఎంతబాధ.

ఎక్కడా సంతోషంలేదు. ఈ నీలం ఆకాశంలోకూడా.

౧౩౫

బెజవాడ
20-10-42

(Written under G. V. 's directions)

Dear Deekshitulu Garu,

How can the postal chaps refrain from delivering Deekshitulu's greetings? Indeed Vijaya Dasmi was a happy day for 'Nanna' and every one of us. He is too happy to write letters. So I had to write. He is lying on the carpet lazily enjoying his Hookah and gazing at the beautifull blue sky with its glorious white feather-clouds travelling leisurely in the golden sunshine.

All are happy and healthy like this Rutu.

yours ever loving
Che

౧౩౬

బెజవాడ
6-11-42

My Dear Hindu Muslim,

భగవాన్ చాలాదూరంలో వున్నారు. నా వేపు ఎప్పుడు తిరుగుతారో తెలీదు కాని నే నేమీ గోలపడటంలేదు, ప్రస్తుతం. నా 'బిలవెడ్' కోసం ఎదురు చూడడానికి అనంత కాలం వుంది.

౧౩౭

బెజవాడ
9-11-42

My dear educational service,

భూతల స్వర్గంనించి తిరిగి వొచ్చి ఈ వాళే మీ వుత్తరం చూశాను. గడిచిన పదిరోజుల్లో నా పెదిమలు అనుభవించిన మాధుర్యం తరువాత, నా హుక్కా ఇవాళ చాలా రుచి లేకండా వుంది. నా అదృష్టాన్ని చెప్పుకునేందుకు మీరు ఇక్కడవుంటే బాగుండుననిపిస్తోంది.

క్రిస్మస్‌లో మాహామహిమ అరుణాచలం వెళ్ళాలని ఆలోచిస్తున్నాము.

During Xmas we are planning a grand Exodus to Arunachalam.

Bhagvan has been brilliant during these days. No hookah for me on Deepavali day, but an infinitely sweeter touch of divine perfume. Health batter. Too busy to think of body now.

How am I? I am walking on the evanescent clouds of these sarath days.

For how long more is the question.

౧౩౮

బెజవాడ
8-12-42

My dear Sun - ray,

మధురమైన మీ లేఖ. నా సంగతి మీకు నేను explain చెయ్యగలిగితే బావుండును కాని నా చాతకాదు.

నా జీవితమంతా సౌందర్యం కోసం వెతుకుతున్నాను. ఈ నాటికి నా తృప్తితీరా దొరికింది. ఈ రెణ్ణెల్లూ నే నేమీ వ్రాయలేదు, చదవలేదు, మాట్లాడలేదు. వూరికే కల కంటున్నాను. కలలు మాత్రం మానడం చేతకాలేదు. కొన్నాళ్ళు ఏదో వొస్తుందని ఎదురు చూడడం, కొన్నాళ్ళు ఏమీ లేదని సందేహించడం- నేను పనిపట్టి వెతకడం కూడా లేదు. ఏం లాభం? అరగంట శాంతి కనపడి – రోజల్లా చీకట్లో కూచోవలసి వొచ్చేప్పుడు,

అందుకనే నాకు పని అంతభారం, ఎప్పుడు వొస్తుందో నని ఎప్పుడూ గుమ్మంలో నుంచోవాలని నాకోర్కె.

నా సమస్య మీకు అర్థమవుతోంది కాదూ? నా అంతర్వాణి తెరుచుకుంటేనే తప్ప, నానించి నేనుతప్పించుకోలేను.

I cannot cheer up. Even joy is a pain to me. I am sad and gloomy until Beauty enters my life - what have I to live for and sing for ? Yes, I am leading the most indolent life possible. There is no joy form within until my Beloved takes me up.

నేను సంతోషపడలేను. సంతోషంకూడా నాకు బాధ. నేను దిగులుగా, ఖేదంగానే వుంటాను - సౌందర్యం నా జీవితంలో ప్రవేశించిందాకా. నేను దేనికోసం బతకాలి. దేనికోసం పాడాలి? అవును - చాలా సోమరిగా కాలం గడుపుతున్నాను. ఆలోకపు నా ప్రియురాలు నన్ను ఎత్తుకున్నదాకా, నా లోపల్నించి సంతోషం లేదు.

మీరూ, సూర్యనారాయణ గారూ అదృష్టవంతులు. మీకు భగవాన్‌లో విశ్వాసం, నాకు లేదు. భగవాన్ నా స్వంత ఆత్మ. నాఆత్మ చీకట్లో కూచుని నాకు సహాయపడని స్థితిలో వుంటే, భగవాన్ మాత్రం ఏం చెయ్యగలరూ? ఎవరూ నాకేమీ చెయ్యలేరు.

ఇట్లా కాచుకుని వుండడమూ, సారంలేని యీ వ్యథా ఇవే నా సర్వస్వమూ అనీ, వాటికి అర్థంవుందనీ, ఈ చీకటిగొందు కాంతి ద్వారంలోకి మార్గమనీ విశ్వాసం ఒక్కటే మిగిలింది. అదే భగవాన్ నా కిచ్చిన వాగ్దత్తం.

Through chance I skipped through your 'దొరికాడు' full of child - like and childish sentimental strains. Too many words, but a child's affectionate fable. At some spots it was very touching, as touching as only you could be - sweet with smiles and happy tears.

దేశానికి నా కథలమీద పిచ్చెక్కించి, ఎప్పటివో పాత పత్రికలు గాలిస్తున్నాయి కథల కోసం. కాయితంలేని యీ

రోజుల్లో ప్రతినెలా పుస్తకాలు అచ్చయ్యేవి నామమాత్రమే. శుక్రుడి మహిమ ఏమంటారు.

My vicit to Bhagwan is sinking into complications. Poor old Bhagwan I am involving him in my frmily and extra - family entangle ments. But He ought to have known better then to claim Chalam as his own. His genuineness and his morals are being questioned - as Chalm's guru.

౧౩౬

బెజవాడ
22_1_43

My dear Editor,

సరే, ముందు నేను వ్రాసిన ఉత్తరాల నన్నిటినీ తెలుగు చెయ్యాలి. ఇబ్బందులు (ఉత్తరాలు ప్రచురించినందువల్ల) నాకు లక్ష్యంలేదు. కాని ఇతరుల్ని గాయపరచాలనిలేదు.

నా ప్రేమవ్యవహారమా! అబ్బాయ్, అది సులభంగా తుడిచివెయ్యగల వ్యవహారంకాదు. మీకు తెలిస్తే, మీరు చూసివుంటే!

భగవాన్‌తో నేను సరిగానే వున్నాను. ఆధ్యాత్మిక దర్శనం మనకి కొన్ని నెలలలో పని. మహాఅయితే ఓయేడు రెండేళ్ళు పడుతుంది. ఏం పరవాలేదు.

ఆమె కళ్ళలో నాకు భగవాన్ కనపడతారు. నేను అపరాధం మాట్లాడుతున్నా ననుకోండి.

నా అంతరాంతరమైన అవసరాన్ని గుర్తించి, తన అపారమైన దయతో నాచివరి తృష్ణను తీర్చ కనికరించి, ఆమె సుందరరూపాన్ని ధరించి నాచేతుల్లోకి వొచ్చింది భగవానే!

నా అనుభవం ఆధ్యాత్మికం కాకపోతే ఇంక ఏదీకాదు.

నేను మిమ్మల్ని కలుసుకుని, నే ననుభవించి మీకు చెప్పగలిగితే!

౧౪౦

బెజవాడ
27-1-43

My dear Lord of Kanigiri Hills,

ఛార్జి తీసుకున్నాను. ఎన్నాళ్ళు ఈవుద్యోగంలోవుంటానో నన్ను వుణ్నిస్తారో చెప్పలేను. కనిగిరి హోటల్లో ఇంకా ఇప్పటికీ చింతపండుపచ్చడీ, దోసకాయపచ్చడీ మార్చి మార్చి అవే పెడుతున్నారా?

నేను వ్రాతలమధ్యవుండగా న న్నీ పనిలోకి ఈడ్చారు.

నా వుద్యోగపు గొడవనంతా చూడడానికి ఓగుమాస్తాని పెట్టుకున్నాను. ఈ పద్ధతి ఎట్లాపనిచేస్తుందో చూడాలి.

౧౪౧

బెజవాడ
1-8 43

My Dear Cooker,

ఈ ఇన్ స్పెక్టరుపని నా కొకనిమిషం విశ్రాంతిని వొదలడంలేదు - దేహానికికాదు, మనసుకి. నేను మొన్న అంటు

న్నాను, 'నేను బకాసురుణ్ణి. పొద్దున్నే లేచి ఈవాళ్ళ ఏబడిని కబళిద్దామా అని యోచించుకుంటాను' అని.

కాని సిద్ధంగా వుంటున్నాను. ఏ నిమిషానన్నా సరే, యీపనిలో వూపిరాడనప్పుడు బైట పడదామని.

కాని, అబ్బాయి, ఇదోసంగతి వుంది. నేను దౌర్భాగ్యంలో అణిగిపోయ్యే ఉపాధ్యాయుడికి కొంత ప్రశమనం ఆత్మగౌరవం నేర్పుతున్నాను. నే నీబాధలో కొట్టుకుంటే నేం, యీదిక్కుమాలినవాళ్ళకి సహాయం చెయ్యగలిగినన్నాళ్లు !

భగవాన్ మహిమను చెప్పడానికని నాఅనుభవంలోంచి మీకు వ్రాస్తున్నాను. ఆయన భక్తులు, చివరికి మీరైనా సరే, వొప్పుకోరు ఇది ఆయన మహిమ అని. భగవాన్ ఇట్లాంటిది చేశారంటే భగవాన్నికూడా వొప్పుకోను, ఇదీ ఆయన మనకి చూపే అనుగ్రహాలంత గొప్పదనీ.

ఆమె ఇక్కడ కొన్నిరోజులనించి వున్నారు నాతో. గడిచిన రెండురోజులనించీ మా మధ్య తగాదా వుంది, నాకు ఘోరమైన వ్యథకలిగిస్తో. తగాదాకి నేను కారణం కాదు. కాని సంగతులు అట్లా జరిగాయి. ఆమె చాలా భీష్మించుకున్నారు నిన్నరాత్రి. నేను నిస్సహాయంగా, ఏంచెయ్యలేక బాధ పడుతున్నాను.

ఇంక మాస్నేహం ఆఖరనీ, ఆమె వెళ్ళిపోతారనీ భయపడుతున్నాను. మామూలు ప్రకారం నా కష్టాలు భగవాన్ పాదాలముందుపెట్టి ప్రార్థించాను.

'ఏది ఎట్లాజరగాలో అది జరగనీ. కాని ఆమె విరహా గాన్ని సహించగల వైరాగ్యం, బలం ఇయ్యి' అని, తెల్లార కట్ట ఆమెకి ఈకల వొచ్చిందిట.

నామీాది విరక్తితో ఆమె వూరికి ఆమె వెళ్ళిపోయినారు. తల్లి వొచ్చిందని సంతోషంతో పిల్లలు ఆమెచుట్టూ గుమి గూడారు.

(ఆమెకి భగవాన్ పేరు తెలుసుగాని ఆమెకి ఆయనమీాది భక్తిగాని కోర్కెగాని లేదు. ఆయన సంగతి ఏమీా తెలీదు. నే నెప్పుడూ ఆయనసంగతి ఆమెకి వ్రాయను, ఉత్తరాలలో కూడా.)

అట్లా కూర్చునివుంటే, నిశ్శబ్దంగా భగవాన్ లోపలికి వొచ్చి వాళ్ళదగ్గిరిగా కూచున్నారు. తలెత్తి చూడడానికి భయపడ్డారు, ఆమె. నామూలాన ఆయన వొచ్చారనిపించింది ఆమెకి.

'ఎందుకు వొచ్చేశావు!' అన్నారు భగవాన్.

'నా పిల్లలు వొంటరిగా వున్నారని' అన్నారు ఆమె.

'నిజంమాట్లాడు. అతనితో పోట్లాడి వొచ్చేశావు. అవునా?'

ఆమె మాట్లాడ లేదు.

'అతనికి వ్యధ కలిగించకు. అతనినించి తెంచుకోకు. కలుపుకో. కలుపుకో' అన్నారు.

ఆమెతలెత్తిచూస్తే ఎవరూలేరు ఆస్థలంలో. ఈకల చెప్పి ఆమె అన్నారు నాతో—

'చాలా కోపంగా వుంది ఆయన ముఖం. భయంకరంగా వున్నారు. భగవాన్‌కి నీమీద ఎంత ప్రేమ!' అని.

అవును ఆమెకన్న భగవాన్‌కే ఎక్కువ ప్రేమ నాపైన! ఎంత ప్రేమ నీకు భగవాన్ నామీద!

అధికార్లకి కోపం వొచ్చి చలాన్ని భీమునిపట్నానికి దూరంగా మార్చారు.

౧౮౨

భీమ్లి
10-11-47

ఇక్కడ మనుషులు—బళ్ళో టీచర్లు నన్నెంతో దయతో చూస్తున్నారు. ఈ ప్రదేశం చాలా అందంగా వుంది. పురాతనపు పెద్దబంగాళాలో ఉన్నాము. వెంకట్రావుగారు రిటైరు అయినప్పుడు మీ రిక్కడ హెడ్మాస్టరుగా రాకూడదా? పిల్లలూ, నారాణీ వున్నా మిక్కడ.

నేను (ఉద్యోగపు) పనిని ఉపేక్ష చేశానంటా రేమిటి? ఎప్పుడూ నేను పనిని ఉపేక్ష చెయ్యను. కాని అధికార్ల వెనక తాళం వెయ్యనన్నాను.

ఇక్కడ ఆనందంగా వుండబోతున్నా ననిపిస్తోంది. మన పాలిటికి భగవాన్ ఎప్పుడు ప్రసన్నులౌతారు? ఆత్మసంగతి చాలా నిరుత్సాహంగా వుంది.

౧౮౩

కా కి నా డ
11-12-43

My dear corn flower,

నెలనించి ప్రతిరోజూ మీకు వ్రాయాలని కూచుంటాను. భీమ్లీలో చాలా ఆత్రుతతో ప్రేమ లేఖను నిరీక్షిస్తోవుంటే దానిస్థానే మీ వుత్తరం వొచ్చింది. ఆ నిరాశవల్ల మీకు వెంటనే వ్రాయడం మరిచి పోయినాను. ఆ వుత్తరం రాకపోయిన లోపం తీర్చుకునేందుకు ఇక్కడికి వొచ్చేశాను. మళ్ళీ ఎప్పుడు కదలగలనో తెలీదు.

మీరు వొప్పుకొనేట్టయితే, భీమ్లీకి మీకు బదిలీ కావడానికి చాలా వీలువుంది. మీరు వొప్పుకుంటే చాలు. తక్కినదంతా నేను చూసుకుంటాను. యుద్ధంభయం మీకు లేదనే నమ్మకం. అదిగాక భీమ్లీ యుద్ధఅపాయంలో సూటిగాలేదు.

భీమ్లీ సంగతి నేను వ్రాయనక్కర్లేదు. అద్భుత మైనంత అందమైన స్థలం. నదీ, సముద్రమూ, దినమంతా, రతి ఉపరతులతో మైమరచి వుంటాయి. వాటినిచూస్తే ఈర్ష్య నాకు. భీమ్లీలో ఆధ్యాత్మికమైన శాంతి ఆవరించి వుంటుంది. నా వలెనే, శాంతిని సౌందర్యారాధనవల్ల సేకరించింది యీ వూరు. ప్రతి సందూ, పురాతన స్వప్నాలను కంటో వుంటాయి.

Each lane and well sleeps in ancient dreams of bygone days of duch occupation-of the sett-

lers first wonder at the beautiful sight of this tropical fort.

నన్ను తన దగ్గిరిగా వుంచుకోడమే భాగ్య మన్నట్టు చూస్తున్నారు వెంకట్రావుగారు. ఇంత గొప్పలోనూ, చాలా బాధలో గడుపుతున్నాను కాలాన్ని. నేనూ, లీల గారూ, వారి అబ్బాయీ, షౌ, చే, చిత్రా, పకపకా వొచ్చాము భీమ్లీకి. ఆనంద శిఖరాన్ని అందుకున్నా ననిపించింది. కాని భగవాన్ కనిపెడుతూనే వున్నారు. త్వరలోనే వారి అబ్బాయిని తీసుకొని కోపంతో వెళ్ళి పోయినారు లీలగారు. చిత్రకి కురుపు లేవడంవల్ల చిత్రా, పకపకా, చే, బెజవాడ వెళ్ళిపోయినారు. నేను, షౌ మిగిలాము అక్కడ.

అశాంతినీ బాధనీ భరించలేక షౌ తో ఇక్కడికి వచ్చాను. మళ్ళీ ఎప్పుడు భీమ్లీ వెడతానో, అసలు వెడతానో లేదో, తెలీదు.

You are in Hell (You say). I have been there (in hell) for the last three months. I say you come on to old Bhimli, you will be alright.

లీలగారి యింట్లో వున్నాను ఇక్కడ. రెండు రోజులనించి శాంతీ సౌఖ్యమూ.

మీరు నా మ్యూజింగ్సు చదవాలని వుంటే 'చే' కి వ్రాయండి పంపుతుంది. మీ పేరు అక్కడక్కడ తటస్థిస్తుంది వాటిల్లో.

నానించికూడా భగవాన్ చాలా దూరమైనారు. కాని నా ప్రియురాలి నేత్రాలలో చాలాసార్లు నాకు దగ్గర అవుతారు ఆయన.

మీరు నాకు వ్రాసిన వుత్తరం, సరిగా నేను మీకు పూర్వం వ్రాసే ఉత్తరంలాగు ధ్వనిస్తోంది.

౧౪౮

భీమునిపట్నం
31–12–43

My dear,

మీరు నాకు సూర్యనమస్కారాలు నేర్పారు. భగవాన్ దగ్గరికి తీసికెళ్ళారు, కాని అన్నిటికన్న అమూల్యమైన విద్యని మాత్రం దాచేసుకున్నారు చెప్పకండా ఇన్నేళ్ళకూడా— చెట్టెక్కడంతప్ప తక్కిన విద్యలన్నీ పులికినేర్పిన పిల్లివినారు. నశ్యం పీలవడం నేర్పారుకారని నా గొడవ.

నా తలనొప్పులు దీనితోగాని కుదరవని, ఒకడాక్టరుగారు, నశ్యం పీలవమన్నారు. నశ్యంవల్లజనించే ముక్కుమంట, శరీరానికీ, ఆత్మకీ గొప్ప శాంతి నిస్తోంది. ప్రస్తుతం అదే నా శాంతి!

చాలాయుగాలనించి మౌనంగా వున్నాము మనం. ఇంత కాలమూ నేను చాలా నాజీవితంలో ముఖ్యమైన కాలం లోంచి నడుస్తున్నాను—స్వీయచరిత్రలో—ప్రపంచ చరిత్రలో యీ యుద్ధంకన్న ముఖ్యమైన విషయాల్లోంచి.

ఆమెని కలుసుకుని రెండేళ్ళయింది సరిగా. అంతకు కొద్ది దినాల ముందు నాకు వచ్చిన కల జ్ఞాపకం వుంది కదూ మీాకు ?

భగవాన్ అందమైన స్త్రీ రూపాన నాకు కనిపించారు. ఈ నాటికీ - మరీ ఎక్కువగా ఈనాడు - నాకేమనిపిస్తోందంటే భగవానే, ఈ అద్భుత సన్నివేశాన్ని ఏర్పాటుచేశారనీ—అది నేను ఏ సత్యాన్వేషణ, సౌందర్యారాధన ద్వారా సాధన చేస్తున్నానో, ఆ మార్గాన నా యాత్రని సులభం చేసేందుకు ఏర్పాటుచేశారనీ అనిపిస్తుంది.

ఈ రోజుల్లో నాకు పుష్పాలు, కాంతి, సెలజలం ఆమె శరీరంలో సార్థకాన్ని పొందుతున్నాయనిపిస్తోంది. రాత్రి పగటిలోకి బద్దలు కావడం - తృష్ణపడే నాకళ్ళకి, ఆమె ముఖాన్ని శరీరాన్ని ప్రత్యక్షంచేసే ఒక్క ఉద్దేశ్యంతోననే; చీకటి ముసుగు ప్రపంచంమీాద ఆవరించడం, మమ్మని మధురమైన ముఖమల్ తెరలక్రింద కప్పి కాపలించుకోవడానికనే ! తెల్లారకట్టే శుక్రుడు ఈనాడు మా ఆనందమనే కొత్త మెరుగుతో వెలుగునుపొంది ప్రకాశిస్తున్నాడు. కాల మంటే, మా హృదయ ఘాతాల లయతో, చిందులు తొక్కే గానం.

అద్భుతమైన యీా కథని వినడానికి మీారు నాతోవుంటే బావుండు ననిపిస్తుంది ఎప్పుడూ. తెలుసుకోవలసిందీ చర్చించవలసిందీ చాలావుంది. మా ఇద్దరినీ యీా అనుభవం చివరి ఔన్నత్యానికి తీసుకుపోవాలి. పోదా, మాలో ధ్వనించే

యీ ఆనందసత్యానికి ఆధ్యాత్మిక ఔన్నత్యం చాలా భిన్నమై ఉండాలి. ఆర్టిస్టులు, ప్రియులు, రుషులు కనే కలల అంత్యసాఫల్యానికి భిన్నమైవుండాలి. నా ఆనందాన్ని పాడాలని, ప్రచురించాలని నా హృదయం పిపాతహలాడుతోంది. కాని ఆనందం పైకి తెలియ చెయ్యడం ఎట్లా? మధురమైన ఆమె పెదవులమీదనో, తప్పితే, భగవాన్ పాదాలమీదనో మౌనమైన ముద్దులవల్లనే కాని! నాకు అదీ ఇదీ సమానమే!

౧౮౫

భీమునిపట్నం
7-1-44

My dear disappointer,

భీమ్లీ మీకు కనిగిరికన్న దూరమా? ఏ నిమిషాన నేను ఇక్కడినించి లేచిపోతానో అనే భయమే నాకు లేకపోతే ఇక్కడికి బదిలీ కావడానికి మీరు ఒప్పుకున్నదాకా మీకు విశ్రాంతి నిచ్చేవాణ్ణికాదు. నిన్నరాత్రి లీలగారికి ఓ కల వచ్చింది. వినండి.

ఆమెకి చాలా జబ్బుగావుంది. నేనూ, షా, చే, ఆమెని చూడ్డానికి ఏఊరినుంచో వొచ్చాము. చే, కిందికివెళ్ళి మాకు భోజనం తెచ్చింది. చాపలకూరా, అన్నం. నేను తింటో ఓముద్దని లీలగారిని తినమంటాను. ఆమెని డాక్టరు పాలుతప్ప ఏమీ తాగవద్దన్నాడు. అందుకని తిననన్నారు అన్నం. 'నేను పెడుతున్నాను ఆరోగ్యం చేస్తుంది. తినమంటాను' నేను. ఇంతలో వారి ఇంటి పురోహితుడు, బహుశ్రోత్రియుడు

కేసన్నగారు ఆమెని చూడ్డానికి వచ్చి కుర్చీలో కూచు న్నారు. సినిమాల్లో మల్లే ఆయన తలలోంచి భగవాన్ ముఖ్ఖ కనిపిస్తోంది. లీలగారికీ, కేసన్నగారి మల్లేనే మామూలు కుశల ప్రశ్నలు వేశారు ఆయన. నేను లీలగారిని ఆ చాపలకూరముద్ద తినమంటోనే వున్నాను. ఆ వొచ్చిన ఆయన 'ఆయన తిన మంటోవుంటే తినవేం?' అన్నారు.

'జబ్బు చేస్తుంది' అన్నారు లీల.

'చెయ్యదు తిను. ఆయనచేత్తో పెడితే ఆరోగ్యం' అన్నారు ఆయన.

'భగవాన్ తినమంటోవుంటే తినవేం?' అన్నాను నేను.

'ఇదేమిటి కేసన్నగారిని భగవాన్ అంటారు ఈయన? నాకు సందేహం కాని చలానికి భగవాన్ అని స్పష్టమే' అనుకుంటో అన్నంతిన్నారు లీల.

'వారికి భోజనంపెట్లా? వారు తినతగింది మనఇంటో ఏం లేదే?' అన్నారు లీలగారు.

'భగవాన్, మీరు భోజనంచేస్తారా?' అని నే నడిగితే చేస్తా నన్నారు.

'చాపలుతప్ప ఏంలేదు ఎట్లా?' అంటారు లీల.

'ఏం భగవాన్!' అన్నాను.

'చేపలు అలవాటులేదుగాని, తింటాను' అన్నారు భగ వాన్.

నేను కిందికివెళ్ళి చేపలకూర అన్నం తీసుకొచ్చి భగవాన్ ముందు పెట్టాను. అంతా అనుభవంగా ముళ్ళు తీసుకొని తిన్నారు ఆయన.

'ఇదేమిటి? శ్రోత్రియుడు, కేసన్నగారు, అసహ్యపడకుండా చేపలు తింటున్నారు' అనుకుంటారు లీల. భోజనం అయిన తరువాత లీల 'నశ్యంకావాలా? చుట్టకాలుస్తారా?' అన్నారు ఆయనతో.

'అలవాటు లేదుగాని చూస్తాను రెండూ తే' అని నశ్యం పీల్చి చుట్టకాలుస్తున్నారు ఆయన. లీలగారు ఆశ్చర్యంతో చూస్తో, నాతో, 'మీకు నశ్యం అలవాటయింది. ఆయన్ని చూసి మీరు చుట్ట ప్రారంభిస్తారా?' అని అడిగారు.

అట్లా నిశ్శబ్దంగా కూచున్నాము. సాయంత్ర మయింది. చీకటి మసకల్లో భగవాన్ నుంచున్నారు. కేసన్నగారికి పంచా చొక్కా మాయమైనాయి; గోచీ మాత్రం వుంది.

'చీకటి పడుతోంది, నేను వెడతాను. మరిచిపోయాను, నీ కోసం పళ్ళుపట్టుకొచ్చాను. నీకు ఆరోగ్యం కలుగుతుంది' అని ఆ గోచీ నడుంపక్క మడతలోంచి నల్లద్రాక్షపళ్ళు తీసి బల్లమీద పెట్టారు, లీలగారికోసం భగవాన్.

'మమ్మల్ని తీసికెళ్ళండి భగవాన్ మీతో' అన్నారు లీల.

'బలం పట్టనీ, వెనకనించి రండి' అని వెళ్ళిపోయినారు.

So my dear boy we are not so far off faste approching some thing profound.

ఢిల్లీ రేడియోవాళ్ళకి మీ కథలూ, నాటకాలూ కావాలిట.

నా కథలు, గుజరాతీ, మరాటీ, ఉర్దూ, పంజాబీలోకి నన్నడక్కుండానే తర్జుమా అయినాయని తెలుసా? కన్న

డంలో, అరవంలో చాలాకాలంనించి వాటి పరిచయ మయింది. నా పుస్తకాలు కొన్ని మూడింటో ఎడిషను పడ్డాయి. అంతా శుక్రుడు. ప్రస్తుతం నేనూ, షా, లీలగారూ, ఆమె కుమారుడు, ఇక్కడవున్నాం. త్వరలోనే మేము చెప్పివచ్చి మళ్ళీ కూడేఆశతో. మీరు ఇక్కడికి వస్తారని వెంకట్రావుగారు ఎంతో ఆశపడ్డారు. మీరే హెడ్మాస్టరు అయితే, తాను ఆ పనిలోంచి తగ్గడానికేమీ అభ్యంతరం లేదని వ్రాసి ఇస్తా మన్నారు. భగవాన్ దగ్గరికి వెళ్ళివచ్చాక తరువాత చాలా నెమ్మదిగా మంచిగా ఆయన మారారని అందరూ అంటు న్నారు.

'మీ భగవాన్ పనోయ్, అదంతా'అన్నారు, డి. ఇ. ఓ. సత్యనారాయణ నే నిక్కడికి ఒచ్చాక. వెంకట్రావుగారిలో మార్పువుంది. మౌనం నిస్సంగత్వం ఎక్కువైనాయి. ఇది వరకు లీలగారు రోజుకి కనీసం ఎనిమిదిగంటలు శరీరాలంకా రానికి (Toilet) వినియోగించేవారు. ఒంటిమీదగాని, ఆ గొప్పచీరలమీదగాని, ఒక్క పలుకు దుమ్ము ఉండకూడదు. ఇప్పుడు ఒక్క గంట శ్రద్ధన్నాచూపరు వాటిమీద. ఆస్తి, వ్యాజ్యాలు, నగలు, పీటన్నిటిమీదా పట్టుపోయింది. మీరూ, నేనూ, ఈ నరకంలోంచి వదుస్తున్నా మన దగ్గిరికి ఒచ్చినవాళ్ళకి, క్రమంగా భగవాన్ తన సంగీతం వినిపించే వేణువులై పోతున్నాము. అల్లరి అడావిడిచేసేలీల ఇప్పుడు భగ వాన్ పాదాలవద్ద మౌన ఆరాధకురాలు.

భగవాన్ మనయెడల ప్రసన్నుడు. నే నెప్పుడు యీ అలంకారంగానీ, వ్యవహారాలుగాని, బంధువుల్నిగాని మాను

కోమని లీలగారితో అనలేను. భగవాన్, సంగతి ఆమెతో మాట్లాడలేను. నా పద్ధతులకీ, అభిప్రాయాలకీ ఆమె చాలా వ్యతిరేకం. ఆమె ఎప్పుడూ అంటారు, భగవాన్ నన్ను స్త్రీ పురుషులకి నిరుపయోగం లేకుండా చేశారని.

Yet she clings to me as to a relic, and Bhagavan does the rest.

౧౮౬

భీమ్లీ
8-3-44

My dear Sukker,

మీరు అనే నామీద మెచ్చుకునే వ్యాసాన్ని నేను చూడలేదు. మెప్పులూ, తిట్లూ, ఇక్కడికి నాకు చాలా దూరం.

మీరు నా మ్యూజింగ్స్ తగినంత మెచ్చుకోలేదని నా రాణీగారు డిజప్పాయింటు అయినారు. మీమీద కోపం కూడా వచ్చింది. 'కాని ఆయన్ని ఏమీ అనలేను. ఆయన ఏకాదశి చదివాను. దానినించి ఆయన ఎంతో సూనృతమూ మార్దవమూ గల మనిషిఅని నాకు తెలుసు' నన్నారు ఆమె.

'ఆయన్ని చూస్తే మీరు మరీ ఏమీఅనలేరు. ఆయనపని పిల్లవాడు' అంది సౌరిస్.

'పరులకి ముల్లుగుచ్చుకున్నా సహించలేని మనిషిలాగు అనిపిస్తారు' అన్నారు లీల.

ఎండాకాలమూ! ఎండాకాలం ఎక్కడ వుంటానా? జూన్ నెలాఖరులోపల భీమ్లీ ఒదలి వెళ్ళడం ఘోరపాప మంటు

న్నారు. నేను ఎట్లా ఉన్నానా? ప్రేమ అంటే ఏమిటో ఇప్పు డిప్పుడే అర్థం తెలుసుకుంటున్నాను, నేను. ఇతరులకి ప్రేమ విలువల్ని ఇన్నేళ్ళు బోధించవలసిన నేను ఈ ప్రేమబాధల్ని భరించలేక, చాలాసార్లు తప్పించుకు పారిపోవాలని చూస్తాను. కానీ అగ్నిపరీక్షని ఏ ఉద్దేశ్యంతోనో నాకు భగవాన్ కటాక్షించారు. దానితో నిలబడేశక్తికోసం తపిస్తుంటు న్నాను. కాని ఎంతబాధ!

౧౪౭

మునిపట్నం
17-4-44

My dear Dukke".

This breeze is unimag'naliy delicious. కాని ఊరునిండా సిపాయిలు, సోల్జర్లూ.

నే నెట్లావున్నానా? strugg·ing and struggling to get some light at this anmeshing and enthral. ing Romance.

ఇంకో కల నా మిత్రురాలికి. ఇద్దరంఘోరంగాపోట్లాడు కుంటున్నాము. దేనికీ కాదు. ప్రేమకోసం. ఒకరికియింకొకరం ఇంకా ఎక్కువగా కావాలనే కోర్కెవల్ల. కోర్కెల్లో మమ్మల్ని నాశనం చేసుకోడానికేమో!

ఆ పరిస్థితులలో ఇదీ ఆమెకు కల. నేనుపెద్ద సంతర్పణ చేస్తున్నానట. బ్రాహ్మలకి, అందులో యాభై యేళ్ళుదాటిన వాళ్ళకి. లీలగారు వచ్చి,

'ఇదేమిటి పూర్వాచారానికి దిగుతున్నారే !' అన్నారు. (ఆ మధ్య ఓకలలో ఒకనల్లని బ్రాహ్మడు ఆమెకి భూత భవిష్యత్తులు జాతకం చెప్పాడు.)

'ఈ బ్రాహ్మలలో నాకు జాతకంచెప్పిన బ్రాహ్మడు కొమ్ముచెంబు పట్టుకుని ఒస్తున్నారు.

ఆయన వెనక ఎవర్నో తీసుకుని ఒస్తున్నారు' అన్నారు లీల గారు.

'ఎవ రేమిటి ? భగవాన్ !!!' అని అరిచాను నేను.

వాళ్లిద్దరూ వచ్చికూర్చున్నారు. నేను అన్నీమరిచి భగవాన్ కేసి చూస్తున్నాను.

'వారికి భోజనం ఏర్పాటుచేయించరేం?' అన్నారు లీల.

'ఇక్కడ ఎట్లా? భోపల ఏర్పాటు చేయిస్తాను' అన్నాను.

'మీరూ భోజనంచెయ్యండి వారితో' అన్నారు లీల.

'కాదు నేను వడ్డిస్తాను భగవాన్ కి' అన్నాను.

'పొద్దు ఎక్కుతోంది. మీరూ తినండి' అన్నారు లీల.

'అదే బావుంది. నువ్వూ తిను' అన్నారు భగవాన్.

మేము ముగ్గురం భోజనంచేస్తున్నాము. లీలగారు ఒడ్డిస్తున్నారు.

ఎన్నో పదార్థాలని ఎంతోసేపు మెచ్చుకుంటో తిన్నారు, భగవాన్.

'చాలాబాగా భోజనంచేస్తారే మీరు, భగవాన్. అట్లా తినేవాళ్ళని చూస్తే నాకు చాలాఇష్టం' అన్నారు లీలగారు

భోజనం చేశాక బూరెలూ, నెయ్యి ఇచ్చారు లీలగారు.

'ఇవినాకు పడటంలేదు.ఇప్పుడువొద్దు'అన్నారు భగవాన్.

అని బూరెల్ని తింటున్నారు భగవాన్. (కొద్దిరోజుల కిందట మాయింటో బూరెలు వండుకున్నాము. లీలగారు నన్ను ఆబూరెల్ని భగవాన్‌ఫోటోకి నైవేద్యంపెట్టమన్నారు. నేను నవ్వాను.)

'మొన్న మేము బూరెలు వండుకున్నాము. మీకు పెట్ట మంటే యీయన పెట్టలేదు' అన్నారు లీలగారు.

'అవును,అతనికి తెలుసు,నాకు బూరెలు పడవని. అయినా, ఆరోజున నాకు జబ్బుగావుండికూడాను' అన్నారు భగవాన్.

సంతర్పణపందిట్లో తాంబూలం వేసుకుంటున్నారు వాళ్ళిద్దరూ.

ఆ ముసలాయన నశ్యంపీలుస్తూ భగవాన్‌కి ఇచ్చారు. భగవాన్ పీల్చారు.

'భగవాన్! నశ్యం పీలుస్తారా?' అన్నారు లీల.

'ఈమధ్య ప్రారంభించారు. నేను పీల్చినన్నాళ్ళు నవ్వారు. ఆయనే ప్రారంభించారు' అన్నారు ముసలాయన.

'నేనూ అంతేనండీ. చలంగారు పీల్చినన్నాళ్ళూ నవ్వాను. మొన్ననే తలనొప్పి వస్తే నేను పీల్చిచూచాను' అన్నారు లీలగారు.

'జాతకం చెప్తారా' అని లీలగారు ముసలాయన్ని అడిగారు.

'భగవాన్ ఉన్నారు మరి' అన్నారు ఆయన.

"చెప్పించుకోండి. నే నుంటేనేం? నా కవేమీపట్టవు" అన్నారు భగవాన్.

'పోయినసారి జాతకం చెప్పేప్పుడు సందేహించాను. మీరూ చలంగారూ కలిపి వుండ రేమోనని. విడిపోతారను కున్నాను ఇంక పరవాలేదు' అన్నారు ముసలాయన.

'ఇంత తెలిసినవాళ్ళం మేమిద్దరం ఎందుకండీ, అట్లా పోట్లాడతాము' అని అడిగారు లీలగారు, భగవాన్ని.

'మనుషులు; మనుషులు!' అని గొణుక్కుంటున్నారు భగవాన్.

'ఇంకా పెళ్ళిముహూర్తరోజులు(చే పెళ్ళి)బస ఇక్కడఏర్పాటు చేయిస్తాను' అన్నాను నేను.

'పెద్దు! చాలాపని వుంది. చాలామంది చూస్తోవుంటారు నాకోసం. వెళ్ళాలి నేను. ఎక్కడికీ కదలను భోజనానికి. సంత ర్పణ వెళదాం రమ్మన్నాడు ఈయన. రానన్నాను. కాని చలంఇంటో పండుగ అంటే వొచ్చాను.'

అని లీలగారితో భగవాన్ లేచి వెళ్ళారు. అదీ కల.

ఈ కలలో విషయం అంతా ఒదిలినా, సంభాషణలలో సహా స్పష్టంగా జ్ఞాపకంవుంటో ఈ కలలు లీలగారికి రావడం ఎంత వింత! భగవాన్తో సంబంధంలేని లీలగారికి, భగ వాన్తో నాసంబంధం తెలీని లీలగారికి!

సంతోషించండి.

౧౭౮

షిమ్లా
7-5-44

My dear Goose,

Can you imagine ever the thrilling touch of this breeze!

భగవాన్‌తో నిండిపోయినాను. చాలా బలంగల దృష్టిని ప్రసరించారు నామీద. వూగిసలాడే నా ప్రణయమందిరాన్ని ఏం చెయ్యతలచుకున్నారో భగవాన్ !

నేను ఎన్ని పుస్తకాలకర్తనో, అవి ఎన్ని ఎడిషన్లు పడ్డాయో మీరు ఆలోచించుకోగలరా? మన లేఖలుమాత్రం ఇంకా కొరతపడివున్నాయి ప్రచురణ కాకండా.

బెజవాడ బైలుదేరుతున్నాము.

౧౭౯

బెజవాడ
19-5-44

My dear coucher,

ఏం వ్రాయను మీకు? నేను బతికిలేను. సూర్యనారాయణ గారు నెల్లూరుమనుష్యుల కబుర్లు చెప్తూతో భగవాన్ సంగతి మాట్లాడుతూతో మూడురోజులున్నారు ఇక్కడమాతో.

భగవాను ఎక్కడవున్నారు? Poor Bhagavan నిజంగా సహాయం చెయ్యగలరా ఆయన? రాత్రింబవళ్ళు ఆయన్ని

తలచుకుంటాను. ఈ దురదృష్టపు కాలంలో నా అవసరానికి ఆయన రాయిలాగు కదలకండా ఉన్నారు.

నారాణి నాపై అసంతుష్టిపడ్డారు. తన ప్రేమఅర్హతను సంపాదించేందుకు నేను ఎదగాలన్నారు. నా కెవరు సహాయం చేస్తారు? ఎవరు దిక్కు? నాలోని భగవానుతోనే ఆమె తగాదా అని చాలాసార్లు భయమేస్తుంది నాకు.

పుస్తకాలా! పుస్తకాలద్వారా నేను డబ్బుచెయ్యడమా! ఆ ప్రచురణకర్తల మొసళ్ళని బతకనీండి నాపుస్తకాలమీాద. వాళ్ళని పిండడం నాకు మనస్కరించదు. నేను నా ఉద్యోగం మానేసుకున్నప్పుడు నా కా అవసరం పట్టవచ్చు.

౧౫౦

బెజవాడ
22-6-44

My dear couch,

ఇంద్రలోకంలో నెలవుండి, వచ్చానిక్కడికి. మనమందరం భగవాన్ని ఒదిలేస్తే, ఆయన ఉపేక్షచేసి ఏడిపించేందుకు ఆయకి ఎవరుంటారు? ఇప్పుడు ఆయనపూనిన యీరాత్రి మానం అంతా ఆనందాశ్రువులుగా ఓనాటికి బద్దలవుతుందనే నా నమ్మకం.

మీాబడి తెరిచివుండాలి. మళ్ళీ ఆపాఠాలు, మాదిరి పాఠాలు! ఆతుక్కు! ఈబళ్ళు తగలబడా!

౧౫౧

బెజవాడ
23-9-44

My dear josmine,

రేడియోలో 'ఓ రామా సేకు' అని పాడుతున్నారు. 'రామా' అని విన్నప్పుడల్లా మీరు జ్ఞాపకమొస్తారు.

కాలం చాలాహాయిగా గడుస్తోంది. ఇచ్చేవాడు, తీసుకొనేవాడు అనే పద్ధతిలో చూసినప్పుడు భగవాన్ తప్ప కండా ఇచ్చేవాడు మరెకి, ఆయన పెద్ద అబద్ధికుడు కాకపోతే. చాలాదగ్గిరిగా అనేకసార్లు ఆయనహస్తం కనబడుతుందినాకు

౧౫౨

బెజవాడ
7-9-44

My dear kruger,

నిన్న సాయంత్రమే నా మిత్రురాలి దగ్గిర్నించి వచ్చాను. ఆమె చాలా జబ్బుగావున్నారు.

ఆ కరుణకుమారెవరో నన్నుచూడ్డానికి రాలేదు. నా జోస్యుడు, త్వరలో నాకు గొప్ప ప్రమోషన్లు రాబోతున్నాయని చెపుతున్నారు, నాకు. అదేనిజమైతే మన విద్యాశాఖకి ఎంత ఆపద రాబోతోంది!

ఈలోపల శుక్రుడు లావణ్యమైన స్త్రీశరీరాలలోకి నన్ను లాక్కెడుతున్నాడు.

౧౫౩

బెజవాడ
23-9-44

My dear Tad-pole,

నాస్నేహితుడు ఆ- వ్రాసిన ఉత్తరాన్ని, దానికి నేను వ్రాసిన జవాబుకాపీని పంపుతున్నాను మీకు. వాటినుంచి మీరు తెలుసుకోవచ్చు నా ఆత్మస్థితి.

మొన్న సౌరిస్‌కి ఓకల వచ్చింది. 'నువ్వు ఆ మెకళ్ళల్లో భగవాన్ని చూడగలిగితే, నువ్వుపడేశ్రమకి అర్థముంది. అట్లాకాకపోతే, వ్యవహారం తన్నేసుకొని ఒచ్చెయ్యి' అని మీరు నాకు వ్రాసినట్టు.

I am going through hell and heaven simultaneously. I entreat Bhagavan to give me strength to become the master of life or weakness to become a blind slave to it.

ఆ వ్రాసిన ఉత్తరం

My dear Venkatachalam,

నీ ప్రేమగలఉత్తరం. వయస్సు మనుష్యులరక్తం చల్లబడేస్తుందనుకున్నాను. కాని నీరక్తంలోంచి ఏమి వేడి తగ్గినట్లు లేదు. D. H. లారెన్సువంటి సృష్టివేదాంతులూ, రచయితలూ మనిషి శరీర మానసిక ఐచ్ఛిక శక్తులు అతని కామబలంమీద ఆధారపడివుంటాయన్నారు. నీలో ఇదివరకుకన్న కళాసృష్టి ప్రోద్బలం తగ్గడంచేత, నీ కామప్రోద్బలం

తగ్గింది, అనుకోవలసింది నేను. కానీ చూడగా నీలో శక్తి అనేకముఖాల చెదరడం, పంచుకోడం మాని ఒకొక్క విషయం లోనే కేంద్రీకరించివుండాలి. కానీ ఇంకా ఆ వ్యవహారం అసహ్యం పుట్టలేదా? ఈ కామవ్యాపారాలలో అంతూ, మొహంముత్తరం, తృప్తికడం అనేవిలేవా నీకు? నీ కొత్త స్నేహితురాలు నీకన్నా మనోవికాసంలో చాలాతక్కువ స్థితిలోవుంటని నా ఉద్దేశ్యం. అట్లాంటప్పుడు ఆమె స్నేహంలో ఆమెతో కాలంగడపడంలో నీమనసుకి ఏమితృప్తి కలుగుతో ఉండదు. రంగు, పరిమళం, దేహాలస్పర్శ, శరీరపుఒంపులూ, వాటికి సహాయపడే చీరలు, నగలలోంచివచ్చే శారీరక సంతృప్తిని నే నర్థంచేసుకోగలను. అవన్నీ కోర్కెని మండిస్తాయి. లిబిడో కామవాంఛని రేపుతాయి. కానీ కొంతకాలంతరవాత ఒకొక్కప్పుడు కామవ్యాపారం కాగానే, తెలివిగల వాళ్ళలో, సీరియస్ మనుష్యుల్లో, అసహ్యమూ, విముఖత్వమూ కలుగుతుంది. ఒకొక్కప్పుడు సంభోగం జరుగుతూ ఉండ గానే విముఖత్వమూ, అసహ్యమూ. నాకు నీ అనుభవం తెలుసుకోవాలని ఉంది. ఎందుకంటే తెలుసుకోతగ్గవిషయం నీసంగతి.

నిజమైనఅందం, దానివెంట ఎన్నడూతగ్గని నశించని సంతోషాన్ని తీసుకురావాలి. When a thing of beauty is not a joy for ever, you have to suspect the quality of the beauty. అట్లాతీసుకురానిదాని అందం విలవని సందేహించాల్సి వుంటుంది. పై మెరుగులుచూసే

చవకవస్తువులోని అందం బుద్ధివున్న మనుషుల్ని తృప్తిపరచ లేదు. ఈవిషయాన్నే ఇంకోవిధంగా చూడవచ్చు. అంద వికారంగాని, అసంపూర్ణంగాని ఒకఅందంలో సంపూర్ణంలో ఒకభేదంగా ఒక ప్రత్యేకమైన ఛాయగా చూడవచ్చు. అట్లాంటప్పుడు ఆలోపం ఆవస్తువుకి ఎక్కువ అందాన్నిస్తుంది, తగ్గించదు. కానీ ఇట్లాంటి దృష్టితో చూడాలంటే జీవితా న్నంతా సంపూర్ణంగా, ప్రపంచమంతా పూర్ణంగా తీసు కోవాలి, అంతేగాని అందమైనదాన్నే ఏరుకునే దృష్టి ఉండ కూడదు.

Sex had its part in my life. రంగులు, వొం పులు, ముఖవర్చస్సు, వస్త్రాభరణాలు, ఇవన్నీకాక చెప్ప లేనిదీ, ఇదిఅని నిర్ణయించలేనిదీ, టివెనక వీటిని మించి వుండే లావణ్యవిశేషం, వీటినన్నింటినీ ఎరుగుదును. ఒకొ్క క్కప్పుడు శాస్త్రరీత్యా reactions గమనించడానికే experiments చేశాను. కానీ తత్ఫలితంగా చేదుగా, అసహ్యంగా Feal అయ్యాను. ఇంకా నా సంస్కారంవల్ల, విద్యవల్ల, రోగభయంవల్ల, మరికి అసహ్యంవల్ల చాలా దన్నే నేను అణుచుకున్నాను. మనిద్దరం కొంతకాలం కలిసి వుండే వీలుచిక్కితే బావుండును అని రాశాడు ఆమిత్రుడు.

అతని వుత్తరానికి ఇట్లా జవాబు రాశాను.

బెజవాడ
18-9-44

My Dear A—,

నీ వుత్తరం చాలా సరదాగావుంది. కానీ సాధారణపు మనుష్యులమల్లేనే నువ్వూ యోచించావే అని కొంచెంఆశ్చర్య పడ్డాను. Any how you write so frankly charmingly sympathetically and detachedly. ఇట్లాంటి ఉత్తరాలు చాలా అరుదు.

ఇప్పుడు కెల్లాకకష్టం మూడునెలలయింది. నీ ఉత్తరం, నన్ను సంగతులన్నీ, స్పష్టంగా సునిశితంగా యోచించేటట్టు చేసింది. కానీ ఇప్పటికీ సరిగానీ, నాకుగాని స్పష్టమయ్యేటట్టు రాయలేననుకుంటాను మనసులోపలికి చూసుకుంటే సంగతులు స్పష్టమవుతాయి. ఇంకా వెనక్కివెళ్ళిచూశామా, దాని సబ్ కాన్షస్ స్థితిని చేరుకుంటాము. అక్కడ అంతా complicated and hazy ఇంకాదాని వెనక ఎక్కడో సత్యం వుంటుందిగావును. (I am fully aware)

నీ వుత్తరంలో సంగతుల విషయం.

మొదటనే ఓసంగతి ఒప్పుకోవాలి మనం. నాది అసాధారణమైన భావోద్రేకరసాపూర్ణమైన నిర్మాణంలాగు వుందని. స్త్రీప్రేమతప్ప, జీవితానికి నాకు వేరే అర్థంలేదు. ఎప్పుడూ లేదు. ప్రేమ చాలునని నేను తృప్తిపడ్డనాడు, ఈలోపల ఆధ్యాత్మిక ప్రేమను నేను పొందగలిగితేనేతప్ప, జీవితంనాలో అంతమౌతుంది. నేను ప్రేమించని సమయాల్లో బతికిలేనన్న మాట, ప్రేమను చాలా సంకుచితమైనఅర్థంలో తీసుకున్న

ప్పుడుకూడా, ఇకముందు ఏ ప్రేమవ్యవహారం రాబోతుందా అనే నిరీక్షణతోటే బతుకుతూ ఉంటాను.

అంతకన్న దేనికిబతకాలో నాకు అర్థంకాదు. మనుషులు సంపాయిస్తో తింటో మాట్లాడుతూ ఇట్లా ఎందుకు బ్రతుకు తారా ? అని సందేహం.

వ్రాయాలనే కుతూహలం నాలో తగ్గలేదు. జ్ఞానవంతు ణ్ణయ్యాను. సంగతులు తెలుసుకున్నాను.

All artists are unbalanced and restless. The creative urge is only their maladjustment to life. They are gifted and cursed with such high tension and uncontrolable surge of emotion that they fail incoordination which the ordinary man feels so easy to effect.

ఆర్టిస్టులు అశాంతితో కొట్టుకుంటారు. వీళ్ళకి స్థిమితం తక్కువ. జీవితానికి వాళ్ళల్లో సమన్వయం కుదరకపోవడమే వారి కళాసృష్టికి మూలం. సాధారణులు సులభంగా చేసు కోగల సమన్వయం వాళ్ళకి చేతకాదు, వాళ్ళలో కలిసే భావోద్రేకం వల్ల.

ప్రస్తుతం నాకు ప్రేమనించీ, తన్మయత్వంనించీ పరిపూర్ణ మైన వింత శాంతి, ఆనందం కలుగుతో వుండడంవల్ల ప్రత్యే కంగా శృంగారంలో నన్ను నేను బహిరంగపరచుకునే express చేసుకునే అవసరం కలగడం మానేసింది. నా జీవితమే ఒక శృంగారగీతం అయిపోయింది. అదిగాక అంత

రాంతరమైన మనోభావాల్ని ప్రపంచపు మలినదృష్టికి విప్ప డంలోగల వానిటీ Vanity (అల్పత్వం) చాలా బలంగా తట్టాయి నాకు.

ప్రేమ అనుభవానికి, మనోవిశిష్టత్వం చాలా అనవసరం. స్త్రీలో అత్యంతరం కూడాను. ఈనాటి ప్రజలి పట్టిన గొప్పకీడ అది. మన మనోశ్లాఘలవల్ల ఆలోచనలవల్ల తృప్తిని పొందగలుగు గొప్పగా నటిస్తున్నాము.

It is a low kind of sublimation of our healthy instincts we are too weak, indolent and respectable to take full enjoyment from our instincts. Nothing is more bare and avoid than intellectual life, unless it adds glamour throws more light and opens new avenues to our physical enjoyment.

మనసులోవున్న సహజమైన కోర్కెల్ని తృప్తిపరచుకోనే చాతగానిమార్గం యీ మనోప్రాబల్యాన్ని మాసుకొని బోర్ల పడటం. మన భౌతికానందాన్ని మెరుగుపెట్టి కొత్త కాంతి నిచ్చి, అనుభవించేందుకు నూతన మార్గాలను చూపుతేనే గాని, మనసుకొట్టే పట్టీలని చూస్తూకూచోటమంత సాధ్యత్వం ఇంక దేంట్లోను ఉండదు.

కాని ఈ రెండు ఆనందాలకీ అంతవ్యత్యాసముందా! అంద మైన అమ్మాయి బొమ్మని అనుభవిస్తే అది చాలా కళావం తమూ, సంస్కార వంతమూ. ఆ బొమ్మకి ఆధారమైన

అమ్మాయివంక అంతగట్టిగా చూశారా, అది యింద్రియ లోలత్వమూ నీచ భౌతిక కాంతమూ అయింది.

'ఇంక సెక్సువిషయాలలో తృప్తి అనేది లేదా?' అని నువ్వు నన్నడిగితే, జీవితంలోనూ తృప్తి అనేది వుందా అని అడుగుతాను. సెక్సుతో తృప్తి పడవచ్చు, మొహం మొత్త వచ్చు, కాని అందం రొమాన్సు ప్రేమ వీటిల్లో చాలుననే అంతం వుంటుందా? ఆ అంతమే కలిగినవాడు, అదేమృత్యువు. లీలగారి విషయం నువ్వు ఎవరినించి విన్నావో నాకు తెలీదు. ఆమె మనో దృష్టి, ఖడ్గపు అంచువలె తళుక్కుమని వెలుగుతుంది. ఆమె యిన్ట్యూషన్ అంతరంగిక దృష్టి హృదయం లోకి దూసుకు వెడుతుంది.

The last shade of falsehood, semblance hesitation, or worldliness, is easily laid bare; a slip in a word, a covering over a cowardly act are mercilessly expossed before her sight.

She says love is never blind. It flares in a thousand search lights. But since it is love that unveils, the blemishes are understood and kissed away in tenderness.

నిజం. ప్రేమలో మనోసునిశితత్వం చాలా అనవసరం. నేను మేధావంతులలో ఒకడనని నువ్వు నిస్సందేహంగా ఒప్పుకుంటావు ఈ నాటికీ ఇట్లా శృంగారంలో పడిపోయి వున్నాను. నేను చాలా కష్టమయిన పుస్తకాన్నిగాని, జ్ఞానులైన మిత్రులతో సంభాషణనిగాని సంతోషంగా నడపగలను.

మళ్ళీ నేనూ ఆమే వరసగా పదిహేను రోజులు, ఇంకో వ్యక్తి కనబడకుండా లోకం విడిచి తలుపులు మూసుకుని ఒకరితో ఒకరం జీవిస్తాము, గాలీ కాంతీ ఆకాశంవలె తప్ప సహాయంతు ఉండా. చదవడం, ఎక్కువ సాహిత్యం, సెక్సు ఏవీ అనేకం కాదు మా మధ్య. ఇద్దరం కలిసి ఒంటరిగా ఉండడంలోని ఆనందం. నేను ఆమెకళ్ళ అగాధాల్లోకి చూస్తే నా మంత్రంలో ఆమె కట్టుపడడం!

సంభోగాలల్లో నా కెన్నడూ తృప్తి కలగలేదు. సంగతేమిటంటే, ప్రేమించిన స్త్రీని అనుభవించడం నా చేత గాదు. ప్రేమించాను ఆనందించిన ఏదీ నన్ను అసహ్యపరచదు. నా ప్రేమలో సంభోగానికి ఎక్కువ ప్రధానమైన స్థానం లేదు. సంభోగంవల్ల కలిగినదానికన్నా ఉన్నతమైనదీ తృప్తి నిచ్చేదీ ఏదో [దానికి పేరులేదు] ఇస్తాను, తీసుకుంటాను. అది ఆ ప్రత్యేకమైన విలువ సంభోగకార్యానికి, గొప్పగాఢత్వాన్ని, రసికత్వాన్ని, అందాన్ని, ఇంకా నువ్వు ఒప్పుకుంటే నిర్మలత్వాన్ని ఇస్తుంది.

అవును.

A thing of beauty is a joy for ever.

అందమైన వస్తువు ఎన్నటికీ ఆనందదాయకమే. కానీ చాలా స్వల్పంగా వున్నాయి, ఈ ప్రపంచంలో అట్లాంటి వస్తువులు. అంతకన్న వాస్తవం ముఖ్యం ఏమిటంటే, ఆ వస్తువులనించి అందాన్నించి సంతోషాన్ని పొందగలవారు ఎంతో మంది లేరు.

నిరంతరానందదాయక మంటే, అప్పుడప్పుడు ఏదో ఓ నిమిషం ఆనందం ఇవ్వడం అని కాదు. నేను ఆమాటకి ఇచ్చే అర్థం ఇది- వరసగా, ఏకదీక్షగా, చాలా సేపు అణిగి మణిగి ఎల్లప్పుడూ ఆనందం యిస్తూనే వుండాలని నా అర్థం. పోనీ, పటాలనుంచైనా అట్లాంటి ఆనందాన్ని పొందుతున్నారా ప్రజలు! పోనీ తుచ్ఛమనే స్త్రీ సంపర్కంనుంచి కాకపోతే పోనీ.

౧౫౪

ఏ లూ రు
19-4-45

My dear Blister,

నరసింహంగారు మన లేఖల్ని చాలా మెచ్చుకుంటున్నారు. 'ఇంత మంచి ఉత్తరాలు మీ చేత రాయించుకున్నందుకు దీక్షితులుగారిని చూచి ఈర్ష్య పడుతున్నా'నని రాశారు.

బెజవాడలో భగవాన్ పద్మాల మధ్యా, ఇక్కడ మల్లెపువ్వుమధ్యా కూచుని చిరునవ్వునవ్వుతున్నారు, అప్పుడప్పుడు కోపగించుకొంటూ.

వొచ్చే సంవత్సరం మీరు రిటైర్ అవుతున్నారు. అదృష్టవంతులు. ఆ నాటికి నేనూ బైటపడగలనని ఆశ.

క్రమంగా కాంతిలోకి పెరుగుతున్నాను. ఇంకా గాఢమైన శాంతిని వాంఛిస్తో.

# చలం ఉత్తరాలు

## నాలుగో భాగం

౧౫౫

ఏ లూ రు
29-4-45

My dear Spoon,

నన్ను విసుక్కోకండి. అర్థిస్తుని, నన్ను చూసి గొడవ పడకండి అవి చాలవాళ్ల లీలాగాదిని అనుకుంటాను. అట్లానే క్షమిస్తే నన్ను కొంత అనుగ్రహంతో (indulgenc) చూడండి అని మిమ్మల్ని అనుగుతున్నాను.

నా పుస్తకాలనిండా తప్పులు వుండడం మామూలు. అచ్చు పొరపాట్లేకావు అవి. చాలా పొరపాట్లు వుంటాయి. మీపేరుకూడా ఈ పుస్తకంలో కలిసివుందని నా literary life లో మొదటిసారి, proofs చాలా జాగ్రత్తగా దిద్దాను. అయినా - ఇదీ పర్యవసానం.

బందరు ప్రకాశకులు చలం పుస్తకాలు అచ్చు వేయడంలో ప్రారంభించి, అక్షరశోధనలు Practise చేయడంతో ఆఖరైనారు. కాయితంమీద అక్షరాలు అచ్చువెయ్యడం త్వరలో మాని, పెదవులమీద ముద్దులు ముద్రించడం ప్రారంభించారు. Alas, they are no more.

సుబ్బారావు ఎన్నో వాగ్దానాలు చేశాడు, ఈ పుస్తకం విషయమై. మీ పుస్తకం అని. గొప్పగా వేయించాలని 'చే' చాలా శ్రద్ధ తీసుక తంటాలు, పడింది. ఈ ఫలితాన్ని చూసి మండిపడి, సగంఅచ్చయినా 'అమీనా' వాళ్ళనించి లాక్కుందికూడాను.

మన మిత్రుడు నరసింహంగారు ఇట్లా రాస్తున్నారు:

Your చిత్రాలు are revealing the lighter side of your personality. They reveal as in a side-light the humour, the Shavian wit, wisdom the pathos, and the longing for the unkown and unknonable, the pity for ignorant humanity lying hidden in your heart. I am tempted to envy our friend, Mr. Deekshitulu who could draw so much out of you in sheer love.... your soul is tossing on high waves like a ship which has not found its harbour yet.

"I am Siva in search of Sakti"

Is more revealing of your mystic personality than any other idia or any sentence in your book....

మీకు తెలీదా? నెల్లూరివాస్తవ్యులు మన సూర్యనారాయణగారిని గతసంవత్సరమంతా జ్ఞానంలేకుండా కావలసి బాధించారని! ఆయన ఈశ్వరుడితో నిండివుండవొచ్చు. వుంటేనేం? ఆయనమాటలు వినండి. 'బలహీనుడూ నిస్సహాయుడైన మనిషే ఈశ్వరుడి శరణుచొచ్చుతాడు. తన స్వంత సమర్థత వల్ల జీవితాన్ని నడుపుకోగలిగిన మనిషికి దేవుడు చాలా అవసరం.'

నేను ఆయనతో పూర్తిగా ఏకీభవిస్తాను. దేవుడితో మనసునింపుకోడంలో ఏమీగొప్పలేదు. ఏవో గొప్ప ఆధ్యాత్మికానుభవంకోసం తపనపడి అవి అందుకోవడం ఎటూనో

తెలీక నిస్సహాయుడై ఈశ్వరుడి సహాయం అడిగితే దాంట్లో కొంత అర్థముంది. చాలామందికి తమసాధారణ వ్యవహారాలు సమర్థించుకునే శక్తిలేదు. అందుకని దేవుణ్ణిపట్టుకు వేళ్ళా డతారు. మీరు మన్నారు - మీరు శాంతంగా సమర్థతతో జీవితం గడుపుకోకలిగినవారు. కాని అంతకన్న ఉన్నతమైన అనుభవం అందుకోవాలని కోర్కెపడ్డారు.

నేను చాలా అసమర్థుణ్ణి, చాలా నాజూకు—బలహీనం నాలో. అనుకోడానికి ఏదీ శరణ్యమూ లేదు అందుకని చాలా వ్యథ పడ్డాను. అందుకనే నాకు కృష్ణశాస్త్రి కవిత్వంఅంటే అంత ఇష్టం. అందుకోలేనిదానికోసం చేతులుజాస్తుంది గనక.

నాజీవితాన్ని యీ భూమిమీదనే అమృతంతో నింప గల స్త్రీని ఇచ్చారు భగవాన్ నాకు తృప్తితో నిండిపోయి నాను. కాని అంతటితో నాకు తనివితీరలేదు. భూలోకం ఇవ్వ గల రసమూ అనుభవమూ దొరికాయి కాని ఆ వెలుగు పైకి ఎక్కడికో ఇంద్రియాలతో అందుకోలేని ఆనందంవైపు చూపుతోంది. తక్కింది భగవాన్ చేతుల్లో వుంది.

'ఒక పర్వతమే (అరుణాచలం) దీక్షితులుగారిని తమవారిని చేసుకున్నప్పుడు, మిమ్మల్ని ఒక స్త్రీ తనవాణ్ణి చేసుకోడంలో వింత ఏముంది ?' అంటున్నారు లీలగారు.

౧౫౬

ఏ లూ రు
13-5-45

My dear Cooker,

Damn భగవద్గీత. It is a silly book. అది బుద్ధి లేని పుస్తకం. భగవాన్ ఒక్కడే దేవుడు. ఉత్తరాలు రెండో భాగమా! సెక్సు సంగతులు లేని ఆ పుస్తకంలో ప్రజలకు ఎంతమాత్రం అనురక్తి కలుగుతుందో అనుమానమే. ఎంత మాత్రం అమ్ముడుపోతాయో! 'చే' ప్రకాశకులమీద కఠినంగా వుంటోంది. ముందు సెక్యూరిటీ పెడితేనే గాని అనుమతివ్వనంటోంది.

కవులు కూడు కుంటున్నారుట, 23 తారీఖున ఈవూళ్ళో మిమ్మన్ని రప్పిస్తారా? రప్పించగలిగితే బావుంటును.

౧౫౭

ఏ లూ రు
7-8-45

My dear Higher,

ఏమిటి మీా వుద్దేశ్యం! నేనా? పుష్కరానికి కదలడమా! ఏలూరునించి కదిలి అయిదు నెల్లయింది. నే నిక్కడ వుండే సంగతి చాలా వూగిసలాడుతోంది. నే నేనిమిషానన్నా అన్నీ తన్నేసి వెళ్ళేట్టున్నాను.

నా ప్రియురాలి వల్ల నేను నరకం అనుభవిస్తున్నాను. ప్రేమతత్వానికి రోమాన్సుకి నేను అనర్హుణ్ణి, బలహీనుణ్ణి,

తక్కువవాడనని ఆమె వుద్దేశ్యం. నేను ప్రేమకీ రోమాన్సుకీ పూర్తిగా పనికిరానంత ఉన్నతుణ్ణనీ ఉదాత్తుణ్ణనీ నా వుద్దేశ్యం. కనక త్వరలో మార్పులు రావొచ్చు నా పరిస్థితులలో.

యుగాల తరవాత నిన్నరాత్రి భగవాన్ కలలో కనపడ్డారు. ఆయన్ని చూడ్డానికి వెళ్ళానట. ఆయన నా మొహాన్ని ప్రేమతో తాకుతో 'చివరికి తిరిగి వొచ్చావా?' అన్నారు.

రిటైరయిన తరవాత ముందుకి ఏం ఏర్పాట్లు చేశారు? ఆ అడివి కొండల్లోంచి బైటపడి మీరు అందుబాటులో వుండేకాలం వొస్తుందా ఎప్పటికైనా?

౧౫౮

ఏలూరు
21-8-45

My dear Hill,

కొద్దిరోజులు నాతో ఇక్కడ గడపరాదా? ప్రతివారూ నన్ను వుద్యోగం వొదలవద్దని సలహా ఇచ్చేవారే. అసలు నేనే వొదలలేకపోతున్నాను. కుటుంబాలు ఎక్కువవుతున్నాయి. ఏదో ఒకటి తటస్థించి నన్ని వుద్యోగంలో ఆపుతున్నాయి. అబ్బాయి,నిజం, మనం ఈ బళ్ళల్లో చేసే ఉపయోగం ఏమీ లేదు. ఈ విద్య వుత్త హాస్యం.

రంగనాయకమ్మగారు అరుణాచలంలో వున్నారు. నేనూ వెళ్ళాలని కోరుకుంటున్నాను.

నేనూ లీలగారూ ఒకటే పోట్లాడుకుంటున్నాము కుక్కా పిల్లీ మల్లే. ప్రతిపోట్లాటా, చాలా గొప్పవీ ఉన్నత

మైనవీ ఐనకారణాలకే. ఇద్దరికీ కూడా తమ న్యాయబుద్ధిలోనూ, ఆధిక్యతలోనూ అమితమైన విశ్వాసంవల్ల.

ఉత్తరాలు రెండో భాగం అచ్చులోవుంది.

గోపీ

ఏలూరు
22-10. 55

My dear Isralite,

మీా గంతు వేసే వుత్తరం. ఇన్ని యుగాలతరవాత మీాకేం వ్రాయను ? అగ్నిలోనించి తుపానులలోనించీ నడుస్తున్నానని తప్ప ! సాధారణ మానవులవలె శాంతమైన సుఖంలో బతకడం నా జీవితానికి ఏర్పడలేదేమోననిపిస్తుంది. నాపుటకే అంత. శాంతంగా బతకడం భరించలేనుకూడాను. నా కాలంలోంచి నేను వ్యధను తయారుచేసుకుంటాను. ఆ వ్యధని భరించలేక తన్నుకుంటాను, ఏడుస్తాను. ఈ ఘోర మంతటిలోనించి ఏం చేరుకుంటున్నాను. నిజమైన నీ శాంతిని ఎప్పుడు పొందుతాను.

ఇంకా రోమాన్సుకోసమే జీవిస్తున్నాను. ఆమె నన్ను నరకంలోంచీ స్వర్గంలోంచీ లాక్కెడుతోంది. నాకు తృప్తిగానేవుంది. ఈ అనుభవంలోంచే Fulfillment ప్రయత్నిస్తున్నాను.

నే నీమధ్య రాస్తున్న Musings చదువుతున్నారా ?

దసరాలో లీలాగారితోసహా అరుణాచలం వెళ్ళాలని ఆశ పడుతున్నాను. రంగనాయకమ్మగారు రెండు నెలలనించి అక్కడే వున్నారు. శాంతి దొరికిందని రాస్తున్నారు.

ఎట్లా వున్నారు? ఉద్యోగంనుంచి ముక్తికి ఎదురు చూస్తానో, ఎప్పుడు కలుసుకుంటాము. క్రిస్మస్‌లో అరుణా చలంలోనా?

౧౬౦

ఏ లూ రు
6-11-45

My dear Cunner,

మీరు మెచ్చుకున్నారని లీల గారు చాలా సంతోషిస్తు న్నారు. మా దగాదాలు తీర్చడానికి నరిసింహారావుగారు రెండురోజులకిందట ఇక్కడికి వచ్చారు. పూర్తిగా ఆమె పక్షమే right అని నిర్ణయించారు. మేమిద్దరం ఇన్నేళ్లా personal and general విషయాలమీద ఘోరంగా పోట్లాడు కుంటున్నాము.

భగవాన్‌ని ఎప్పుడు చూస్తానా అని కలలు కంటున్నాను. అక్కడే స్థిరపడిపోవాలని కూడా కలలు. జైలునించిబైట పడ్డ తరవాత మీ రెక్కడ వుంటారు?

త్వరలో మిమ్మల్ని కలుసుకోవాలనిపిస్తోంది. లీలగారు మిమ్మల్ని చూడాలని సరదా పడుతున్నారు.

*క్రిస్‌మస్ శెలవల్లో లీలగారు, చలం అరుణాచలంవెళ్ళి వారంరోజు లున్నారు. మామూల ప్రకారం చలం భగవాన్‌దగ్గిర శెలవుతీసుకోడానికి వెడితే, ఎన్నడూలేనిది, చాలా కోపంతో*

'యామండీ' అని పలకరించారు చలాన్ని. చివర 'చిత్తం, చిత్తం' అన్నారు భగవాన్. ఎవరెవరు వెడుతున్నారనికూడా

కనుక్కున్నారు చిరునవ్వులతో చలాన్ని ఇంటికిపంపే భగ వాన్.

బసకివొచ్చి, భగవాన్ కోప్పడ్డారు, మనం వెళ్ళడం మంచిదికాదని పట్టుబట్టి ఆనాటి ప్రయాణం మాన్పించాడు చలం. మర్నాడు మామూలుగా శలవిచ్చారు భగవాన్. కాని రాత్రి దీక్షితులుగారువొచ్చి ప్రయాణం ఆపించారు. మర్నాడు మళ్ళీ భగవాన్‌న్ని శలవ అడిగే ధైర్యం లేక పోయింది ఎవరికీ.

మధ్యాన్నం బయలుదేరేప్పుడు లీలగారూ వాళ్ళూ ముందుగా స్టేషన్‌కి వెళ్ళిపోయినారు. భగవాన్‌తో చెప్పిగాని రానన్నాడు చలం. భగవాన్ కొండనించి రావడం ఆలిశ్య మయింది. వచ్చాకకూడా దగ్గిరికి వెళ్ళడానికి వీల్లేకపోయింది. చివరి నిమిషాన ఆయన యదుట పడడానికి ధైర్యంలేక పోయింది చలానికి. లీలగారూ వాళ్ళూ వెళ్ళిపోతా రనే భయంతో స్టేషన్‌కి చివరి నిమిషాన వెళ్ళాడుచలం.

౧౬౧

ఏలూరు
21-11-45

My dear Hickless,

అవును. రంగనాయకమ్మగారు భగవాన్ అనుగ్రహంలో వోలలాడుతున్న ట్టున్నారు. ధన్యురాలు.

నా బంధనాలా! భగవాన్‌ని దర్శించడానికి వెళ్ళాలంటే మొదటి ప్రతిబాధకం రైలు. గుంపులో ప్రయాణం చెయ్య

లేను. నా ఆరోగ్యం, నరాలూ భరించలేవు. నాకు డబ్బు లేదు. నేను వెడితే సావిత్రినికూడా తీసికొని వెళ్ళాలి. నాతో వున్న లీలగారిని ఏంచెయ్యాలో తేల్చుకోలేను.

మరి తన దర్శనానికి రావడానికి భగవాన్‌కూడా నాకు కొంత వీలును కలగచెయ్యాలి. ఇంతకీ ఆయన్నించి వొచ్చిం తరవాత కూడా మళ్ళీకొత్త torture నాకు ఉండనే ఉంది. ఆయన నాకు శాంతి నివ్వరు.

శారీరకంగా, నైతికంగా, ఆత్మికంగా నిస్సారమైవున్నాను. ఏం జరిగినాసరే, కానీ అనే నిస్పృహలో పడ్డాను. నన్నెవరూ రక్షించలేరు. భగవానైనా సరే. ఈ మందుల మళ్ళేనే ఆయనా కాస్త Reaction కలిగిస్తారు. అంతటితో సరి. యథా స్థితిలో వుంటాను తరవాత. Let me rot my own rot in this hole. బాధకోసమే పుట్టాను. స్వర్గంలోనైనా నాస్వంతనరకాన్ని కల్పించుకోకండా వుండలేను.

మీరు దిగి మనిష్యుల్లోకి రాకూడదా. ఏడ్చుకోడాని కన్నా, నాకు దొరకండి.

ఈ చిక్కుల్లోంచి బైటపడే శక్తి నాకు లేదు. విప్పమని భగవానుని ఒకటే పదేపదే ప్రార్థిస్తాను. అవసరమైనబలాన్ని భగవాన్ నాకిస్తారనే నిశ్చయమే వుంటే, ఈనాడు ఆయన దగ్గిరికి పరుగెత్తుతాను. ఆమెలేనిది ఆమెకోసం యాతన పడతాను. అక్కడే వుండిపోదామంటే, నా ఆరోగ్యం నన్ను నిలవనీదు. ఆరోగ్యంతో, డబ్బులేకుండా, ఎట్లావుండ నక్కడ?

మీతో వాదించటంలేదు నేను. నాతో నే నిట్లా వాదించుకుంటాను, నాలో భగవాన్‌తో వాదిస్తున్నాను.

సరే, తమకి తాము సహాయం చేసుకునే వారికే భగవాన్ సహాయం చేస్తారని నెమ్మదిగా అంటారు మీరు. కాదు, బలహీనులకే ఆయన సహాయం అవసరం. బలమున్న వారికి ఏ భగవాన్ సహాయమూ అక్కర్లేదు.

౧౬౨

ఏలూరు
21-11-46

My dear Proposer,

మీకు రాద్దా మనుకున్నాను. కాని వ్రాయడానికి ప్రత్యేకంగా ఏమీలేకపోయింది. మీరు వ్రాస్తారను కున్నాను.

అరుణాచలంనించి నా తిరుగుప్రయాణం ఒక వ్యథాగీతి వొచ్చినప్పణ్ణుంచికూడ ఎదురుచూడని చిక్కులు. ఇంకో నెల న్నర వరకు చిక్కులు జాతకం ప్రకారం. ఈ సంగతి భగవాన్‌కి ముందే తెలిసి, గొప్పకరుణతో నాకు warning ఇచ్చారనుకుంటాను. ఆయన నన్ను సంతోషంగా శలవిచ్చి పంపలేక పోయినారు.

శీలగారి మనస్సుకు ఏదన్నా నచ్చిందంటే, ఇంక దాని నించి వెనక్కి తగ్గరు. భగవాన్ ఆమెని చాలా impress చేశారు. (అరుణాచలంలో వెంటనే స్థిరపడేసంగతి) 'భగవాన్‌కే వదిలేస్తాను' అంటున్నారు. అరుణాచలంలో వుండి

పోషణం ఆమెకి సులభంకాదు - ఆమె భూములూ ఎదిగే పిల్లలూ. కనక భగవాన్ ఆమెకి లోపల్నించి బైటనించీ ఏర్పాట్లు చేసిపెట్టాలి.

Leela Garu has some remarkable points of view about Bhagvan and his influence· They are worth knowing· Wish she would write out a thesis for Bhagvan's information and gdance that is for us though we may not approve of them· She is original·

౧౬౩

ఏలూరు
30-1-46

My dear Bhagvan bus-driver,

మీ chirping ఉత్తరానికి నేను వ్రాసిన cheerless ఉత్తరం మీకు అందలేదా? అందితే జబాబు రాయలేదేం? has my letter chilling? How could I help it? నేను అష్టమశనితో బాధపడుచున్నాను. శని భగవాన్‌ని భయపెట్టి వెళ్ళగొట్టేశాడు.

సారిన్‌కి ఓ కల వొచ్చింది.

భగవాన్ హాల్లో కూచున్నాము, నేనూ, మిత్రుడూ నరసింహారావూ, షా. భగవాన్ భక్తులుకూడా చాలామంది కూచుని వున్నారు. చాలావిసుకుతో లేచినుంచుని భగవాన్ 'అబ్బా! ఇన్నాళ్ళ నించి చూస్తాను ఒక్క honest and sincere man, నా కోసమని ప్రత్యేకంగా వొచ్చినవాడు కనపడతాడేమోనని. ప్రతివాడూ తన గొప్పతన ప్రాముఖ్యత

చూపించుకోడానికి వొచ్చేవాడే కాని, ఏదో బాగుపడదామని నేర్చుకుందామని వొచ్చినవాళ్ళు ఒక్కళ్ళూ కనపడరు. కొందరు గొప్పవాళ్ళని యాచించుకుంటో పొగుడుకుంటో వాళ్ళ పక్కన చేరుతో కొంత గొప్ప feel అవుతారు. ఎప్పటికి వీళ్ళకి ముక్తి : ఎందుకు నేను ఈనాలుగు గోడలమధ్య కూచోడం? ఈ అవస్త! ఏ కొండలోకో పోక ?'

అని అందరి దగ్గిరికీవొచ్చి ప్రతివాణ్ణీ ఖండిస్తున్నారు. నరసింహారావుదగ్గిరికి వొచ్చేప్పటకి, అతను భయపడుతో నుంచుని, 'నేను ఎందుకోసమూ రాలేదండి. మిమ్మల్ని ప్రత్యేకం దర్శించడానికే వొచ్చాను.' అన్నాడు. భగవాన్ నవ్వి 'నాకు తెలుసు, నా కోసం వొచ్చావని. నిన్ను అనటం లేదు. కూచో. కూచో.' అన్నారు.

షా దగ్గిరికి వొచ్చి చాలా దయతో నవ్వి, షా జుట్టుని నిమిరారు. 'నువ్వు నా కోసమే వొచ్చావు. నీది చాలా సుఖమైన జీవితం. బెంగపడకు. అన్నీ దగ్గిరికివొస్తున్నాయి. త్వరలో జరుగుతాయి' అన్నారు.

తరువాత ఆయన నా దగ్గిరికి వొచ్చారు. నేను చాలా దిగులుగా కూచుని వున్నాను. ఆయన నా తలని తనచేత్తో తనకి దగ్గిరిగా అదుముకొని, నా చంపరాస్తో, చాలా జాలిగా,

'చాలా Suffer ఐనావు. చాలా బాధలు పడ్డావు. తప్పదు. మనస్సుకి పట్టువొదిలితే తీపు ఆనందంరాదు' అన్నారు.

ఇం తే లీ లా !

౧౬౪

ఏ లూ రు
1-2-46

ఇన్నేళ్ళూ భగవాన్‌నుంచి దూరమై రొమాన్సుకోసం బతుకుతున్నాను. ఈ రోజాపువ్వ శయ్యవైపు నన్ను divert చెయ్యడంలో, మరల్చడం భగవాన్ ఒక ఉద్దేశ్యంతో చేశారని నమ్మాను. ఈనాడూ నమ్ముతున్నాను. కాని ఆ శయ్యనిండా ముళ్ళు అనుభవించాను. చాలా కఠినమైన పరీక్షా కాలం గడిపాను. Fighting for may very existence నాకూ లీలగారికీ మధ్య సఖ్యత కుదుర్చమనీ, ఆమెద్వారా నేను తనని కనుక్కునేట్టు చెయ్యమనీ, లేకపోతే మాని యీ పెనగులాటే వొదిలి ఆమెనించివిడబడగలబలాన్ని నాకిమ్మనీ, నిరంతరం, పదేపదే భగవాన్ని ప్రార్థించాను. అన్ని విషయాలూ విరోధంగావున్నా, మా ఇద్దరికీ ఆశ్చర్యంగా, పట్టుబట్టి మమ్మన్ని కలిపివుంచినట్టయింది.

చాలా బాధపడ్డాను. ఇంకా బాధపడుతున్నాను.

Life is dry; days pass in deadly routine-

ఏదీ తృప్తిపరచదు - ఏదీ నాకు సంతోషాన్నివ్వదు. నెప్పి, నెప్పి, నెప్పి—శరీరంలో హృదయంలో.

సౌరిస్‌కి వొచ్చిన కల ప్రాశానుకదా 'లీలగారి కన్నుల్లో నన్ను చూస్తే తప్ప, యీబాధా, యీశ్రమా, తగాదా వృథా' అని భగవాన్ నన్ను అన్నట్టు.

మళ్ళీ భగవాన్‌దగ్గిరికి వెళ్ళాను. కాని తిరిగి వొచ్చింతరవాతకూడా ఇదివరకటి స్థితిలో నేవున్నాను.

ఏం చెయ్యాలో తెలీటంలేదు. ఇట్లా నన్ను ఉపేక్ష చెయ్యడంలో భగవాన్‌కి ఏదో వుద్దేశ్యం వుందని నమ్మడానికి ప్రయత్నిస్తాను. ఆయనే నన్ను సమీపిస్తేనేగాని, నేను నిస్సహాయుణ్ణి. ఇది ఏదీ, ఏదీకూడా నాకు శాంతి నివ్వలేవు.

౧౬౫

ఏలూరు
22-10-46

My dear Rugby,

మీకు జవాబు రాయని నా కఠినత్వాన్ని చూసి కోపం తెచ్చుకున్నారా ? ఏం చెయ్యనూ ఓ జరాన్ని భద్రంగా మందులిచ్చి నయం చేసుకుంటున్నాను. చిత్ర పెళ్ళి చేసుకుంటానంటె మానసిక సానుభూతి నిస్తున్నాను, తక్కిన నా శృంగార జ్వాలల్లో మరుగుతో.

సరేకాని, మీ భగవాన్ ఉద్దేశ్య మేమిటి ?

మీరూ, నేను, సౌరీస్, సూర్యనారాయణగారు – మన నలుగురికీ మొదట్లో ఎన్ని hopes హోప్సు ఇచ్చారు; ఇప్పుడు మీరుతప్ప తక్కినవాళ్ళం ఆయనమీద గంపెడు కంప్లెయింట్స్ చేస్తున్నాము. మమ్మల్ని ఆయన పూర్తిగా మరిచి పోదిలేశారు.

కాని మిత్రుడు రామశేషయ్యగారు (జైపూరు) ఈ విషయాలవేపు దృష్టితిప్పి అన్వేషిస్తునట్టున్నారు. ఇప్పుడు ఆయన ఈ నిరాకరణఅంతా ముందు ఓపెద్ద ఎత్తుకు పోవడానికే నంటున్నారు.

జీవితాన్ని పాలించే ఏకైకదైవం జాతకమని అనడంలో నాతో కలిశారు సూర్యనారాయణగారు. విధిని భగవాన్ కూడా అతిక్రమించలేడు—మీరు భగవానే విధిఅంటే తప్పు.

తక్కినవాళ్ళమల్లే ఆర్టిస్టు అయినవాళ్ళం సెంటిమెంటల్ తుక్కు రాయడానికి వీల్లేదు—భగవాన్ స్తుతికైనాసరే. మనం ఏది మనం పలికినా, అది అందంగా వుండాలి. అందంగా రాయడం మనకి ఒక అలవాటైపోవాలి. ఆ అందం కలిగి నప్పుడు మౌనం ఉత్తమం. మీ నివేదన (అనే పుస్తకం) రమణ గోపాలుడూ, పిల్లలపద్యాలూ, ఒకొక్కచోట 'సిల్లీ'గా కూడా ఉన్నాయి. మీకు హృదయంలోంచి అనుభవం పొంగి పారింది. మీకు తోచిన దేవతా నామాలతో భగవాన్ పిలవడం ఆశ్రమంవారికి సంతోషంకావొచ్చును గాని, మీ ఎడైఆర్సరని నిరుత్సాహ పరుస్తుంది.

నేను కఠినంగా వ్రాస్తున్నాను. కాని నేనువ్రాసిన విమర్శ నాదే కాదు, మిమ్మల్ని మెచ్చుకునే అనేకమందిది కూడా, భగవాన్ కోసరమైనాసరే మీరు చవకగా కావడం నాకు ఇష్టంలేదు.

౧౬౬

ఏలూరు
27-10-46

My dear Picker,

మీరోషం ఉత్తరం. మనం అర్థంలేకండా వాదించుకుంటు న్నాము. మీరుచెప్పేదీ నిజమే, నేనూచెప్పేది నిజమే — మన దృక్కోణాలే భేదం.

ఏదో పొగమంచువంటిదీ, స్పష్టంగా తెలీనిదీ ఏదో జరుగతోందంటే, అదేం అట్టే తృప్తి నియ్యదు మనకి. స్పష్టమైన ఆధ్యాత్మికాభివృద్ధీ శాంతీ కావాలి. ఎప్పుడో ముందు జన్మలో జరుగుతుందంటే, ముందు జన్మవుంటుందని నాకు విశ్వాసం లేదు. పోనీ ఎంతకాలానికైనా, కొంచెంగానన్నా, ఈజన్మలోనే ఏదోజరగాలిమరి. మీరూ భగవాన్ ఏమంటా రంటే, 'మరి మీరు సంపూర్ణంగా అర్పణ (సరెండర్) అయినారా?' అని.

అదే మాకు చాతనైతే భగవాన్ అవసరమేలేదు. మరి ఆయనే మమ్మల్ని అర్పణచేసుకోడానికి సహాయమో బల వంతమో చెయ్యాలి. మీకు సంపూర్ణమైనవిశ్వాసం, మా కన్నీ సందేహం.

నాకు స్పష్టంగా తెలిసిందల్లా, నానించి ఏ ప్రయత్నం లేకండా నాకు ఆధ్యాత్మికానుభవం కలిగిందని. దానంతట అది నాకు ఎట్లాగో రావలసిందేగాని, ఏ సాధనగాని, ఇంకేంగాని ఆ అనుభవాన్ని నాకియ్యలేవు.

తన జీవితాన్నే ఆయనికి అంకితం చేసిన సౌరిస్‌కి మాత్రం ఏంచేశారు భగవాన్! ఆయననించి ఏమీ కోరదు. ఆయన నించి దూరంచేసేందుకు ఏమీ గట్టికోర్కెలన్నా లేవు కూడానుమరి, సౌరిస్‌లో.

'ఇండియా అంతా వాడికితేనా...' అంటారు గాంధి. కాని నాయకుడు చెవితేచాలదు. వాడికేట్లు చెయ్యడంకూడా ఆయనపనే. అట్లా ఆదేశాలు ఎవరైనాఇవ్వవొచ్చు నేనూ

అంటాను 'ఇండియాలో అందరూ బట్టలు వొదిలేసి తేనా' అని.

మళ్ళీ మీ పుస్తకంసంగతి. ఆధ్యాత్మికానుభవమైనాసరే, మనలో అణిగివున్న రస శక్తుల్ని విజృంభింప చెయ్యాలి. ఆధ్యాత్మికానుభవం ప్రజ్వలించే మౌనంలోకి లాక్కుపో వొచ్చు. కాని ఆ అనుభవం మనచేత రాయించినప్పుడు, ప్రపంచాలు మెరిసే ముత్యాలు రాలాలి మన అక్షరాల నించి.

నా ఫిర్యాదు మీ మీదేకాదు, అంతకన్న ఎక్కువగా నామీద. నాకు ఒక్క వాక్యం రాసే శక్తికూడా పోయింది. మౌనం నాకు అయిష్టంకాదు. కాని ఆ మౌనం నావొక్కనికే గాని, నా హృదయానికీ మనసుకీ రాలేదు.

నాకు కొంత తృప్తినిచ్చే కళా సృష్టినించి, ఇప్పుడు భగవాన్ పేర నిర్జీవమైన చప్పని బతుకులోపడ్డాను. మీరు రాసే రకం స్తుతులు భగవాన్నీ ఆయన భక్తుల్నీ సంతోష పెట్టవొచ్చునేమో గాని, వాటిని చదివినవాళ్ళెవరూ భగవాన్ వైపు ఆకర్షణ పొందరు.

ఆధ్యాత్మికమని దాంట్లో దిగిన చలం దీక్షితులకీ ఇట్లాంటి గతి పడితే, ఒకరు తన కళాశక్తి నశించిందనే గోలలోనూ, ఇంకోరు ఏదో జరుగుతుందనే విశ్వాసంలోనూ బతకడమేఐతే, ఆత్మ శోధనవల్ల జీవనశక్తి నశించడమే పర్యవసానమైతే, ఆధ్యాత్మికమంటే ప్రతివారికీ జంకు పుడుతుంది.

పోనీ రంగనాయకమ్మగారి సంగతి చూడండి. సమస్తము అర్పించి భగవాన్ శరణు చొచ్చింది ఆమె. ఆమె ప్రస్తుత స్థితిని మీరు ఆధ్యాత్మికమంటారా? ప్రారబ్ధమంటారు. అట్లాఐతే ప్రారబ్ధాన్నే రాజ్యం చెయ్యనీండి. ఇంక భగవాన్ ఎందుకు?

నామాట నమ్మి లీలగారు, విశాలదృష్టితో భగవాన్‌ని దర్శించారు. కాని తిరిగి వొచ్చినవెంటనే, ఎవరికీ అర్థంగాని, ఎవరూ కుదర్చడం చాతగాని జబ్బుపడ్డారు.

మనకి అర్థంకావు ఇవన్నీ అంటారుమీరు. నేనూ అదే అంటాను. అర్థంకావని వొదిలేద్దాం. మనకి ఏదీ అర్థంకాదు, ఎన్నటికీ అర్థంచేసుకోలేము మనకి అర్థంకాదుకనుక. అర్థం కానిది ఏదోవుందని విశ్వసించడం బలహీనమూ, మూర్ఖమూ అంటాను. ఎందుకంటే అర్థంకావడానికీ, అర్థంకాకపోవడానికీ అక్కడ అసలు ఏమన్నా వుంటేకద! ఈప్రపంచస్వరూపాలలో భగవాన్ ఒకస్వరూపం. తక్కినవాటికన్న అద్భుతమూ, అనిర్వచనీయమూ, అగోచరమూ ఆయన. అంతే, ఆయనవల్ల ఏదోవొరగాలని ఆశలుపెట్టుకుని, ఆయన్ని ప్రార్థించడం వృద్ధులైన ఆయన్ని బాధించడంతప్ప ఇంకేం లేదు.

అపవాదులు రేపే నాన్నగారి వంటి వాళ్ళకే భగవాన్.

కటికనిస్సహాయంవల్ల నా ఆలోచనల్ని ఇట్లా విసిరి బాదుతున్నాను. కోపం తెచ్చుకోకండి. జవాబిచ్చే ఉద్రేకం మీలో తెప్పిస్తే చాలునాకు.

Ministering hand.

Cheer up.

యాభై ఏళ్ళతరవాత ఇంకా బతికిఉండే దురదృష్టంపట్టిన మనబోటివాళ్ళు? ఇట్లాంటి శోకాలకి సంసిద్ధులంగానే వుండాలి మరి.

౧౬౮

నూ జి వీ డు
27-2-47

My dear Gunther,

మీరు ఎట్లాఉన్నారో, ఏంచేస్తున్నారో, ఈ రోజుల్లో, సకలపరిస్థితులూ ఎట్లాఉన్నాయో కనుక్కోవాలని ఎప్పటి కప్పుడు మీకు రాయాలనుకుంటూ ఉన్నాను. భగవాన్ జన్మదినోత్సవ సంచికలో నన్ను నేను నానవేసుకుంటున్నాను. భగవాన్ని తాగుతో, నన్ను మింగెయ్యమని భగవాన్ని అడుగుతో. కొన్ని వ్యాసాలు బావున్నాయి, కాని చాలా వరకు మామూలు చెత్త పెద్దపెద్దవాళ్ళ పేర్లతో. వొచ్చిన కష్టమేమిటంటే అనుభవానికికాని తెలీని భగవాన్ గొప్ప తనాన్ని మనసుకి explain చెయ్యడం.

లీలగారి కంటివైద్యంకోసం మళ్ళీ ఈ ఆస్పత్రి చేరుకున్నాము. ఈనా రొమాన్సువ్యవహారంలో విధి నామీద పెద్ద దెబ్బతీసింది. ఆమాటఅంటే మీహృదయం బహుశా చాలా సంతోషిస్తుంది. 'ఈ వ్యవహారాల అంతం అంతేలేఅబ్బాయ్!' అని గలగలమంటో నవ్వుతారు. 'సెమీది గొప్పదయవల్ల నీ రొమాన్సుని నాశనంచేశారు, భగవాన్' అంటారు మీరు.

ఆమెకి జబ్బుగావుంది. ఈఏడాదంతా జబ్బుగానే ఉన్నారు. దిగులు, చీకటి, నీలగిరితైలాం, మందులు, ఆదుర్దా ఇదీ వాతావరణం. అట్లానడుస్తోంది నాజీవితం. బెజవాడ నించి దూరంగా ఉండాల్సివొచ్చినందుకు పెద్దబాధ.

రంగనాయకమ్మగారు భగవాన్ సమక్షంలో చాలా హాయిగా ఉన్నారు.

ఇన్నేళ్ళతరవాత మళ్ళీ ఆధ్యాత్మిక మార్గంకోసం ఆసక్తి పడుతున్నాను. చీకట్లో వెతుక్కుంటున్నాను.

భగవాన్ జన్మదినసంచిక చదివితే, వాటిల్లో రాసినవాటి కన్న నేను మీకురాసిన ఉత్తరాలే ఎక్కువ విలువైన వనిపిస్తోంది. My letters are perhaps the best and most detaild record and also a picturesque record of Bhagvan's slow and incessant work on a certain type of man.

None other of his devotees has such a story to tell a story of struggle and doubts, dreams and assurances, breaks and warnings fain and faith- a greate linking of actual every- day life with a spiritual endeavour.

మన వుత్తరాలు కొంతమంది చాలా శ్రద్ధగా గమనిస్తున్నట్టున్నారు.

నా మ్యూజింగ్సు నాలుగోభాగం నా అహంలో భగవాన్ ఎట్లా ప్రతిబింబించాలో విశదీకరించ పోతోంది.

మిమ్మన్ని కలుసుకుంటే ఎంతబావుంటుంది అనిపిస్తుంది చాలాసార్లు.

౧౭౦

ఏలూరు
13-3-47

My dear sweet,

నాయీ రాసిన వ్యాసం చదువుతున్నాను. జన్మదిన సంచికలో మీ ఇద్దరివ్యాసాలూ పక్కన పక్కనే వెయ్యడం చాలా ఉచితంగా వుంది. Both are so child-like, some times childish. ఎంతమధురం, ఎంత కదిలిస్తున్నారు హృదయాన్ని! అమితమైన ఆ భక్తి సెంటిమెంటును నే నిష్టపడకపోయినా, తిరిగి తిరిగి నా కళ్ళు నీళ్ళతో నిండాయి. నా స్వభావం వేరు. స్త్రీని వొదిలి వేరే ఇవ్వడానికి నాలో భక్తి ప్రేమ మిగలలేదు.

ఆమెతో భగవాన్ అంటారు. 'నువ్వు ఎక్కడవున్నా నేను నీతో వుంటాన'ని. ఆయన అట్లాఅంటే ఎంత బావుండును అని కోరుకుంటాను. అంతమాత్రం నాకు తెలీదా అనుకుంటారేమో ఆయన! ఆ మాటలు ఆయన ప్రత్యేకం అనాలా? ఒకవేళ ఆయన ఆమాటన్నా, నామనసు ప్రశ్నించకుండా ఉంటుందా? ఆయన అన్నిచోట్లా ఎట్లా వుండగలరు? నాతో ఉండడం ఆయనకి సాధ్యమా? ఉంటేమాత్రం ఏం వొరిగింది? ఆయన నిజంగా నాతో వుంటే, నే నెందుకిట్లా బాధపడాలి?

కనక అన్నీ తెలిసి, ఆయన మౌనంగా నా సందేహాన్ని నేను చిక్కులు విడతీసుకునేందుకు సాయపడుతో వుంటారు.

Your visit has left behind a sweet aroma with me.

మళ్ళీ భగవాన్‌తో నిండిపోయినాను.

Blessed be you and He, for what I am to day and may be tomorrow.

౧౭౧

ఏ లూ రు
8-1-47

My dear Little-do-well,

నిన్న రాత్రి భగవాన్ కలలోకనపడ్డారు. మీరూ నేనూ ఇంకోరు ఎవరో భగవాన్‌తో వున్నాము. ఆశ్రమం ఖాళీగా వుంది. భగవాన్ దిళ్ళుకూడా మాయమౌతున్నాయి. నేన న్నాను. 'భూమిమీద భగవాన్ చెయ్యవచ్చినపని ముగుస్తోంది. ఎవరికి ఏమిచెయ్యాలో ఆయన దాన్ని చేసి ముగించారు. ఆయన వెళ్ళిపోవాలి. మనంమాత్రమే మిగిలాము. Let us hasten' అన్నాను.

అని నేను ఒక వార్తాపత్రికలాగు మడతపడుతున్నాను! నిజంగా ఒక కాయితమైపోయి, ఆయనచేతుల్లోకి నన్ను నేను ఇచ్చేసుకున్నాను.

ఇంతలో మేము, నేను సౌరిస్ తక్కినపిల్లలూ ఒక స్టీమ ర్లో వున్నాము, సముద్రంలో వేగంగా వెళ్ళిపోతున్నాము. చిన్న సముద్రంలోంచి అంతులేని మహాసముద్రంలో ప్రవే శించింది స్టీమరు. నేను సౌరిస్‌తో అంటున్నాను.

'Now we are outward bound. Look at the rhythm of the ship off and off we go to an endless destination, being wafted on these glorious waves' అని

లీలగారి సంగతి –

When a Godess becomes self conscieus, on sacrifice can reach up her magnitude.

౧౭౨

నూ జ వీ డు
29-6-47

My dear Godavarer,

శ్రీ శ్రీ నాకు ఉత్తరంలో ఇల్లా వ్రాశాడు. 'నాకథ మీాకు నచ్చుతుందనీ నాకు తెలుసు. రమణమహర్షి గారిని నేను ఎత్తిన సందర్భాం మిమ్మన్ని బాధపెడుతుందనీ తెలుసు. కాని నన్నేమి చెయ్యమన్నారు? ఆకథ విధగా అలాతప్ప మరోలా అంతం కావడానికి వీలులేదు! నా జవాబులో అతనికి—

తాగితే వొచ్చేది ఏమాత్రం? రమణమహర్షి super-intoxication with no after- efforts, continuous and luminous. అని రాశాను.

నర్సాపురం వొదిలి వొచ్చినందుకు లీలగారు తననితాను చాలా నిందించుకుంటున్నారు.

నేను సరేసరి - మిమ్మన్నీ గోదావరినీ వొదిలిరావడం చాలాబాధ అనిపించింది. నేను అక్కడవుండడంవల్ల అణిగి పోయే మీా spirits కి కొంతఉత్సాహాన్నిచ్చాననుకున్నాను. ఈ నా జీవితభారంలో మీారు చెంతనే వుండడం నాకెంతో వోదార్పుగావుండేది.

౧౭౩

నూజివీడు
2-7-47

My dear gloomy,

ఏమిటి? ఎందుకట్లా కుంగిపోతున్నారు? కారణమేమీ లేదు కద ! మీభార్య జ్ఞాపకంతప్ప, మీకేదీ వ్యధాకారణం వుందనుకోలేదు నేను.

ఎందుకిట్లానో తెలీదు. చాలాసార్లు నాకుకూడా కోపం వొస్తుంది. వ్యధలోనించీ, నిరాశాంధకారంలోంచిమాత్రమే భగవాన్ మనని తనకిదగ్గిరిగా తీసుకోగలుగుతారు. నేను వ్యధని భరించలేను. ద్వేషిస్తాను. కాని ఆయన పాదాలదగ్గిరికి చేరుకోడానికి అదొక్కటే మార్గమైతే, కానీండి, వ్యధకే సుస్వాగతమిస్తాను.

లీలగారి శల్యసారధ్యాన్ని తప్పించుకుంటో, మూడు రోజులనించి ధ్యానంలో వున్నాను. మాయాస్వరూపమైనస్త్రీ అపరావతార మనిపిస్తారు ఆమె.

When I triumph over her I triumph over my ego.

What is the use of this meditation, when it is called off in a day or two? How tantalising in Bhagvan He won't take us to Haven, and he won't leave us to our Hell. Hope this wave of despair will carry you to your deapths.

౧౭౪

నూజవీడు
11-10-47

My dear awake,

వసంత్ ఎక్కడికో మాయమైనాడు, ఇంక మే మెన్నడూ తనని చూడమని ఓ ఉత్తరం రాసిపెట్టి మాకు తెలిసిందల్లా, ఎవరివిషయమో ఉత్తరంలో నేను రాస్తే, అది తనమీదనని తప్పుఅర్థం చేసుకొని. డాక్టర్ గారికి పెద్దఆపరేషన్ అయింది. ఇప్పుడే కోలుకొంటున్నారు - ఇట్లా వుంది నా సంగతి. ఎక్కడా సంతోషంలేదు. ఈ నీలం ఆకాశం, ధగధగ మనే కాంతీ, చల్లనిగాలీ, పచ్చనిఆకులూ తప్ప.

మీరు పక్కమీద పడుకొని ఎదురుగా భగవాన్ వంకా, పక్కన గోదావరివంకా, చూస్తోవుంటారు.

So waiting on for final disruption sans dreams and sans pain.

అవునులెండి మీరన్నట్లు చివరికి సరిగా తిరక్క ఏమవు తాయి బాధలు! నే నేమంటా నంటే, బాగా అలవాటవు తాయి. మన స్వభావంలో ఇంకుతాయి. అప్పుడు సుఖం మనకి ఆశ్చర్యం.

ఏలూరు హెడ్మాష్టరుగారు నన్ను ఏలూరురమ్మని తాకీదు పంపారు, ఏవో పెన్షన్ కాయితాలు నింపడానికి. రాను పొమ్మ న్నాను.

అదృష్టవంతులు. మీరు దుర్విధితో రాజీ పడ్డారు. నా కింకా అది చాతకాదు. వొచ్చిన బాధంతా అదే. నా ఆరో

గ్యం నన్ను నరక యాతన పెడుతోంది. ఈ శరీరాన్ని నాశ నంచేసి, దానిపైన కసితీర్చుకోవాలనే ప్రోద్బలం నాలో బల మవుతోంది. దాన్ని నాశనంచేయక వొదిలానా, త్వరలోనే వన్నీశరీరం నాశనంచేయబోతోంది. ఆ తృప్తినినేను ఈ పాడు శరీరానికి ఇవ్వతలుచుకోలేదు. నిరాశతో ఘార్లిపోయేఉత్తరం రాశారు, సూర్యనారాయణగారు. నే నంతకన్న ఘోరమైన ఉత్తరం రాశాను ఆయనకి.

౧౭౫

నూజివీడు
7-1-48

My dear chum,

ప్రతిరోజూ మీకు రాద్దామనే. కాని రాయడానికి వ్యధ తప్ప ఏమీలేక వూరుకున్నాను. డాక్టరుగారి వొళ్లు బాగా లేదు. వైద్యానికి ఈవూరు వొచ్చారు. వసంత్ వెళ్ళిపోయి నాడు, తప్పుఅర్థం చేసుకున్నానని నేను తనకి చెప్పే వ్యవధి నాకివ్వక. ఈ ఏడుపంతా మీతో ఏడవడం ఇష్టంలేక వూరు కున్నాను.

Divisional Inspector వెళ్ళాట్ట. విచారణకోసం - తెనాలి నేను నా పుస్తకాలిచ్చి డబ్బు తీసుకున్నాననేమో నని. ఆ ప్రెస్సులో మన సుబ్బారావు వున్నాడు. ఆనాయుడు తో అన్నట్టు, 'నువ్వు సి. ఐ. డి. వి. చలంవంటి వాడు నీ కెట్లా అర్థమౌతాడు? నీ బతుకంతా డబ్బుకీ ఉద్యోగానికీ బతికావు. డబ్బు లెక్కలేదనేవాడు ప్రపంచంలో వుంటాడనేది

నీ బుర్ర కేంచేసినా ఎక్కదు. అతనిపేరు ఉచ్చరించడానికి అర్హతలేదు నీకు. అని బాగా తిట్టాడట.

తన విచారణకి హాజరుకావాలని నాకు ఉత్తర్వులు పంపాడు, ఆ నాయుడు. నే నిట్లా జవాబు రాశాను. తెలుగు లోనే.

'మనలోమాట. నాకా పెన్షన్ మీద ఆశ వుందనుకుంటు న్నారేమో! ఏమీ లేదు. నే నడగనుగాని, అడిగితేనా, నా పిల్లపస్లు నాకు డబ్బిస్తారు. ఖరీదుగల నా పుస్తకాలు నెలకు ఎన్ని కాపీలు అమ్ముడుపోతున్నాయో మీ ఆఫీసుకు ఏమన్నా తెలుసునా?

మీ ఆహ్వానాన్ని అందుకుని(ఖర్చులు మీరిస్తారుగావును) పోనీ రాజమండ్రి వొచ్చి, మిత్రుల్నీ, గోదావరినీ, పాపం ఇప్పుడెట్లావున్నారో మిమ్మల్నీ, నా పుస్తకాలు ఉచితంగా తీసుకుని డబ్బుచేసుకుని, నామీద సాక్ష్యంచెప్పే నా పిల్ల పర్ల సిగ్గులేని మొహాల్నీ, చూడ్డామనిపించింది. కాని ఇది శరదృతువు. మా ఇంటివెనక అడివి కొత్త అందాన్ని తొడిగింది. వొదిలి ఎట్లా రాను?

అదీగాక, ఆఫీసర్లూ, ఆఫీసులూ, విచారణలూ, అన్నీ కాలగర్భంలో కలిసిననాటికూడా యువతీ యువకుల్ని ప్రజ్వ లింపచేయగల కొత్తపుస్తకాలు రాస్తున్నాను. నన్ను డిస్టర్బు చెయ్యకండి. పాపం, మీ విచారణలేవో మీరు కానిచ్చు కోండి.' అని రాశాను.

మానసికంగా శాంతంగా ఉన్నానిపుడు. ఆరోగ్యంకూడా బాగుపడుతోంది. ఆధ్యాత్మికంగా భగవాన్‌కోసం తపిస్తున్నాను. కాని ఆయన దూరంగా బిగుసుకున్నారు. మార్గం step by step స్పష్టమౌతోంది.

మనం మనం రాసుకుంటున్న ఉత్తరాల్ని సరిగా అర్థం చేసుకోలేకపోతున్నాము. అంటే మన Idiologies లో ఒకరికొకరం దూరమౌతున్నామన్నమాట.

మీ శిష్యుడు ఒకరు నా సలహాపైన రమణాశ్రమానికి వెళ్ళారు. అక్కడ ఆ ఆశ్రమవాసులనించీ అధికార్లనించీ అతను పొందిన ఉపేక్షనీ ఇబ్బందుల్నీ చెప్పారు. ఒక భక్తుడు బావిలోపడి ఆత్మహత్య చేసుకున్నాడట.

ప్రేమలో మనుషుల్ని జయించడమా ? ఈ మనుషులందరిపై నాకేం ప్రేమలేదు. నాకు వాళ్ళపైన ప్రేమ వుండాలనీ లేదు. వాళ్ళలందరూ నా ఆత్మే అయినాసరే. పో అందర్నీ నామల్లేనే ప్రేమించాలంటే—ముందు నా మీద నాకు ప్రేమలేదు... వాళ్ళమీద ఎట్లావుంటుంది ? ఆ self అదేమో అది నాకు తెలీదు. దానిపైని ప్రేమేమిటి? కాళిదాసు రాసిన ఆ నాటకం పేరేమిటి ?

౧౭౬

నూజివీడు
22-6-48

ఓ దీక్షితులుగారూ,

ఎన్నాళ్ళకండీ మీకథ చదవడం? బాపట్లా వాడ్రేవూ వెళ్ళి కొన్నాళ్ళుండివొచ్చి మే నెల శిల్పినిచూశాను. మీ చిన్ననవ్వులూ, కళ్ళచివర కొంటెతనం – అన్నీ – అదరాస్తో వుండగా మీపక్కనే కూచున్నట్టనిపించింది.

మొత్తానికి మీరూ రామ్మూర్తిశాస్త్రుల్లగారూ సమగ్రంగా చర్చించారు విషయాన్ని ఇంకా కొన్ని మీరు ఆ విధంగా చర్చిస్తే బావుంటుంది. మద్యపాననిషేధం, భోగం మేళాలూ, గాంధిగారి హత్యా, మొదలైనవి – కాకపోతే ఆంధ్రశిల్పం, అభ్యుదయాలూ, ధరలూ, అన్నీ అట్లాగే వున్నను ఇక్కడ ఈసుకోమంటో. నాతలనొప్పులతో, మీరూ Mr. భొట్లూ బజారుపోయి మామిడిపండ్లు కొంటున్నారా!

౧౭౭

బెజవాడ
14-1-49

My dear Norse,

నేను స్వతంత్రతో పోట్లాడాను డబ్బుఎగకొట్టారు. మోసం చేశారు. నూజివీడు మానవల్లిగారితో కూడా పోట్లాడాను. లీలగారికి ఆమెవిరోధమైనారు, అందుకని. కథల ప్లాట్లకోసం వెతక

డంతో సరిపోతుంది నాపని. మీరుకూడా వుంటే మంచిమంచి మనుషుల్ని సృష్టించేవాళ్ళం. షౌ కూడా కథలురాస్తోంది.

రంగనాయకమ్మగారు ఆశ్రమంనించి వొచ్చారు సంవత్సరందాకా ఇక్కడేవుంటారట. భగవాన్ అనుగ్రహంలో చాలా సంతోషంగా, సుస్థిరంగా ఉంటున్నారు. వొళ్ళు బాగాలేదు. భీమవరంలో చేరాలని చూస్తున్నాను, నేచరోపతి ఆశ్రమంలో.

ఏంచేస్తున్నారు? కాలం ఎట్లా? చదువుకుంటారా? ధ్యానమా? గోదావరివంక చూస్తున్నారా? ఇక్కడున్నా ఉంటే కాలక్షేపం చేద్దుము.

౧౭౮

బెజవాడ
29-5-49

My dear dear,

మీ జబ్బుగుండెతో మీ రేమవుతున్నారో అని ఆలోచించుకుంటో వుంటాను. ఎవరూ భరించడం కష్టమైన నాతో ఇంకపడలేక లీలగారు వెళ్ళిపోయినారు. మధురమైన సంకెళ్ళు ఒకటి తరువాత ఒకటి ఇట్లా రాలిపోతున్నాయి. నాకుమీమీద అంత ఇష్టమైనందుకు, మిమ్మల్ని ద్వేషించే, నా మిత్రుడొకాయన నన్ను అరుణాచలం తీసుకపోతున్నారు, ఖర్చులేకుండా. భగవాన్ అనుగ్రహం మాపైన వుంటే, నేనూ పిల్లలం ఈ దేశంవొదిలి అరుణాచలం వెళ్ళిపోదామనుకుంటున్నాము. వెళ్ళగలిగితే బావుండును. భగవాన్ దగ్గిరకి

వెళుతున్నానంటే చాలా సంతోషంగా వుంది. ఈసారి నా పైన ఆయన కరుణగా వుంటారని నా ఆశ. నాకు జీవితంలో కలిగిన ఒక్క Solace and hope కీ మీరే కారణం.

ఏమిటి మీకనేది? నేను ఆ పాడు కవిసమ్మేళనానికి వెళ తాననుకున్నారా? నేనూ సారెన్ వాళ్ళకి గ్రీటింగ్సు పంపాను.

దివిగంట మోగింది కవివాళ్ళకోసరము
కవిగంట వినిపించి చవిచూడ మన్నాడు
భువికి జేగంట ఐ, రవి ఉదయించగా
కవి, కంచమునుకొని, కడగంగజూచి
విశ్వవాహినిలోన, విసిరివేశాడు
అశ్వనీదేవతల్ ఆశ్చర్యమొంద

ఆ కవులలో ఎవరూ ఇటు నన్నుచూడ రాలేదు, వూరంతా ఇంకా తిరుగుతోనేవున్నారట వాళ్ళు.

నే నేం చేస్తున్నానా? ఏం లేదు. బతుకులోనో, చావులోనో, భగవాన్ అనుగ్రహం చూపుతారేమోనని ఎదురు చూస్తో వున్నాను.

౧౭౯

అరుణాచలం, భగవాన్ హాలు
4-6-49

Oh my dear,

పారాయణ జరుగుతోంది. ఈకొత్త హాలు ఏంబాగాలేదు. అంతా civilise ఐ పోతున్నాయి భగవాన్ చుట్టూ. నిన్న

గోవిందరాజుల సుబ్బారావుగారు చెప్పారు, ఇక్కడే మీ అమ్మాయికి సంబంధం కుదురుస్తున్నామని.

'వెళ్ళిసరే. ఇక్కడికి వొచ్చివుండిపోడానికి దీక్షితులుగారికి ఏలుకలగచేసిన పుణ్యంవుంటుందిమీను.' అని చెప్పాను ఆయనతో - నేనూ ఇక్కడికి కాపరం ఎత్తేసే చిన్హాలుగావుంది. వొస్తామూ? ఇక్కడవొచ్చివుంటామూ!

ఎట్లావుంది మీ గుండె?

౧౮౦

బెజవాడ

17-6-49

My dear Duck,

మీ రెండుకార్డులు నేను ఆశ్రమంలో ఆరురోజులున్నాను. తరవాత భగవాన్ పంపించేశారు. ఆయన చాలామానం ఇప్పాడు. నేనక్కడ ఉన్నరోజుల్లో ఆయన తనంతటతానుగా పలకరించింది నన్నువొక్కణ్ణే. ఎప్పటికంటెకూడా ఎక్కువ శక్తివంతంగా కరుణామయంగా వున్నాడు. ఆశ్రమంచుట్టూ, ఇళ్ళుకట్టుకుని దీక్షతో నిలబడ్డ శిష్యులు ఏర్పడ్డారు ఇప్పుడు - వాళ్ళలో చాలామంది పరదేశీయులు.

Ashram is growing more efficient, comfortable and damn mercinary.

ఈ ఆధ్యాత్మికమార్గం ఎవరికీ లాభంలేదు. అన్నీ త్యజించి భగవానే అనివొచ్చిన ఈ విదేశీయులకే దానివల్ల లాభం. నీ పిల్లల్నిగాని నీ కళాన్నిగానీ, నీది అనుకొనన్నాళ్ళు, ఈ ఆధ్యాత్మికవిద్యకి నీళ్ళు వొదలవలసిందే.

భగవాన్ బాగావేడున్నారు. నడవలేనట్టు నటిస్తారు. తనని చూసేవాళ్ళ హృదయాన్ని పిండి తనకి కట్టేసుకోడానికి. ఆయన పసిపిల్లమల్లే నవ్వుతారు. చిరునవ్వుతారు. ఆయన కురుపుకూడా నయమయినట్టు కనబడుతోంది.

ప్రయాణం చాలాఖర్చు. ఈ స్థితిలో నేను భరించలేను ఇంకముందు. అప్పుడే మళ్ళీ వెళ్ళాలని కోర్కె బలమయింది. కాని భగవాన్ నన్ను ఆట్టేకాలం వుండేసు అక్కడ. అక్కడ వారంవుందామని ఆరురోజులే వుండకలిగాను. మళ్ళీఏమన్నా వొచ్చెయ్యవలసిన పనులున్నాయా అంటే, ఏమీలేవు.

౧౮౧

బెజవాడ
11-12-49

My dear blood,

భగవాన్‌కి మళ్ళీ ఏమన్నా జబ్బుగా వుందా? భగవాన్ లేని ప్రపంచంలో వుండగలమా?

నాకూ ఇక్కడ జబ్బుగొడవే. ఆరోగ్యం సరేసరి. ఇట్లా వుంది మనసంగతి. కథలురాస్తున్నాను సంపాదనకోసం. కసితీరా డబ్బు వసూలు చేస్తున్నాను. కాని రాయగల్గింది స్వల్పం.

అసలు బతుకు కొంత హాయిగా వుందా మీకు?

అరుణాచలం వెళ్ళేముందు నేను లీలగారిదగ్గరకు ఉప్పాడ వెళ్ళిరావాలి. మమ్మల్ని తనదగ్గిరికి ఎట్లా తీసుకుంటారో ఏమో భగవాన్.

మా వస్తువులన్నీ తొర తొరగా అమ్మేసుకుంటున్నాము. చెప్పుకోడానికి మాదగ్గిర ఏమీ డబ్బులేదు. ఇవన్నీ అమ్మి ఏ రెండువేలన్నా చేసుకోవాలని ఆశ. ఎవరూ కొనటంలేదు. ఆపని కాగానే బైలుదేరతాము. తన సమక్షంలో బతకడానికి భగవాన్ అనుగ్రహిస్తేనే కద, మేము బైలుదేర కలగడం ?

భగవాన్‌కి మళ్ళీ జబ్బుగావుందని, ఆశ్రమంనించివొచ్చిన ఒకాయన చెపుతున్నాడు. నిజంకాకపోవచ్చు. భగవాన్ దగ్గిరికి వెళ్ళిపోవాలని తహతహ పడుతున్నాను.

రేడియోవాళ్ళు ఈసారి నా గుమ్మంలోకి వొచ్చినప్పుడు మీరు కనుక్కోమన్నది కనుక్కుంటాను.

౧౮౨

బెజవాడ
12-12-49

**My dear Disappointed,**

ఏమిటి రేడియో స్టేషన్‌లో నాకు మిత్రు లున్నారనుకుంటున్నారా మీరు ? వాళ్ళు నాతో స్పష్టంగా చెప్పారు. నా నాటకాలు చాలా ప్రజారంజకంగా వున్నాయిగనక తీసుకుంటున్నామని. నేనింత బీదవాణ్ణైనాను. గనక వాళ్ళకి ఇవ్వడం సంభవించిందని నే నన్నాను. ఇప్పుడు నన్ను వొదిలేసుకున్నారు. కాని మీరు అడిగినసంగతి మిత్రులద్వారా కనుక్కుని రాస్తాను.

ఇంక మళ్ళీ తిరిగిరాకుండా, మా వ్యవహారాలు పూర్తి చేసుకుని పోవాలని.

రేడియో స్టేషను చాలా వికారంగా కంపుకొడుతోంది. ఇవన్నీ వొదిలిపోతున్నామని చాలా సంతోషంగా వుంది.

రేడియోలో విన్నాను. మీ సహజమైన delicate humour వినిపించింది. చివర మరీబావుంది. మీరే చదివితే ఇంకా ఎంతబావుండునో!

౧౮3

బెజవాడ
5-1-50

My dear calmer,

భగవాన్ కి మళ్ళీ ఆపరేషన్ జరిగిందని తెలుసామీకు? రెండు రోజులకిందటే ఆస్పత్రిలోంచి హాలులోకి వచ్చారట. మాపనులు ఇక్కడ ముగిసుకుంటున్నాము. బుట్టా, తట్టా అమ్మేశాం. పదిహేను రోజుల్లో, ఆంధ్రరాష్ట్రం రాకముందే తప్పించుకు పోగలం అనుకుంటున్నాము.

మా నర్తకి అరుణాచలంలో వుంది.

ఇన్నేళ్ళు భగవాన్ దగ్గరే వుండకుండా ఎందుకు వృథా చేశానా, ఇప్పుడైనా ఈ సామాన్లూ అవీ అమ్మి డబ్బుచేసుకోడంలో కూచోకుండా ఎందుకు పరుగెత్తానా అనిపిస్తోంది. అంత impothent గా వుంది ప్రాణం. భగవాన్ ఎట్లా తలుస్తున్నారో! ఇవాళ ఉత్సవంకదూ ఆశ్రమంలో!

౧౮౪

బె జ వా డ
8-12-49

My dear Jostler,

అరుణాచలంనించి ఇవాళ పొద్దున్న నర్సకి వొచ్చింది. భగవాన్ వార్తలు తెలిశాయి. వెళ్ళిపోవాలని చాలా ఆత్రుత పడుతున్నాను. భగవాన్. సాయపడాలి. భగవాన్ సంతోషంగా వున్నారుట.

మీరు ప్రయత్నించండి అక్కడేవొచ్చి భగవాన్తో వుండిపోవడానికి.

అన్నీ సర్దుకుంటున్నాము – నాపుస్తకాలు ఏమీ అరుణాచలం తీసుకుపోవటంలేదు. భగవాన్ తప్పదని రాయిస్తేతప్ప నే నింక ఏమీ రాయబోవటంలేదు.

భగవాన్ అనుగ్రహంవల్ల ఈసారి నేను శాంతిని సాధిస్తాను, లేదా ఆ ప్రయత్నంలోనే మరణిస్తాను.

౧౮౫

బె జ వా డ
3-2-50

My dear Inquiry,

వెడుతున్నాం. బుధవారం 8 ఎక్సుప్రెస్‌లో బైలుదేరాలని. భగవాన్ ఆశీర్వదించి బైలుదేరచేయాలి.

రేడియోవాళ్ళకి ఈమధ్య Go to Hell అని రాశాను. దాంతో వాళ్ళతో తెగతెంపులు చేసుకున్నాను. అట్లా రేడియోని అంటే ఈ స్వేచ్ఛాభారతప్రజలకి కోపం.

వెడుతున్నాం. వెడుతున్నాం. వెడుతున్నాం.

చాలా సంతోషంగా ఉత్సాహంగా ఆడుతో వెడుతున్నాం, భగవాన్‌కోసం.

౧౮౬

అరుణాచలం
11-2-50

భగవాన్ అనుగ్రహంవల్ల పిల్లలతోసహా, నా సొంత గృహానికి (అంటే అరుణాచలానికి) చేరుకున్నాను.

భగవాన్ ఆరోగ్యం నయంగావుంది. కాని తనగదిలోనే వుంటున్నారు. కష్టంతో నడుస్తున్నారు.

ఇక్కడ త్వరలో నీటికరవు వొచ్చేట్టుంది.

౧౮౭

అరుణాచలం
1౯-2-50

My dear Poucher,

మీ కార్డు. ఇక్కడికివొచ్చి స్థిరపడడం నాఆశయం మాత్రమే ఐనట్టు రాస్తున్నారు మీరు. మనిద్దరిదీ కాదా? ఇప్పుడు మీరు వెనుకంజవేస్తున్నారు. ఎందుకురారు మీరు?

ఈసారి ఆశ్రమంలోకూడా శాంతి కుదిరింది నాకు. భగవాన్‌లో ఆనందంగావున్నాను. ఇన్నాళ్ళకి ఈనాడు నా జీవితం ఏకముఖమయింది. భగవాన్ అనుగ్రహం పొందడం తప్ప ఇంకోదృష్టి లేదు.

భగవాన్ ఆరోగ్యం భయపెడుతోంది. కనపడడం మెరుగుగానే కనపడుతున్నారుకాని, కొత్తవాపులు బైలుదేరుతున్నాయిట. ఆయన కదలనుకూడాలేరు. కాని ఆయనకోసం కాచుకునివుండే మాబోటివారిమీద ఎంతోదయవల్ల రోజూనాలుగు

గంటలు దర్శనమిస్తున్నారు. మా భవిష్యత్తుని ఆయన ఏవిధంగా నిర్ణయించబోతున్నారో తెలీదు.

Hare I come here to Bhagvan too late,only to watch the (imaginary) decy of Bhagavan's body? Why did I tarry away so long?

అప్పుడే అక్కడిమనుష్యుల్ని మరిచిపోతున్నాను.

నిన్న ఒకమిత్రుడు నన్ను కారులో ఒకపెద్దస్వామిని చూడడానికి తనియుర్ అనే వూరికి తీసుకునివెళ్ళారు. ఆయన అన్నారు, భగవాన్‌సంగతి

'ఆయన వెళ్ళిపోవలసినకాలం సమీపించింది' అని.

So that is that.

I do not know when I will be thrown out to drift ai nless in the world.

౧౮౮

ఆరుణాచలం

13-3-50

My dear Expected,

నిజంగావొస్తున్నారా? ఎంత సంతోషమైనరోజు, మీరు వొస్తే!

భగవాన్ తానే స్వయంగా ఒక మహాత్మ్యమైనారు. మా డాక్టరుస్నేహితు డంటున్నారు. ఆయనకి వొచ్చిన సార్కోమా వొచ్చిందా ఏ మానవశరీరమూ దానిబాధని తట్టుకో అని. ఆయన ఎప్పుడూ చిరునవ్వుతో వుండడం, అదే హాత్యం. మనసు చచ్చిపోతే ఇంక బాధఅనేది

లేకనే ఆయన బోధించిన సిద్ధాంతాన్ని ఋజువుచేసి చూపిస్తున్నారు. తనదేహం తక్కిన శరీరాలమల్లెనే బాధపడుతుందని. కాని ఆ బాధ తనని అంటదనీ మనకి ప్రత్యక్షంగా చూపుతున్నారు.

Any how it is also a dramatic gesture winning the pitying hearts of his audience and enchaining them to his Blessed feet.

భగవాన్ కురుపు ఎక్కువయిందిట. ఇప్పుడు పగలు అరగంటా సాయంత్రం అరగంటామాత్రమే దర్శనమిస్తున్నారు. ఆయన అడుగుతారట, 'ఏం, నేను త్వరగా మరణించి పోవాలని వుందా మీకు! నాకేం వచ్చిందట!'

ఆయన బాధతో కనులతో వుంటే ఆడవాళ్ళు ఏడుస్తున్నారు.

రత్నమ్మ పుత్రపౌత్రసంగతి అడిగారు నాకు. ఆమె ఆఖరు ప్రియుడు ఆమెతో రైల్లోనే వున్నారట. కాని చావుని తప్పించుకున్నారు పాపం!

తొందరగా రండి. వేరే వ్రాయడమెందుకు? మీకిష్టమయితే, సరాసరి ఇంటికే రండి.

౧౮౯

అరుణాచలం
20-[illegible]-50

**My dear coming**

అవును. చాలామంది భయంతో తొందరపడి భగవాన్ దర్శనానికి వొస్తున్నారు. సి. పి. రామస్వామిఅయ్యర్‌గారితో

సహా. నిన్న చాలా ఉల్లాసంగా వున్నారట భగవాన్. శిష్యు ల్ని బాగా తిప్పలుపెట్టారట. వాళ్ళు భక్తులమధ్యనించి లోప లికి తీసుకుని వెళ్ళాలంటే ఓపట్టాన లేవక పసిపిల్లాడిమల్లే పోట్లాడతారు ఆయన. 'చూడండి, ఎంతమంది నాకోసం అట్లా పడిగాపులు పడివున్నారో. నే నెట్లా లోపలికి వెళ్ళను?' అంటారట. ఆయనకరుణ చూడండి.

పశుమలై స్వామివారు కాగు పంపితే, రంగనాయకమ్మ గారూ పిల్లలూ పశుమలై వెళ్ళారు.

ఇప్పుడు గురువు ఏరాశిలోవున్నాడో ఎవరినన్నా కను క్కొని రాయండి. గురువు కుంభంలోకి వొచ్చిందిమొదలు భగవాన్ ఆరోగ్యం బావుంటుందిట. ఏమో, ఆయనశరీరా న్ని గ్రహాలే నడుపుతాయేమో! ఇట్లా భగవాన్‌కి ఇప్పుడు జబ్బుచేస్తుందని పోయినసంవత్సరమే జోస్యంచెప్పలేదా సూర్యనారాయణగారు.

తన వైరిభక్తుల్ని భగవాన్ ఎట్లా ఆడిస్తున్నారోచూస్తే తమాషాగా వుంటుంది. ఆయనకివొచ్చిన జబ్బు ఏరోగైనా అపాయకరమే. కాని ఆయనమొహం చూస్తేమాత్రం భయం అనవసర మనిపిస్తుంది. కనక ఎవరూ ఏమీచెప్పలేరు ఆయనసంగతి.

మీకురావడానికి భయ మెందుకు? ఓ ముసలమ్మ మధు మేహంతో, రక్తపుపోటుతో, ఏమీ ప్రయాణంచెయ్యలేని ఆమె వొచ్చింది భగవాన్‌కోసం. ఇప్పుడా జబ్బులేవీ లేవు ఆమెకి.

వాతావరణలూ, వ్యాపారాలూ, నామీద నాకే జాలీ, ఇటువంటి అర్థంలేని, కారణం వ్రాయడానికి వీలుకాని బాధలు తప్ప-తక్కిందంతా బావున్నాను.

౧౯౦

అరుణాచలం
25-3-50

My dear Cnofident

ఆ పక్షంమల్లైనుంచి పిల్లలు వొచ్చారు. మళ్ళీ వెడతారట. అదో చిత్రమైన కథ.

కొందరు భగవాన్ కొద్దివారాలకే వుండేట్టు మాట్లాడతారు. ఆయన్ని చూడవొచ్చిన భక్తులు ఆయనముందే ఏడ్చి మీరెంతో నీరసంగా వున్నారంటే, భగవాన్ తనచేతిని చూపి, చిరునవ్వుతో 'చూడండి, నేను హాయిగా వున్నాను' అంటారట. చాలాసంతోషంగా వెలుగుగా కనపడుతున్నారాయన.

సర్వాధికారి మాత్రం చాలా స్టెడీగా వున్నారు. పైనుంచి ఏ దేవతలో ఏం ఫరవాలేదని ఆయనకి చెప్పినట్లు.

కొత్తహాలు రాజభవనంలాంటిది కట్టించారు ఆయన భగవాన్ కోసం. ఆ హాలులో కూచోకుండా తప్పించుకోడానికి భగవాన్ ఈ రోగం తెప్పించుకున్నారనుకుంటాను.

మీరు రాసేసంగతి నిజమై భగవాన్ ఇంకో ఎనిమిదేళ్ళు బతికితే ఎంత బావుంటుంది? ఆయనతో ఎనిమిదేళ్ళు వుండడమో, ఆయన అనుగ్రహపు కాంతిలో చచ్చిపోవడమో! అంతకంటె ఏంకావాలి?

సర్వాధికారి ప్రభ ఎక్కువవుతోంది. బలాన్నీ భయాన్నీ కల్పించుకుంటున్నాడు అందరిలో. భగవాన్‌కన్న ఆయనకే ఎక్కువ భక్తులిప్పుడు.

భగవాన్‌కి నిజంగా ఎట్లావుందో, ఎవరూ సరిగా చెప్పరు. ఎవరికీ తెలీదా? ఎవరినడిగినా గొప్పగా వాళ్ళకే తెలిసినట్లు, 'ఏమో, భగవాన్ ఏమి తలచారో ఎవరు చెప్పగలరు?' అంటారు.

*14-4-50 న భగవాన్ నిర్యాణాన్ని పొందారు. దీక్షితులుగారు అరుణాచలం వొచ్చి పదిహేనురోజులుండి వెళ్ళారు.*

౧౯౧

అరుణాచలం
30-4-50

My dear Akbari,

అందరూ వెళ్ళిపోతున్నారు. రమణనగరం. ఖాళీ ప్రతి రోజూ ఉదయం సాయంత్రం ఓ అయిదుగంటలసేపు భగవాన్ పాదాలదగ్గిర గడుపుతున్నాను. ఆయన నాపైన అనుగ్రహం చూపనీ చూపకపోనీ.

Miss meston కూడా వెళ్ళిపోతున్నారు. కారణం అడిగితే, ఇదంతా బ్రాహ్మల వ్యవహారం అయింది. మమ్మల్ని ఎడ్మిట్ చెయ్యరు. భగవాన్‌కి అది తెలుసు. అందుకనే ఆయన బాధపడుతూ పోయినారు. ఆబాధ మొహంమీదే కనపడ్డది అన్నారు ఆమె.

తమాషా జరిగింది.

చిన్నపొట్టున్న సర్వాగ్నిశాస్త్రి గొప్పగా భగవాన్ సమాధి దగ్గరికి వొచ్చాడు. ఆయన రాగానే ఇదివరకు భగవాన్ వొచ్చినప్పుడుమల్లే అందరూ లేచి నుంచుని, ఆయన పాదాలకి సాష్టాంగపడాడు. చేసినా కృత్తికీతప్పు. మమ్మల్ని ఎప్పుడో వెళ్ళగొడతాడు.

ఒకాయనతో అంటున్నాడు అతను 'ఏమిటి? ఎందుకు వెళ్ళిపోతాడు? ఇదేనా భగవాన్ ఇచ్చేది శక్తి! ఎంతస్పష్టంగా తెలుస్తోంది భగవాన్ మనలోనే వున్నాడని!' ఎంతమూర్ఖుడు ఈసర్వాగ్నిశాస్త్రి అనుకున్నాను.

కొంచెంసేపటికి కిష్ణస్వామి వచ్చి సమాధికి ప్రదక్షిణాం చేస్తున్నాడు. సర్వాగ్నిశాస్త్రి అతనివెనకనే తనూ ప్రదక్షిణం చేశాడు. అతను ఏంచేసిపోతాడో అన్నట్టు వాళ్ళిద్దరూ ఓ చోటే కూచున్నారు. కిష్ణస్వామి బిగ్గరిగా ఇట్లా అన్నాడు.

'భగవాన్ అందరివాడు. నీ అన్న అనుకోకు. ఆయనకి తమ్ముళ్ళూ లేరు, తల్లీ లేదు. నువ్వు ఎట్లావొచ్చావో నేనూ అట్లానే వచ్చాను. నువ్వేం గొప్ప? ఇంకా నేను భగవాన్ సేవకుణ్ణయి, ఆయన దేహాన్నంటి పదహారేళ్ళు సేవచేశాను. నువ్వేం చేశావు? అందుకునే నేను ఆయన సమాధిని విడవలేకపోతున్నాను. ఆయన సమాధిని నేను వొదిలివెళ్ళినా, ఆయన నాలో ఉండేశక్తి నాకు వొస్తే నాకుతిండీ అక్కర్లేదు, నీలాంటివాడితో ఈమాటలూ అక్కర్లేదు. ఇదివరకంటే,

భగవాన్ వుండగా, సీఆటలు సాగాయి; సీదొంగ వేషాలూ, అబద్ధాలూ, కుట్రలూ. ఇదివరకుమల్లేనే సాగించారా, ఒక్క నిమిషం నిలవలేవు. నేనుకాదు చేసేది, భగవానే చేస్తారు. నేనెంతవాణ్ణి! తల్లిగుళ్ళోకి తెల్లవాళ్ళని (వాళ్ళనించివేలకివేలు వసూలుచేసి) రాకండా చేశావు. భగవాన్ సమాధిదగ్గిరికి రానీకండా చేశావా, సిగతిచూసుకో. సమాధిని నువ్వుముట్టు కోవొచ్చును. కాని బ్రాహ్మణ్ణికానుగనుక నేను ముట్టుకోకూడదా! నేను భగవాన్ని ముట్టుకొని సేవచేశాను. భగవాన్కి లేనిమైల సమాధికి వొచ్చిందా?'

ఈ తగాదాఅంతా కిష్ణస్వామి సమాధిపైన పూలదండ పెట్టాడని, అతన్ని సమాధిదగ్గిరికి రానీటంలేదు.

భగవాన్ సమాధిలోంచి ఉజ్వలంగా వుంటున్నారు. మీరు వెళ్ళడం తప్పనని చేశారనిపిస్తోంది. కాదులెండి భగవానే మిమ్మల్ని పంపారు. మీతోనే వుంటారు. మొద్దబ్బాయిని నన్ను వుంచేశారు ఇక్కడ.

వున్నాను ఎవరూలేరు మనషులకి కరువువాచినట్టువుంది. అంతవొంటరిగా భయంగా వుంటుంది.

ఇంక ఈ ఆశ్రమానికి ముందుగతిలేదు. నేను ఆనందాశ్రమానికి పోదామాఅని ఆలోచిస్తున్నాను. భగవాన్ ప్రజ్వలంగా వున్నారు. కాని జీవితం వొంటరిగావుంది నా-మ్మ పదేపదే సర్వాధికారికాళ్ళకి సాష్టాంగపడుతోంది. ఏమనాలి వీళ్ళని! ఇన్నేళ్ళమట్టి భగవాన్తో అంతదగ్గిరిగా మెలిగిన వాళ్ళు ఇట్లాంటిపనులు చేస్తారంటే! మనకి కనపడని గొప్ప

ఆయన అంతటితో ఆగిపోయినారు. 'నే నీనాటికీ రెడీ కాలేదు' అన్నారు.

అందంగావుందికదూ!

భగవాన్ నన్ను ఇక్కడనించి వెళ్ళిపొమ్మంటున్నారని పిస్తుంది అప్పుడప్పుడు. కాని అరుణాచలం ఎట్లావొదలడం?

సమాధిదగ్గిర ఎంతశక్తి! తల చీల్చుకుని లోపలికి వెడు తోంది అంత నా అనారోగ్యంలోంచీ.

౧౯౨

అరుణాచలం
2-5-50

My dear Kume,

ఇవాళ బుద్ధుడిదీ చలందీ పుట్టినరోజు. నిన్న ఆశ్రమంలో హడావిడి జరిగింది. కృష్ణస్వామి భగవాన్ సమాధిమీద వెయ్యడానికి పూలదండతో వొచ్చాడు. సర్వాధికారి అడ్డం నుంచున్నాడు. కృష్ణస్వామి వెళ్ళి అబ్రాహ్మణుల గుంపుతో వొచ్చాడు. బోసు, కోహెన్ మొదలైన మధ్యవర్తులు కష్టం మీద యుద్ధాన్ని ఆపారు. మళ్ళీ వొస్తానని బెదిరిస్తో వెళ్లాడు కిష్టస్వామి. ఇవాళపొద్దున్న పోలీసు సూపరెంటు ఈతగాదాల విషయమై నా అభిప్రాయాన్ని అడిగాడు. 'వొద్దంటోవుంటే సమాధిపైన పూలదండ వేస్తాననేపట్టు బుద్ధిలేనితనం. పూల దండ వెయ్యకండా ఆపడం అంతకన్న బుద్ధిలేనితన'మన్నాను. ఏనాడైనా, భగవాన్ అందరివారు. ఒక కులానికి మాత్రం ఆయన సమాధిపైన అధికారమేమిటి? చిన్నసామి సాహసం చూడండి. అంటున్నారుకదా! 'ఆశ్రమంలో కులసంకరంవల్ల

భగవాన్‌కి కుదుపు తెచ్చింది. ఆయన అబ్రాహామ్నుల్ని నెత్తి కెత్తుకున్నారు. దాని ఫలితం' అని. ఆశ్రమంలో ధ్యానానికి ఏమీ వీలులేదు. అంతా యుద్ధమయం.

భగవాన్ నన్ను వదిలేశారు. అనారోగ్యం. పళనిమలై స్వామి చాలా గొప్పవారనే అనుభవం శారీన్‌కి కలిగింది. ఆయనకి భగవాన్‌పైన చాలా ప్రేమట. మేము పళనిమలై వెళుతున్నాము. శారీన్ తలనొప్పులు నయంచేశారు ఆయన. నాదీ కుదురుస్తారేమో!

నాకు మృత్యువు దగ్గరలో వుందనిపిస్తోంది. సూర్యనారాయణగారుకూడా అట్లాగే జాతకం చెప్తున్నారు. వొచ్చే జన్మకి ఆధ్యాత్మిక యోగం సంగతి అట్లావుంచి, బతికిన నాలుగురోజులూ దయగలవారిమధ్య బతుకవలసివుంది. పళనిమలైలో ఎట్లావుంటుందో చూడాలి. అక్కడ ఏమీ లేక పోతే నేనుఇక్కడికి తిరిగివొస్తాను. తనని భగవాన్ పళనిమలై స్వామిచేతికి వొప్పచెప్పి పోయినారంటోంది శారీన్. అతను తమాషా మనిషి. అహంకారి. నాకర్థంకావటంలేదు. నాకాయననించి ఆధ్యాత్మికమార్గంలో సహాయంకావాలి. అట్లాంటిది శారీన్‌కి దొరికింది.

ప్రతిరోజూ సమాధి దగ్గిర కూచుని నా ప్రార్థనలతో భగవాన్ హృదయం నాపైని కరిగేట్టు చేస్తున్నాను. ఇప్పుడు మొగవాళ్ళవేపున కూచునేది నేనువొక్కణ్ణే. అందరు వెళ్ళి పోయినారు. దూరం అనేదానికి అర్థంవుంటే, నాకన్న ఈ నాడు భగవాన్‌కి సన్నిహితులింకోరులేరు. నే నెంత మొత్తు

కోసీ, ఆయనపైని కించిత్ ప్రయోజనం లేదు. ఎంత దగ్గిరున్నా, ఎంత మొండికెపట్టుపట్టి ప్రార్థించినా, లాభంలేదు. ఆయన ఇష్టమైనప్పుడు, ఆయన పద్ధతిలోనే వాస్తారు.

౧౯౩

అరుణాచలం
11-5-50

My dear Wailing,

ప్రియమైన మీకార్డు. పళనిమలై ఏవూళ్ళో ఉన్నారో తెలుసుకుంటో ఇక్కడేవున్నాను ఇంకా. అతనే నా చివరి ఆశ. అక్కడా ఏంలేదా, ఈఆధ్యాత్మిక ప్రయత్నం మానుకోబోతున్నాను. మానుకుని ఎక్కడో ఏ శాంత ప్రదేశానికో పోయి (ఆంధ్రలో కాదు) నా చివరిరోజులు ఏప్రయత్నం లేకండా గడపబోతున్నాను. పాపం, భగవాన్‌కి చాలా పనులు ఆలోకంలో, ఈ లోకంలో మనసంగతి ఆయనకేం పట్టలేదు. నాకు చావుభయమూ లేదు. నర్తకీ, శీతాబాయి చాలా హాయిగా వుంటున్నారు, భగవాన్ అనుగ్రహంలో. నేనే ఇట్లా కృంగిపోతున్నాను.

*పళనిమలై స్వామి ఆశ్రమంలో చిత్రకూటురు డాలీకి విరోచనాలూ జ్వరం అని తెలిసి మందైనా లేదేలని ఆదుర్దాతో చలంకూడా తనియల్ వెళ్ళాడు. అక్కడ చాలాబావుంది. వాతావరణమే శాంతితో నిండివుంది. ఆ స్వామిదగ్గర మంచిమహత్యం కనపడ్డది. కాని ఆస్వామి తాను సంపాయించిన శక్తినంతా దుర్మార్గంగా మోసంగా ధనాన్నీ స్త్రీలనీ సంపాయించడానికి వినియోగిస్తున్నాడని తెలిసింది. చలం ఆయనభక్తులికిచెప్పి బైలుదేరి వొచ్చేశాడు. తనసంగతి బైటపెట్టినందుకు చలాన్నీ నర్తకినీ తిట్టి శపించాడు ఆ స్వామి.*

౧౯౪

అరుణాచలం
26-5-50

My dear Gombo,

త్వరలోనే పశుమలై స్వామి అనుభవాలు మీకు రాస్తాను. అతను చాలా గొప్పవాడన్నా కావాలి, చాలా అపాయకర మైన దుర్మార్గుడన్నా కావాలి. మీ రడగమన్నది ఎట్లాఅడ గను ఆయనని? ఆయన చాలా కోపంగావున్నారు ఆరోజుల్లో నామీద. నన్ను పశువని తిట్టి, అడవిలో ముళ్ళచెట్టునై పుట్టాలని శపించారు.

మాలపిచ్చమ్మగారు అర్జంటువార్త పంపారు నర్తకికి, తన దగ్గిరికి రమ్మని. ఆమె నర్తకిని పెంచుకుని, తన ఆశ్రమాన్ని ఇచ్చేస్తారట. నర్తకిని ఆమె ఎరగరు. నర్తకి వెళ్ళనంది.

చాలా తమాషాలు జరుగుతున్నాయి మంచికో చెడ్డకో కాని భగవాన్ కనిపెట్టేవున్నారు మమ్మల్ని రక్షిస్తో. ఆ పశుమలై స్వామి దుర్మార్గపు తపశ్శక్తిముందు భగవాన్ నిస్సహాయులని నేను భయపడ్డ సమయముంది. చాలా అవస్త పడ్డాను. పెద్ద పరీక్ష జరిగింది.

ఇంకా నన్ను వొదలలేదువాడు. వెంబడిస్తున్నాడు. నన్ను నాశనం చెయ్యడానికా? ఉద్ధరించడానికా? ఏం చెయ్యాలో భగవాన్ చెయ్యలేకపోయినారా? ఏ దెందుకు? ఈ వాతా వరణమంతా దుష్టమంత్రశక్తితో నిండివుంది. నేను బెజవాడ వొదిలి యోగులతో రాక్షసులతో కలతపెట్టే ఈదేశానికి ఎందుకు వొచ్చానా, అని యేడ్చాను.

౧౯౫

అరుణాచలం
1-6-50

My dear assuarance,

నిన్న ఆశ్రమంలో అభిషేకం. అంతా యుద్ధం. పోలీసు దళం. రుక్మిణమ్మభర్త మొదలయ్యారు (ఆయనకి తాను సర్వాధికారిని కావాలనే ఆశయం గావును) బలవంతంగా తను వేరే అభిషేకం చేశారు. ఆశ్రమంవారు లింగాన్ని దాచేశారు. ఆయన ఓ గుండ్రాయిని తెచ్చి సమాధిపైన పెట్టి అభిషేకం చేశారట.

ఆశ్రమ మంతా ఖాళీ.

పసుమలై ఇంకా మా వెంట పడుతున్నాడు. మా వెనకనే వొచ్చారు ఇక్కడికి. నాకూ, నర్తకికీ రెండు నెలలలో పెద్ద ఆపద రాబోతోంది అని చెప్పాడు. చాలా గొడవగా వుంది మనసు. భగవాన్ని ఒకటే ప్రార్థిస్తున్నాను. ఈయనకి ఎదురు భగవాన్ ఏమీ చెయ్యలేరా? ఏ దెయ్యంలోనూ దేవుడిలోనూ నమ్మకం లేకుండా హాయిగా బతికే నేను, ఈ గొడవల్లోకి ఎందుకు దిగానా అని నన్ను ఒకటే తిట్టుకుంటున్నాను. ఈనాడు పోవాలంటే దిక్కులేదు నాకు. ఆరోగ్యం, డబ్బు, శక్తి, ఏవీ లేవు కదలాలంటే. భగవాన్ వున్నారు. అదే నా ఆశ.

౧౯౬

అరుణాచలం
13—6—50

My dear Sicker,

ఇక్కడ భగవాన్ మాకు సహాయంగా వున్నారు. దొంగయోగు లుంటారు జాగ్రత్త అని మాకు పాఠంచెప్ప డానికి మమ్మల్ని పశుమలైస్వామి దగ్గిరికి భగవాన్ పంపించా రనిపిస్తోంది. చాలా భయంకరమైన అనుభవం.

ఇక్కడ చాలా కుట్రలు జరుగుతున్నాయి. సయ్యద్ మొదలైన భక్తులు దీన్ని ఓ రామకృష్ణాశ్రమంగా చెయ్యా లని చూస్తున్న ట్టుంది.

భగవాన్ దగ్గిరికి చేరాలని చాలా శ్రమపడుతున్నాను.

ఇంత జరిగినతరవాత, ఇన్నితిట్లూతిట్టి, ఇప్పుడే పశుమలై స్వామి మాఇంటికి వొచ్చారు, మళ్ళీ ఇంకోసారి, చాలా పశ్చాత్తాపంగా దయగా. ఇదో ఎత్తేమో!

౧౯౭

అరుణాచలం
24—6—50

My dear Me,

మీ ఉత్తరం. నిన్న మళ్లీ పశుమలైస్వామి చాలా స్నేహంగా మమ్మల్ని చూడడానికి వొచ్చారు. చాలా నమ్రతకూడా చూపారు. అదంతా ఓ పోజేమో ! అంతకు ముందు నా కో సంతకంలేసి ఉత్తరం రాశాడు — నన్ను

స్త్రీలని నమ్మవద్దనీ, సనాతన ధర్మమార్గానికి తిరిగి వెళ్ళమనీ ఉద్బోధిస్తో. మాల పిచ్చెమ్మగారికి రాశాను ఆయన్ని గురించి ఆమె ఉద్దేశ్యం తెలియచెయ్యమని (ఆ స్వాములవారు ఆమెని తీసుకుని వెళ్లి తనదగ్గిర వుంచుకున్నారు, కొంతకాలం, కొన్నాళ్ళక్రిందట). ఆ పశుమతైస్వామికి దేహాలంపటత్వం వొదలలేదనీ, అతని జోలిగాని అతనిదగ్గిరికి వెళ్ళడం గాని అపాయమనీ, వెళ్లినవాళ్ళు ప్రాణాలతో బైటపడరనీ, ఎన్నడూ అతన్ని నమ్మడానికి వీలులేదనీ రాశారు ఆమె.

మనుష్యుల్ని తన బానిసల్ని చేసుకుని, వాళ్ళని ఇంక తనని వొదలలేకండా కట్టేసుకునే ఉపాయాలూ మహాత్మ్యాలూ చాలా వున్నాయి అతనిదగ్గిర. వాళ్ళని తన వాంఛలకోసం ఉపయోగించుకుంటాడు. అత నిటువంటివాడని తెలుపుతో జాగర్త పడమని పత్రికలకి రాద్దామనికూడా అనిపించింది నాకు. అది నా ధర్మమేమోనని. నన్నుచూస్తే అదే భయమేమో ఆయనకి. అందువల్లనే నన్ను మంచిచేసుకోవాలని చూస్తున్నట్టున్నాడు. కాని నాకు ఏం చెయ్యడానికీ వోపికలేదు. పైగా అతనిలో మంచీవుంది. తప్పమార్గాన్ని పట్టిన తపస్వి.

ఆశ్రమంలో వకానస్వామి వేరే ఒక పార్టీని లేవతీసి, సర్వాధికారి చిన్నస్వామి విరోధుల్ని కలుపుకుని డబ్బు పోగుచేస్తున్నారు.

భగవాన్ని అందుకోవాలని చాలా గట్టిప్రయత్నం చేస్తున్నాను దినదినమూ.

మీా అల్లుడు మంచివాడేనా? లేక 'మా నాన్నా అమ్మా ఇష్టం' అనే శ్రీరాముడా? తనకోడుకు వెర్రిగా పనులుచేస్తు న్నాడని రాస్తున్నారు సూర్యనారాయణగారు. చూడండి భగవాన్ ఎట్లాచేస్తున్నారో! ఏమీా కరుణ లేదు. వానలు లేవు. ధరలు విపరీతం. మాడబ్బు ఖర్చైయిపోతోంది.

నా ఆరోగ్యం ఘోరంగావుంది. భగవాన్ శిలలాగు కదలక పూరుకున్నారు.

౧౯౮

అరుణాచలం
4–8–50

My dear Letter-head,

మీా ఉత్తరం. నా ఆరోగ్యం ఏంబాగాలేదు. దాంతో నామనసు గొడవపడుతోంది. ఆరోగ్యం కోలుకోడంకోసం ఎక్కడికన్నా పోవాలోఏమో? పశుమతి ఇంకా పేరులేని ఉత్తరాలు రాయిస్తోనే వున్నాడు. చిన్నస్వామి చాలా చెడ్డ వాడని ప్రతివాళ్ళు అంటున్నారు. భగవాన్ వైద్యానికి భక్తులు వేలుఇచ్చారట. ఆ డబ్బేమయిందో తెలీదు. కట్టుకు లింటుకికూడా డబ్బు ఇయ్యలేమని తల్యారుఖాను చెపుతోంది. మీారు రారేం?

నాకుఆరోగ్యాన్నివ్వమని భగవాన్నిఒకటే బాధిస్తున్నాను.

భగవాన్ మయమైనారు. ఒక స్కాబ్ యువకుడు ఇక్కడికివొచ్చి. భగవాన్ పరదేశీయులపాలిటవారు.

నిన్న భగవాన్ కన్ను కొంచెం పైకిలాగారు.

మాని ఆశ్రమంలో చాలా తగాదాలు రేపుతున్నారట.

ఆశ్రమ ఎడారిలాగుంది.

కాలమెట్లా గడుస్తుందంటారా? అదేమిటి? నాకు 'టైం' చాలటంలేదు. పొద్దున్నా సాయంత్రం భగవాన్ పాదాలవద్ద. మధ్యాహ్నం కొంచెంచదువు. బజారు వెళ్ళడం - చాలా శాంతంగా వుంది. కాని భగవాన్ మనసుని కెలుకుతున్నారో ఏమో! లోపల్నించి రాక్షసుల్లాగు పాతజ్ఞాపకాలు పైకివచ్చి పీక్కుతింటాయి. చాలా బాధ. ఎంతయుద్ధం. ఈ ఆధ్యాత్మిక సాధనంటే ఏమీ తమాషా కాదు.

చాలా రోజుల్నించి మీకీ సంగతి రాయా లనుకుంటున్నాను. మీరు ఇక్కడికివొచ్చి రెండు మూడు నెలలన్నా వుండాలి. భగవాన్ సమాధి ఎప్పుడూ వుంటుందిలెండి మీరు రాసినట్టు.

కాని మనం వుండంగా! కాలం వృధా చెయ్యకండి. ఎప్పటికన్న ఇంకా సన్నిహితంగా వున్నారు భగవాన్. కదలడానికి అభ్యంతరాలూ, చిక్కులూ ఎప్పుడూ వుండనే వుంటాయి. కొంత యిబ్బంది ఐనా, మీరు గట్టిగా ప్రయత్నించండి. నా అనుభవమేమిటంటే, అవసరమైనపని మనం చెయ్యకండా బద్ధకిస్తే, భగవాన్ మనని బలవంతంగా చేయిస్తారు ఆ పనిని, ఒకప్పుడు చాలా బాధకరంగా.

ఇక్కడ నీళ్ళులేవు, బియ్యంలేవు, అట్లాగేలాగేస్తున్నాము. సూర్యనారాయణగారు భగవాన్‌మీద అందమైన పాటలు రాస్తున్నారట. కాని వాటిని వినేవాళ్ళేరీ, ఆయనలోని భగవాన్ కాక !

మాంసాహారమా ! మందుకింద అప్పుడప్పుడు సేవిస్తు న్నాను. సాత్వికాహారమనేది భగవాన్ ఉత్తరువుకింద తీసుకుంటాను.

మా పిల్లలసంగతా? సారిన్, ఎప్పుడూ గొప్ప ధ్యానంలో వుంటుంది మామూలుగానే. రంగనాయకమ్మగారు సంతోషంగా వున్నారు. ఆమె జాగర్త భగవాన్ తీసుకుంటున్నారు. నర్తకికి ఆశ్రమానికి వెళ్ళే వ్యవధికూడా లేదు. అయితే నేం? భగవాన్ ప్రతిరాత్రీ ఆమెకలల్లో కనపడి ఓదారుస్తారు. మొన్న ఓరాత్రి కనపడి, 'నిన్ను నాదగ్గిర్నించి పంపించను. భయపడకు. నిన్ను కొండలలోకీ గుహల్లోకీ తీసుకపోతాను' అన్నారుట.

క్రిష్టాలో ఒక స్త్రీ టీచరు వున్నారు. మేము చెప్పగా ఆమె ఇదివరకే మూడుసార్లు భగవాన్ని దర్శించుకున్నారు. ఈమధ్య ఆమె అనారోగ్యంతోనూ, మనోవ్యధతోనూ బాధ పడుతో, ఏ ఆశాలేక, చచ్చిపోదామనుకుంది. ఈ సంగతి తెలిసి నేనూ నర్తకీ ఆమెకిరాశాము, నిరంతరమూ భగవాన్ని ప్రార్థించమని. ఆమె ప్రార్థించినరాత్రే నాతో నర్తకితో కలిసి భగవాన్ ఆమెకలలోకనపడి, ఆమెని భయపడవద్దని అభయమిచ్చి, 'నీకు చలాన్ని రాయమన్నది నేనే' అని ఆమెతో అని, నావంక తిరిగి 'నేను నిన్ను రాయమనలేదా?' అన్నారుట.

ఆకలతో ఆమె కెంతో ఓదార్పు కలిగింది. ఇదివరకుకన్న ఎక్కువ జీవించలేరా భగవాన్ ఇప్పుడు!

ముందుకు సాగుతున్నాను. రావడానికి ప్రయత్నించండి.

౧౯౯

అరుణాచలం

My dea· Cat gut,

సమాధిదగ్గిర నే నెప్పుడు గొప్పమనో స్థితిలో పడ్డా, ఇట్లాంటి అనుభవాన్ని కోరే నామిత్రులు ఇక్కడవుంటే బావుండును అనుకొంటాను – ముఖ్యం మీరు. అందువల్ల మీరువొస్తే బావుండు ననుకుంటోవుంటాను. ఈరోజుల్లో సమాధిదగ్గిరతప్ప నాకు ధ్యానం కుదరటంలేదు. అదీ, ప్రతి రోజూ కాదనుకోండి. అక్కడికి వెళ్ళగానే, తలలోరక్తం కిందికి దిగిపోతున్నసంగతి feel అవుతాను అందువల్ల సమాధి అంటే నాకు ప్రత్యేకమైన అర్థం ఏర్పడింది. మరి తప్పేమో ప్రతివారికీ ముఖ్యం ఆ సమాధిసాన్నిధ్యం అనుకుంటాను. కాని భగవాన్ అనేకవిధాల పనిచేస్తారు, ప్రతివారియెడలా ప్రత్యేకమైన మార్గాల. వారివారి ఇబ్బందులప్రకారం, ప్రతి వారి పరిస్థితులనుపట్టీ. ఆసంగతి నా సంతోషంలో మరిచి, మిమ్మల్ని ఒకటే ఇక్కడికి రమ్మని పిలుస్తాను.

బియ్యం సీష్ఫా ఇబ్బందులుచూసి భయపడకండి. అన్నీ భగవాన్‌కీ ఏంచేతగాని ఈ చలానికీ వొదలండి.

౨౦౦

అరుణాచలం
30-౫-50

My dear Traveller,

భగవాన్ అనుగ్రహంతో వుయ్యాల లూగుతున్నాను. కాని ఇదంతా ఎంతమాత్రం ? అసలు సత్యానికి ఎక్కడో

దూరపుటంచుల్లో వెతుక్కోడమే. అసలుది దొరకదు. ఆశ్రమమంతా వ్యవహారాలు. భగవాన్ ప్రజ్వలిస్తో కూచుంటారు. ఆయన అక్కడ, వారిమధ్యనే ఉన్నారని ఒక్కరికీ గుర్తుండదు. వాళ్ళందరూ తేనెపే మురికినంతా నిశ్శబ్దంగా చూస్తూనేఉన్నాడని కాని తెలీకండా నిశ్శబ్దంలో ప్రతివారి హృదయాల్ని దొలుస్తున్నారు. మీరు వొచ్చేప్పుడు ఏవీ రేమీ వెంట తెచ్చుకోనక్కర్లేదు. అన్నీ ఇక్కడ ఏర్పాటవుతాయి.

మీదగ్గిర్నించి ఉత్తరం ఆలిస్యమయిందంటే, భయపడి పోతాను, మీ ఆరోగ్యం ఎట్లావుందోనని.

చిన్నస్వామి మదాసు వెళుతో నాదగ్గిరికివొచ్చి నా చుట్టూ చెయ్యేసి అందరితోనూ, ఈమన ఇంగ్లీషులో తెలుగులో గొప్ప రచయిత. భగవాన్‌కి మహాభక్తుడు. 'మాతోబాటు మీరూ తెలుసుకొంటున్నారు. భగవాన్ ఇక్కడ మనతోనే ఉన్నా'రని అన్నారు. ఇంతకీ నన్ను కొంచెం ఆశ్రమం కరెస్పాండెన్సు చూస్తోవుండమని ఈ ఉబ్బెయ్యడమంతా.

ఆశ్రమంలో వేదంకూడా అపస్వరాలతో చదువుతున్నారు ఇంకా ఆశవుందంటారా ఈ ఆశ్రమానికి! భగవాన్ సమాధి చుట్టూ వెదురుదడి కట్టారు.

మౌనస్వామి సంగతి చూడండి. ఇన్నేళ్ళు భగవాన్‌దగ్గిర వుండి ఏమొచ్చింది? భగవాన్ని ప్రపంచమే అప్పుడే మరిచి పోయినట్టుంది. కాని భగవానే మన్నారు.

'భగవాన్ ఎక్కడికి వెడతారు?' అన్నారు. ఆ ప్రకారమే ఇక్కడ నిలిచారు ఆ వాగ్దానంప్రకారం. కాని ఆయనకోసం అంతపడికొట్టుకున్న భక్తులందరూ వెళ్ళిపోయినారు. ఎటువంటి పీటర్లం మనం!

బోసు కాంపౌన్డులో పూలన్నీ కోసి దండలు గుచ్చి భగవాన్ సమాధికి వెయ్యడానికి ఇస్తోంది నర్తకి రోజూ. మా పూలతోనే అలంకారం సమాధికి. ఈ సెప్టెంబరు నెలలో కూడా మల్లెపూలు చెట్లనిండా పూయించుకుంటున్నారు భగవాన్.

అరుణాచలం దేవాలయం గర్భగుడిలోకి వెడితే, తలతిరుగుతుంది. చూశారా మీరు? చాలా శక్తి. కాని చాలాసేపు వుణ్ణియ్యలేదు. ఓరోజు నర్తకి గర్భగుళ్ళోకి రానంది. ముష్టివాళ్ళపోరూ, ఆ గర్భగుళ్ళో తొందరా పడలేనంది. బలవంతాన లాక్కెళ్ళాను. ఆరోజు ఒక్క ముష్టివాడూ మమ్మన్నేమీ అడగలేదు. గర్భగుళ్ళోంచి మమ్మల్నిపొమ్మని అనడం మరిచిపోయినారు. అట్లానే అక్కడే కూలపడ్డాము. ఆశ్చర్యంకాదూ?

త్వరగా రండి.

ఓ తెలుగుమిత్రుడు భక్తుడు ఏర్పడ్డాడు ఇక్కడ. ఆయన్ని భక్తుణ్ణి చేశాము. ఆయనదీ విచిత్రమైనఅనుభవం. భగవాన్ గట్టిగా పట్టేశారు ఆ కుర్రాణ్ణి. తొందరగా రండి.

౨౦౧

అరుణాచలం
20-9-50

My dear marcer,

నేను సాధారణంగా భగవాన్ సమాధి దగ్గిరిగా వెళ్ళను. ఇవాళ ప్రదక్షిణం చేయాలని బుద్ధిపుట్టింది. తిరుగుతోవుంటే సమాధి ఓమూలలో నాలోకి పెద్ద షాక్ లాగు వొచ్చింది. దడిని పట్టుకొనిగాని నిలవలేకపోయినాను. ఎన్నిసార్లు తిరిగినా ఆచోటికి వొచ్చేప్పటికి వొళ్ళంతా వొణుకు. నర్తకితో చెపితే, తనకికూడా అంతేనంది. ఓరోజు రామస్వామిఅయ్యర్ గారు ఆమూలే, 'ఏం పవరు? ఏం పవరు?' అంటో కాలుకాలిన పిల్లిమల్లే గంతులేశాట్ట. చూశారా భగవాన్ ఎంత సజీవులై వున్నారో.

ఇక్కడికి రావాలనుకోండి. రప్పించమని అడగండి భగవాన్ని. ఇన్నేళ్ళతర వాతకూడా ఇంకా స్వప్నాలతోనే సంతుష్టిపడితే ఎట్లా మీరు? రోజూ సమాధిదగ్గిర కూచుని వృత్తి గట్టిపట్టుదలవల్లనే, భగవాన్‌పైని భక్తిని నా హృదయంలోకి ఆహ్వానించుకుంటున్నాను. అంతకన్న నాలో ఏ మెరిట్ వుంది? మీరు అమూల్యమైన కాలాన్ని వృధాపుచ్చుతున్నారు.

మొన్న ఒకఅతను వొచ్చి,

'కైలాసంలోవుండే మురఘూ, మాకోసం మనిషివై వొచ్చి ఇక్కడ కూచున్నావా?' అంటో చిరతలతో నాట్యంచేస్తో పాడాడు.

మనం వొడ్డునకూచునే పాలితీర్థం నిండి చాలా రమణీయం గావుంది. వెన్నెట్లో అరుణాచలం కరగిపోతోంది. వూరినిండా ఉత్సవాలు. అన్నిధరలూ హెచ్చాయి. కార్తీకదీపానికి తయారవుతోంది వూరు.

భగవాన్ నిర్యాణమప్పుడు ఆ నక్షత్రం పడ్డ విషయాన్ని పట్టుకుని భగవాన్ని ఎడ్వర్టైజు చేసుకుంటున్నారు ఆశ్రమం వారు. కలా వాస్తవం అనే వ్యాసం రాశాను. వాస్తవంకన్న కలే అసలువాస్తవానికి దగ్గిరఅని. ఆరోగ్యం చాలా తిప్పలు పెట్టి డిస్పెయిర్ చేయించి ఈవాళే కొంచెం బావుంది.

ఛాడ్విక్ కొన్నాళ్ళు కాళీగుళ్ళో పూజలుచేసి, కాశీకి వెళ్ళి పోయినారు. మళ్ళీవొస్తారుటలెండి. ఇన్నేళ్ళు భగవాన్ శిష్యులై వెర్రినమ్మకాలు లేనివాళ్ళు కూడా, ఈనాడు ఈ పూజలూ, యాత్రలూ ఎందుకు చేస్తున్నారో!

రమణాశ్రమం రూల్సుఅని ఓ పుస్తకం అచ్చేశారు. మెంబర్లు సంవత్సరానికి అయిదురూపాయలు కట్టాలి. ఈ ఆశ్రమం ఓ క్లబ్బు అయింది.

ఆశ్రమంలో దసరాఉత్సవాలు బ్రహ్మాప్రళయంగా జరుగుతున్నాయి. మౌనస్వామి వాటిని 'బొమ్మలకొలువు' అంటున్నారు.

వేదాంతం చదవడం మంచిదే. మనస్సుని ఎన్‌గేజ్ చెయ్యాలంటే, అది ఓ ఉపయోగమైన పద్ధతే.

హాలులో భగవాన్ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. నా కా విగ్రహం ఇష్టంగాలేదు. ఆయనకళ్ళలో కాంతి కనపర్చింది, ఆయన శరీరం ఏమాత్రం?

౨౦౨

అ రు ణా చ ల ం
4-12-50

My dear Stamp-sender,

మీ చిర్పింగ్ ఉత్తరం. నిజమే ఇట్లాంటి మంచి ఉత్తరం మీనించివొచ్చి, ఎన్నాళ్ళు ఎన్నేళ్ళయింది ? ఇల్లు మారుస్తున్నారా ! పాపం. మీరు గోదావరికి దూరంగా పోవాలి గావును ! బెజవాడలో మేము ఇల్లు మార్చవలసివొస్తే, సరే ఇల్లు మార్చేది వూరే మారుద్దాము; వూరు మార్చేది, దేశమే మారుద్దాం అనుకున్నాం. మీరూ అనుకుని వొచ్చెయ్యండి. మీరు ఇక్కడికి బచ్చలిగింజలు తెచ్చేప్పటికి ఇక్కడవున్న బచ్చలికూరని పెంచి, వొండి మీరు వొచ్చినప్పుడు మీకు పెడ్తేట్టున్నాము అంటోంది సౌరిస్.

భగవాన్‌తో పోట్లాడాను. ఇంకా రాజీ కాలేదు. ఆశ్రమంలో కూచోటంలేదు. How do you do? అని భగవాన్ని పలకరించి వొచ్చేస్తున్నాను. కాకపోతే ఏమిటీ ఆలస్యం, పరాముఖం ఆయనకి. తను అట్లా నిర్లక్ష్యంచేస్తే మన మేమైపోవాలని ! ఛాడ్విక్ గారు తిరిగిరారుట. ఎప్పుడన్నా వొచ్చి చూసిపోతారట ! ఆయనా తపస్సుకి ఓచోటు వెతుక్కుంటున్నారట.

౨౦౩

అరుణాచలం
23-12-50

My dear crook,

చాలా బావుంది, వొళ్ళూ మనసూ.

బోస్‌కి ఇక్కడ రక్తపుపోటు కుదిరిందిట. మీకూ కుదురు తుంది రండి.

మొన్న మీ కార్డు వొచ్చేప్పటికి చాలా డెస్పాండెన్టు మూడ్‌లో వున్నాను, ఏమీ కారణం లేకండానే. అందుకని మీకో ఏడుపుగొట్టు కార్డు రాశాను.

మీకు పాపం, ఆరోగ్యం బావుండదని తెలిసే, అవస్థ పడతారేమోనని, భగవాన్ మిమ్మల్ని ఇక్కడికి రానీలే దేమో. కాని మీరేవొస్తే, నేను శాయశక్తులా మీకు సౌకర్యాలు చూస్తాను. భగవాన్ ప్రజ్వలిస్తున్నారు సమాధి లో. ఆ వెలుగుని తీసుకునే తాహతు మనకి వుండాలి.

నా బాధల్ని చూస్తే, నా లోపల్నించి భగవాన్ కెలకడం అగుపిస్తోంది. మరి ఏమిటో ఏం తెలుస్తుంది. ఇంకా అట్లానే ఆల్టర్‌నేటు అవుతున్నాయి నా మూడ్సు.

మీ ఆరోగ్యంవిషయం చాలా జాగ్రత్తపడాలి మీరు - నాకోసం. మీకు జబ్బు అన్నప్పుడల్లా చాలా భయంవేస్తుంది నాకు. భగవాన్ వొదలరు మిమ్మల్ని. 'మీరు నన్ను వొదిలినా, నేను మిమ్మల్ని వొదలను' అని భగవాన్ అక్షరాలా అన్నారు. అందులో - ఆయన్ని ఎన్నడూవొదలని నాకు

మళ్లీ ప్రశ్నించని, విసుక్కోని, మిమ్మల్ని, ఎట్లా వొదులు తారు? మీ ఆరోగ్యంకోసం భగవాన్ని వేడుకుంటున్నాను.

ఇవాళ పొద్దున్న నన్ను భగవాన్ ఓ అంగుళం పైకి లాగారు. దాంతో కొంత ముందుకు సాగాను. తనని వొదల కండా వున్నందుకు, సహాయాన్ని కనిపెట్టుకుని వున్నందుకు, నామీద కరుణ కలిగినట్టుంది, ఆయనికి.

౨౦౪

అరుణాచలం
1-1-51

My dear far-off,

సూర్యనారాయణగారు భగవాన్‌పై పన్నెండుపాటలు రాసి తీసుకొచ్చారు. ఆయన ఇక్కడే వున్నారు.

They are pure Bhagvan's inspiration. Even valuable as literary pieces, high in their music quality, and for us unparallelled in their comprehensive exposition of Bhagvan and his philosophy. They are emotionaly deep and stirring, and haunt you and hu t you into enlightenment.

వాటిభవిష్యత్తు ఏమిటో మరి!

చిన్నస్వామికి ఇంక నెమ్మదికావడమేమిటి? అప్పుడే బుల్లి స్వామిదే (అంటే చిన్నస్వామికొడుకు వెంకుట్టు) పెత్తనం. ఆశ్రమం spy system మీద నడుస్తోంది. నన్ను శత్రువుల పద్దులో వేశేసుకున్నారు.

ఒకనెలదాకా పరవాలేదు నీళ్ళు. ఈలోపల వానలేకపోతే అయిందే పని. కొత్తబియ్యంతప్ప గతి లేదు. ఆబియ్యంతింటే నాకు తలనొప్పులు. ఈవూరువొదిలి ఎక్కడికీ పోవాలనిలేదు. పోంటరి ఐనాసరే ఇక్కడే వుండాలని. భగవాన్ పంపించరు లెండి. నేనన్నా లేకపోతే, ఆయనకి ఏం తోస్తుంది?

ఇంకముందు ఆశ్రమం చాలా అసహ్యాం కాబోతుంది, బుల్లిసామి పెత్తనంలో. వాతావరణం భరించలేకండా అవుతుంది. కాని ఆ సమాధి అట్లా పలుకుతున్నన్నాళ్ళు నేను బ్రతికివున్నన్నాళ్ళు. అట్లా అక్కడే పడివుండాలని నా ఆశ.

అవును. మీరు రాకండి. మీ కిక్కడ ఏమీతోచదు. కొందరు కామకోటి పీఠానికి పోవాలని చూస్తున్నారు. కొత్త గురువుల్ని వెతుక్కొని సర్దుకోవాలని చూస్తున్నారు రమణ భక్తులు.

౨౦౫

అరుణాచలం
1-2-51

My dear ailing heart,

మీ సాహితీ సభకి శివశంకర స్వామిగారి ఆహ్వానంపై సందేశం పంపాను-

'ఇంక ఈ సభలు మాని, కవిత్వాన్ని మీ హృదయ నిశ్శబ్దంలో అనుభవించడం నేర్చుకోండి' అని.

ఒకొక్క అడుగే ముందుకు నడుస్తున్నాను. ఎవరికోసమూ నేను క్రియలోకి దిగను. పిల్లలు తమ భవిష్యత్తు చూసుకో గలరు. పెద్దవాళ్లైనారు. నేను ప్రయత్నం చెయ్యను. ఏదైనా

నాగుమ్మంలోకి వొచ్చినా, భగవాన్ సహాయంతో దాన్ని వొదులుకోవాలనే చూస్తాను.

నాకోసం, మీ ఆరోగ్యాన్ని కాపాడుకోండి. మీగుండె ఆగిపోవడానికి నిశ్చయించుకుందా, నా పని అయిందన్న మాటే. ఇప్పుడే ప్రయాణం కాకండి. ముందు గుండెకి బలం పట్టనీండి.

ఈమధ్య మళ్ళీ వొళ్ళు బాగాలేక తంటాలు పడ్డాను. వానలు లేవు. నీళ్ళు ఐపోతున్నాయి. కొత్త బియ్యమూ, జొన్నలూ తినడానికి మాకు, జబ్బుచేస్తున్నాయి. అందుకనే నేమో మిమ్మల్ని రాసిందిభగవాన్. అక్కగారని ఒకకొత్తామె చేరారు మా అండను. వొచ్చినప్పుడు భగవాన్లో నమ్మకం లేదు. ఈ మార్గంలో ఇదివరకే కొంత తంటాలుపడ్డది. ఇప్పుడు పూర్తిగా వశ్యురాలయింది సమాధిముందు. నర్తకీ అక్కగారూ సమాధికి పూలదండలు సప్లై. రంగనాయకమ్మ గారు దీపాలకి వొత్తులూ అవీ.

చిత్ర మద్రాసు వెళ్ళింది. చిత్రకూతురు పెంపకభారం మామీద పడింది. ఓవారం ఉక్కిరి బిక్కిరైనాను.

ఆశ్రమంలో ద్వారక మునిగిపోయిన విధంగా కనపడు తోంది.

౨౦౬

అరుణాచలం
17-2-51

My dear attic,

ఈమధ్య నాకు వొళ్ళు బావుండలేదు. దిగులుపడిపోయి నాను. భగవాన్‌పైన భగవాన్‌కే ఫిర్యాదు చేశాను. త్వరలోనే బాగై సంతోషంగా వున్నాను.

నా ఆర్థికపరిస్థితుల్ని గురించి నా ఆదుర్దా తీర్చేట్టున్నారు భగవాన్. చేకీ, చిత్రకీ సినిమాలో స్థానం దొరికేట్టుంది. అదే జరిగితే, ఇంక నా బాధ్యత తీరుతుంది. పకపక కూడా మద్రాసు వెడుతుంది. నలుగురం భగవాన్ వాళ్ళం ఇక్కడ మిగిలిపోతాము.

మీరు రానందుకు, మామీదకన్న మీమీద జాలికలిగింది మాకు. ఏదో విధంగా భగవాన్ దగ్గిరికి రాకండా తప్పించుకుంటున్నారు మీరు. రాకపోవడానికి అట్లాంటి కారణాలు రాయడం, మమ్మన్ని నమ్మించడానికా, మీరూ నమ్ముతున్నారా! పోనీలెండి ఇప్పుడు రాకపోతే. కాని ఇప్పటికీ రమ్మంటాను. ఇట్లాంటి కారణాన్ని పెట్టుకుని మీరు ఆగిపోతో వుంటే, మీ రెప్పటికైనా ఎట్లా రాగలుగుతారా అనుకుంటాను. ఎందుకో మరి భగవాన్ మీ కిట్లాంటి విముఖత్వం కలగజేశారు అరుణాచలంపైన! మిమ్మన్ని భగవాన్ నిరంతరం పిలుస్తున్నారని మరిచిపోకండి. భగవాన్ సర్వత్రా వున్నారన్నమాట నిజమే. కాని సమాధిదగ్గర మరీ ఎక్కువ శక్తితో కేంద్రీకరించివున్నారుకద!

౨౦౭

అరుణాచలం
12-3-51

My dear mata-hari,

సూర్యనారాయణగారు ఇక్కడ వున్నారు. ఆయనతో సరి పోతోంది నాకు. ఆయన మళ్ళీ 24 కొత్తపాటలు తీసుకొచ్చారు.

May of them are full cf subtle vedantic feeling. His songs are perhaps the most exact and resplendant record of Bhagvan's exterior, and our own interiors charged with Bhagvan's grace. He has given new significance and deep understanding to Bhagvan's spiritual path—leave alone the devotion and poetry in those songs.

మేమిద్దరం కలుసుకున్నప్పుడల్లా మీరులేనిలోటుని తలుచుకుంటాం.

పాపం, వెల్లటూరుగారు చచ్చిపోయినారు.

ఇప్పుడే అకస్మాత్తుగా మధ్యాహ్నం మౌనస్వామి గదిదగ్గిర ఆశ్రమం నిప్పుఅంటుకుంది. పాతహాలు, ఆస్పత్రిదగ్గిర పాకలు పెంకుటిళ్ళు అన్నీ తగలపడిపోయినాయి. భగవాన్ సమాధి మీది పాకమాత్రం అట్లాగే నిలిచింది, చుట్టూ అంటుకొని వున్న పెంకుటిళ్ళు కాలిపోయినాకూడా. చాలా విచిత్రం... ఎవరు కాల్చారో ఏమో ఇంకా ఏం తెలీదు.

ఇంకేం ఆశ్రమం?

౨౦౮

అరుణాచలం
15–3–51

My dear Roach,

నర్తకి ఈతకివెళ్ళి మునిగిపోయింది పాలితీర్థంలో. మా పనిమనిషి రక్షించింది. చిత్రకి మద్రాసులో ఏమీ కుదర లేదు.

భగవాన్ సమాధిమీదఉన్న పందిరిమీది ఒక్క ఆకు మసికాలేదు. దానిని కలిసి అంటుకునివున్న పందిరి చూరువరకు గీత గీసినట్లు కాలి వూరుకుంది. ఎంత శక్తిలో వున్నారో భగవాన్ సమాధిలో! ఆమంట ఎట్లాపుట్టిందో తెలీదు. హుషప్ చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. మౌనస్వామికి నిలవ నీడ లేకుండాపోయింది ఆశ్రమంలో.

తొందర తొందరగా అందరూ ఆశ్రమంనించి వెళ్ళిపోతున్నారు. వెళ్ళిపోతున్నారో వెళ్ళ కొడుతున్నారో! భగవాన్ విల్లు వుత్త బూటకమని అందరికీ తెలుసు. మొన్న పెద్ద పోట్లాట నౌకర్లలో భక్తులలో, కొట్టుకోడానికి సిద్ధమైనారు.

వూళ్ళో నీటిచుక్క కరువయింది. రోడ్డుమీద కూడా జన సంచారం లేదు.

నిన్న రాత్రి మౌనస్వామిని తన్నడానికి సిద్ధమైనారు కమిటీ పెద్దమనుషులు.

౨౦౯

అరుణాచలం
29-3-51

My dear Listener,

మౌనస్వామిని ఎరెస్టు చేశారన్న నాకార్డు మీకు అందనే లేదా! ఉత్తరాల్ని ఆశ్రమంవాళ్ళు పెద్దపోస్టాఫీసులోనే సెన్సార్ చేస్తున్నారట చూడండి. ఎట్లాంటి గతికి దిగారో!

నేను జైలులో మౌనస్వామిని చూస్తున్నాను వెళ్ళి.

సమాధి దగ్గర కూచోడమంటే భగవాన్ దగ్గర కూచోడమే నామనసుకి. ఆ సంగతి తిరిగి తిరిగి తెలియజేస్తున్నారు భగవాన్.

ఎక్కడి చలం! ఎక్కడి అరుణాచలం! దేవుణ్ణి కాదు, ఋషిని కాదు, ఓ సమాధిని సేవించుకుని, నమ్ముకొని పడి వున్నాడు. పోనీ ఈనాటికన్నా' దేవుడు, మోక్షం, చచ్చింతరవాత మిగలడం, ఇవేమీ నమ్మకంలేదు. అవి కావాలని గాని, వొస్తాయనిగాని ఆశలేదు. ఇది కావాలని లేదు. ఉంటున్నాను.

చాలాసార్లు వొంటరితనం అనిపించి, మళ్ళీ మిత్రులమధ్యకి పోదామా అనుకుంటాను కాని కదలలేను. ఇక్కడ ఒక్క మనిషిలేడు, నువ్వా' అని పలకరించేందుకు. సమాధి దగ్గిరికి పోగానే మాత్రం, 'వొచ్చారా!' అంటారు భగవాన్. ఈమధ్య నాకో offer వొచ్చింది. చిత్రావతీ నదివొడ్డున నన్ను భక్తులు ఆదరిస్తారనీ, సహాయంకూడా జరుగుతుందనీ. అక్కడ చాలా అందం, అన్నీ చవక. నేనో గురువుని

కావొచ్చు Tempt అయినాను. కాని భగవాన్నీ అరుణా చలాన్నీ వొదిలి ఎట్లా?

ఇక్కడికి వొచ్చేవరకు కధలురాసి ఓ వంద సంపాయించు కునేవాణ్ణి ప్రతినెలా. అదీ లేదు. కొత్తబియ్యం జబ్బు. నీళ్ళు లేవు. ఎందు కిక్కడ? పాతభక్తులు ఆశ్రమానికివొచ్చి నన్ను చూసి, 'ఏమిటి? ఇక్కడే వున్నారా?' అని ఆశ్చర్యంగా అంటారు. ఎందుకు వుంటాను అని వాళ్ళకి ఆశ్చర్యం.

నాకు భయమల్లా, ఎవరన్నా ఎప్పుడన్నా ఏదన్నా డబ్బు సంపాయించేవిధంచూపి పిలుస్తారేమో, నా ధర్మ మనుకుని నన్ను బలవంతపెట్టుకుని ఈవూరు వొదలాల్సి వొస్తుందేమోనని.

భగవాన్ విల్లు శుద్ధ అబద్ధంట. నెల్లూరువాళ్ళు పెట్టిన పెటకంట. వారిసలహాకూడా జరిగిందట ఈ దొంగవిల్లు.

భగవాన్ వెలిగిపోతున్నారు సమాధిలో.

ఇక్కడికి ఓ అక్కగారు వొచ్చారని రాశానుకాదూ! రామేశ్వరంపోతూ, తొంగిచూసిపోదామని దిగారు. భగ వాన్ ఆమెని ఏదోవంకతో కదలనీలేదు. ఆమె వుండడానికని ఎన్ని సౌకర్యాలు చేస్తున్నారో!

మంచివానలు కురిశాయి అరుణాచలం ఎన్నో అందాల తో కులుకులాడుతోంది. కొండపైన పక్షులు, పువ్వులు, పరి మళాలు, చిన్న నీళ్ళగుంటలు.

మరి బైలుదేరండి త్వరలో.

మాసస్వామిని జైలులో సుఖంగా చూస్తున్నారని ఏడుస్తు న్నారు ఆశ్రమంవారు. నావంక సురసురచూస్తున్నాడు బుల్లిస్వామి.

మాసస్వామి జైలులో పడ్డాడని నవ్వుకుంటున్నారు. మనలో ఒక భక్తుడు అట్లాఐనాడే అనే జాలిలేదు. అసలు సంగతి ఏమిటా, ఇట్లాంటిది ఎందుకుజరిగిందా అనేప్రశ్నే లేదు.

సమాధిదగ్గిర తల తిరిగిపోతుంది.

ఆశ్రమానికివొచ్చే ఆడవాళ్ళల్లో తగాదాలూ, బ్రాహ్మణ అబ్రాహ్మణ వైషమ్యాలు. ఆశ్రమం ఖాళీచెయ్యాలనేమో భగవాన్ ఉద్దేశ్యం.

౨౧౦

అరుణాచలం
25–6–51

My dear Legs,

మీకార్డు. పాపం, మళ్ళీ లంబాగో వొచ్చిందా? అంతే లెండి. నాకూ అట్లానే వుంది. పొద్దస్తమానం నేను సమాధి దగ్గిర కూచొని గోలపెట్టినా లాభంలేదు.

జొబ్బలెట్టి అరవ – గోలపెట్టి ఏడ్వ
లీలలీలంటారు – ఎడారివేడ్వేన
వొచ్చి చచ్చిపోవ – చచ్చిపోయీరాగ
ఇచ్చేది లేదేమి – వొచ్చేదిలేదా ?

సూర్యనారాయణగారి పాట.

మీకు విశ్వాసమన్నా వుంది. నాకు అంతా సందేహం.

భగవాన్ చాలా గొప్పగా వెలుగుతున్నారు సమాధిలో! కాని నాకేంలాభం? ఇచ్చేదీ లేదు, వొచ్చేదీ లేదు. అంతే మన కింక. చావు దూరంలేదు అనేది వొక్కటే వోదార్పు. ఆశ్రమమంతా తగ్గులు. కళ్ళెత్తి చూస్తేచాలు, డబ్బులడుగుతారు. ఆశ్రమంచుట్టూవున్న భక్తులందరూ వుత్త scandel-mongers దొంగకళ్ళమూతలు. చాలాఅసహ్యంగా వుంది. ఇక్కడ ఎందుకిట్లా చిక్కుకున్నానా? ఏ మళయాళమో, ఇంకా దూరంగానో పోక అనుకుంటాను. వానలు లేవు, ధరలు విపరీతం.

పోనిద్దురూ! పుస్తకాలు!! అంతా అయిపోయింది. భగవానే మోసమైతే, (మొత్తానికి మనపాలిటికి) తక్కినవన్నీ ఏమైతేనేం?

౨౧౧

మద్రాసు
3–7–51

My dear crook,

ఇక్కడ ఓ సినిమాకథ రాయడానికి రమ్మని టెలిగ్రాం వొస్తే వొచ్చాను. వెంటనే డబ్బురాదు నాకు. ఇక్కడ వుండాలి చాలారోజులు. అరుణాచలం పోవాలని ఒకటే పీకుతోంది మనసు. భగవాన్ నాకిట్లా శిక్షవేశారు. ఇక్కడ ఈ వాతావరణంలో భగవాన్ ఎక్కడా వినపడరు. ఆయన నవ్వుతున్నారు నా బాధల్నిచూసి. ఒక్కొక్కరే మన పాత మిత్రులు బైలుపడుతున్నారు ఈవూళ్ళో. ఈ సినిమాకోసం

బతకడంకన్న చచ్చిపోవడం నయం. ఎంతెంత మోసాలు! అసహ్యాలు. డబ్బు. అది చూసుకని గొప్పగా తిరుగుతారు వాళ్లెవాళ్లలో. ఇట్లాంటి మురుగునుంచి తప్పించారు మీరు నన్ను భగవాన్ని నాకు చూపి.

ఈ అనార్కలి ఎవరో తెలీకునాకు కథ ఎట్లాకల్పించను? భగవాన్ని అడుగుతున్నాను, ఆ కథని ఎట్లాగో పూర్తి చేయించి నన్ను అరుణాచలం తొందరగా రప్పించుకోమని.

ఇంతాచేస్తే ఏండబ్బు వొస్తుందో! వోపికపట్టి చివరిదాకా వుండగలనోలేదో! భగవాన్ క్రమంగా దూరమౌతున్నారు ఇక్కడ. డబ్బు, కీర్తి, యత్నం, గొప్ప, వీటిమీద నడుస్తోంది ఇక్కడి కాలచక్రం, చాలా తొందరగా తిరుగుతూ, తనతో మనసుల్ని తిప్పుతూ. నాకే భగవాన్ నిండైన అనుగ్రహం ఇచ్చివుంటే ఎవరుపిలిచినా కదిలేవాణ్ణా! నాకు వీళ్లెంత గొప్ప డబ్బు ఇస్తానన్నాసరే, నే నక్కడ మాడిచచ్చినా లీలగారినించి నన్ను దూరంగా తోసినట్టే నా సంస్కార దహనంకోసం, పూర్తిగా ఈ వ్యామోహాన్ని నామనసులో నాశనం చెయ్యడానికేమో, ఇట్లా అక్కడికినెట్టి, అంత తనని నమ్మినవాణ్ణి ఇన్ని తిప్పలు పెట్టడం? అక్కడా ఏమీశాంతి లేకండా ఏడిపించడం? ఇక్కడికి తరుమడం? ఇది వరకు కన్న చాలానయ మనుకోండి నేను. కాని రమణ మహాసముద్రంనుంచి ఇంతేనా నేను తీసుకోగలిగింది? భగవాన్ నా కిచ్చేది? అని దిగులు.

నాకు అనార్కాలీ వొద్దు. డబ్బూ వొద్దు, రాతావొద్దు. భగవాన్ కావాలి.

కాని దొరికితేనా ఆభగవాన్?

అందుకునే ఈచంచలం, చలం.

నాకో కల వొచ్చింది. నేను సౌరీస్ తల్లార్ఖాన్, ఇంటికి వెళ్ళాం. నన్ను చూస్తే ఆమెకి ఇష్టంలేదు (కలలోకూడా) ఆమె స్నో, పౌడరూ అన్నీతీసి నేను పూసుకుంటున్నాను. ఆమెనాకో పాతకుర్చీ ఇచ్చిందికూచోడానికి. అదిగిర్రున తిరుగుతోంది. ఆమేడమీద అంతా ఆకుర్చీ నాతోసహా భరించలేక కిందికి వొచ్చాను మేడమీదనించి. నాదగ్గిరగా ఒకరు వొచ్చి నాచెవులో ఓమంత్రంచెప్పి, 'ఇది జపంచెయ్యి. ఆకుర్చీ అట్లా తిరగడం మానుకుంటుంది' అన్నారు. అదీకల.

౨౧౨

మద్రాసు
23-7-51

My dear Rogers

లేదు, భగవాన్ మద్రాసులో లేరు. భగవాన్ మనకి నవజీవనం పోస్తూనే వున్నారు. కాని ఎంతకాలం మనం ఎంత బాధతో ఇట్లా కాచుకొని వుండాలి ఆయన దయకోసం? మనని ఇట్లా ఆయన శుభ్రంచేసుకుంటూ వుండగానే చచ్చిపోతాము. తరువాత ఇంకేముంది? ఇంకేం శుభ్రం చేస్తారు? ఎవరిని?

మీరీ సినిమాపనికూడా భగావాన్ పనిగా చూసుకోమంటారు. ఇది సైతాన్పని. నేను డబ్బుకోసం పనిచేస్తు

న్నాను. దీన్ని భగవాన్‌పని అనుకోలేను. నన్ను మోసప్పుచ్చుకొని లాభంలేదు. నాకుమాత్రం భగవాన్ తనసమాధిలో ఉన్నారు. సమాధికి దూరమయ్యానా, భగవాన్‌కి దూరమౌతాను. నా కిక్కడ వృత్తి వ్యర్థగావుంది. ఈపని మీాహాను మాతడి తోకకుమల్లే అంతు లేకుండా పొడుగవుతోంది.

నిన్న కిట్టశాస్త్రిగారిని చూశాను. బాగా డబ్బుచేస్తున్నారట. హాయిగా fat గా వున్నారు. మనమే మూర్ఖులం, వాళ్లే జ్ఞానులు.

౨౧౩

అరుణాచలం
2-3-51

My dear Dack-passenger,

నిన్న పాడు మూడ్‌లోవుండి మీాకు రాసిన మంచి ఉత్తరానికి అట్లాంటి జవాబు రాశాను. అట్లానేవుంటోంది నామనసు ఇప్పుడు. నా కెప్పుడూ నమ్మకాలు లేవు. చచ్చింతరవాత ఏమౌతుందో తెలీదు. పైగా భగవాన్ మీాద భక్తి లేదు. (మీారు పంపిన) ఆ భక్తిశ్లోకాలుచూస్తే ఏమీా అర్థంకాదు నాకు. అందుకనే జీవితం ఇంత ఎండుగా, చేదుగా వుంటుంది. ఒక్క భగవాన్ శక్తిలోనే నమ్మకం. అది నానించి దూరమైతే ఇంతగోడవ. ఆరోగ్యం బావుండదు. మనసు బావుండదు. సూర్యనారాయణగారికీ అంతే. మీాకున్న నిశ్చలమైన విశ్వాసం నాకు లేదు దేంట్లోంచీ ఏటిదారూ్ప రాదు. పోనీ, భగవాన్ని వొదిలేద్దామా అంటే, ఇంక దేనినించీ ఏశాంతీ

రాదు. పేరుకున్న ఈ సంస్కారం అంతటినీ కాల్చేశక్తి భగవాన్‌కి వుంది. ఆ సంస్కారం ఎందుకు పేరుకుందో, ఎందుకు పేరుకోవాలో, అట్లా పేరుకునేట్టుచేసి దానికి యిస్తామంటో ఎందుకిట్లా ఏడిపించాలో నాకర్థంకాదు. ఎన్ని ఎవరుచెప్పినా భగవాన్ చెప్పినా, నాకున్యాయంగా కనపడదు. ఇంత బాధ వుండగా ఇదేంలేదంటే నేను ఓ ననలేను. అట్లావుంది నాస్థితి భగవాన్‌కి వొదిలేస్తాను. కాని బాధపడకుండా ఉండకుండా వున్నాను. అందుకని నేను అట్లారాశాను. మద్రాసులో అన్నీ బావున్నాయి; కాని భగవాన్ లేక ఏమీ బాగాలేక వొచ్చాను. వొచ్చి ఇట్లా బాధపడుతున్నాను.

ఇక్కడ కోర్టువ్యవహారాలు తప్ప రమణాశ్రమ మనేది వుందని మరిచిపోయినారు.

మీకున్న విశ్వాసం నాకులేదు.

చావుతరవాత ఆత్మ ఏదో వుంటుందనీ నమ్మకంలేదు. అందువల్లనే ఈగోలఅంతా. మళ్ళీపుట్టడమా? మళ్ళీ ఈ గొడవంతానా? హాయిగా ఇంత దుమ్మైపోకండా! ఇంకా పుట్టించి మళ్లీ ఏడిపిస్తాడా దేవుడు? వాడిమొహం మండా! వాడికి సిగ్గన్నాలేదా, దయలేకపోతే పోనీ. వొచ్చిన ఖర్మం నాకు భక్తి సెంటిమెంట్లూలేవు. నాకెట్లా నచ్చుతాయి మీరు పంపిన పద్యాలు! భగవాన్ దగ్గిర్నించి సరాసరివొచ్చే అనుభవం తప్ప ఇంకేది నచ్చదునాకు. మీరుఅదృష్టవంతులు.మిమ్మన్ని అనేకవిధాల కట్టేసుకున్నారు భగవాన్.

నాకోసం శ్రమపడకండి. నే నింతే, మళ్ళీ భగవాన్ నా వంక చూసిందాకా.

వానలు కురుస్తున్నాయి. చెట్లూ, మృగాలూ, పిట్టలూ, మనుషులూ సంతోషిస్తున్నారు.

ఇక్కడినించి పారిపోక మిగిలివున్న రమణభక్తులు పీడ మొహాలేసుకొని తిరుగుతున్నారు. 'వొదులు, వొదులు' అనే భగవాన్ వాక్యం దూరంగానన్నా వినిపించుకోరు. అన్నిటి మధ్యా వుండికూడా జ్ఞానం సాధించవొచ్చు ననేదిమాత్రమే పట్టుకొని వేళ్ళాడతారు. అట్లాంటిది ఎవరికో కోటి సంవత్స రాల్లో ఒకరికి భగవాన్ వంటివారికి సాధ్యం. నేనూ అట్లానే అనుకుని మోసపోయినాను, మనస్సుకి సన్యాసం ఇవ్వగలిగిన ధీరుడికే అది. తక్కినవాళ్ళు అన్నీవొదలకుండా ఏదీజరగదు. గట్టిగా కాళ్ళుపట్టుకుంటే భౌతికంగా ఆయనే వొదిలిస్తారు. అంతేకాని అన్నిటిమధ్యా వుండి ఏదో వొస్తుందనుకోడం వుత్తభ్రమ. అదే నేను చూస్తున్నది ఇక్కడ. కాని అన్నీ వొదులుకున్నంతమాత్రానా రాదు. రెంటికీ చెడవొచ్చు మనిషి.. ఆ రెండూ సైమల్ టేనియస్ గా రావాలి- అనుగ్రహమూ, వైరాగ్యమూ.

హైద్రాబాద్ రేడియోవాళ్ళకి కథలూ, నాటకాలూ కావాలన్నారు. ఇవన్నీ ఎక్కడ చెయ్యను! పొద్దున్నా సాయింత్రం సమాధిముందే గడుపుతున్నాను. 'దరి దాపులేని నా జాలితీర్చి, దయజూచి బ్రోచేదొర నీవె కావా!' అని పాడుకుంటో.

(1951 ఆగస్టు 15 న సౌరిస్‌కి ఈశ్వరుడు, ఆకారం తీసుకుని కనిపించారు. ఆయన చలంకుటుంబాన్ని నడిపించడానికీ, తద్వారా భక్తుడికి అభివృద్ధినివ్వడానికీ, అంధకారంలోవున్న ప్రపంచప్రజలకి నూతన విజ్ఞానాన్ని ప్రసాదించడానికీ దిగివొచ్చానన్నారు. తనమాట వింటే, చలం ఆరోగ్యాన్ని బాగుచేసి, ఆధ్యాత్మిక సాధనకి అర్హతనిచ్చి, త్వరలో జ్ఞాననేత్రం తెరుస్తానన్నారు. చలం వొప్పుకున్నాడు.

ఈశ్వరుడు తన సంగతి మానవతిగారికీ, దీక్షితులుగారికీ తెలిపి వాళ్ళని అరుణాచలానికి పిలవమన్నారు. దీక్షితులుగారి ఆరోగ్యాన్ని బాగుచేసి, ఆధ్యాత్మికసాధనలో పెడతామన్నారు.

దీక్షితులుకి రాశాడు చలం. ఆ వుత్తరాలు కనపడవు. పోయినట్టున్నాయి. దీక్షితులుగారు మొదట్లో సౌరిస్‌కి కనపడ్డది ఏదన్నా మనోభ్రమో, లేక ఆ పశుమలై స్వామి జిత్తులో అని సందేహించారు. ఆ సందేహాలు చలం తీర్చిం తరవాత, తాను భగవాన్ని నమ్మానసీ, ఇంక వేరే ఈశ్వరుడెందుకనీ అన్నారు. కాని ఒకమారు వొచ్చి చూడమని చలం అదేపనిగా బతిమాలుతున్నాడు.)

౨౧౪

అరుణాచలం
24-9-51

ఈశ్వరుడూ భగవాన్ వొకటే. ఇది భగవాన్ పిలుపే మీకు.

మీరు అనుకుంటున్న కన్న తొరగానే వొస్తారని తెలియజేయబడింది నాకు.

౨౧౫

అరుణాచలం
4–10–51

My dear Basil,

కాలం గొప్పగావుంది. నాకు కొత్త యోగసాధన చెప్పించారు ఈశ్వరుడు. సాధన చేస్తున్నాను.

మీరు రావడమే తరువాయి.

మానవతిగారూ మిత్రులూ నూజివీడునించి వొచ్చారు, ఈశ్వరుడి ఆహ్వానంపైన. నిన్ననే వెళ్ళారు. ఏమాటలాడిన, నీ మాటలేకాని. ఇంకోమాటలులేవు చెప్పటానికీ, రాయడానికీ. సూర్యనారాయణగారు వొస్తున్నామనిరాశారు. త్వరలోనే మీరూ వొస్తారు.

౨౧౬

అరుణాచలం
15–10–51

My dear Delay,

ఇంకా మీచిక్కులు బాధిస్తోనే వున్నాయా? సూర్యనారాయణ గారు భార్యాసహితంగా వొచ్చి, వారంరోజులుండి సంగతులన్నీ తెలుసుకొని వెళ్ళారు. చాలా సంగతులు చిత్రమైనవి వున్నాయి చెప్పకోడానికి. తొరగా రండి.

చాలా గట్టిసాధనలోవున్నాను.

ఈశ్వరుడు నన్ను రాయమంటే నేను మీకు రాశాను. అంతవరకే నాబాధ్యతకింద చూసుకోవాలని ప్రయత్నం.

కాని మనసు ఆగదు. దాని ప్రేమలతో అహంభావాలతో తొందరపడుతుంది. విసుక్కుంటుంది.

ఆలిస్యం కానీకండి.

౨౧౭

అరుణాచలం
22-11-51

My dear sick,

మీకార్డు. ఆవ్రాళ్ళో మీరు అట్లానే వుంటే, త్వరలో చచ్చిపోతారని తెలిపారు ఈశ్వరుడు. అందువల్ల మీకంత తీవ్రంగా రాశాను. ఇట్లా ఆలిస్యంచేసుకునికదలలేని స్థితికివస్తున్నారు మీరు. మీ పిల్లలకైనా, మీ పెన్షన్ సహాయంకూడా లేకుండా చేస్తారు మీరు, మీకు చావంటే అభ్యంతరం లేకపోయినా.

నే నెంతరాసినా మీకు నచ్చటంలేదు.

ఒక్క ఉత్తరంతో వొచ్చారు, చివుకుల నరిసింహంగారు రాజమండ్రినించి. నామాటలు నమ్మి, ఈశ్వరుడిఆజ్ఞ శిరసావహించి, ఇబ్బందుల్లోవుండికూడా వొచ్చారు. చాలా ఉపయోగమైన సలహాల్నిపొంది తిరిగి వెళ్ళారు.

కానీండి. ఏది ఎట్లాజరగాలో ఎవరు తప్పించగలరు?

చాలా గొప్పగామారుతోంది కాలం; ఈశ్వరుడి పరిపూర్ణానుగ్రహంవల్ల.

౨౧౮

అరుణాచలం
1-12-51

My dear tired,

మీఉత్తరం. ఏంరాయను? ఇక్కడ రోజురోజూ మాకళ్ళ ముందు మామధ్య జరుగుతున్న మహాత్మ్యాన్ని నిజమని ఎవరినీ నమ్మించలేకపోతున్నాను. 'ఓహో!' అంటారు, పోతారు! జ్ఞానులైనవారుకూడా! అంటే నేను తెలియజేసిన మన నలుగు రైదుగురుమిత్రులూ. నా పైని దయవల్ల ఏదో భ్రమలోపడ్డానని దిగులు పడతారు. నిజమైనసంగతి జరిగినప్పుడు ఎంతకష్టం నమ్మించడం? ఇక్కడ మాతో మాట్లాడి మమ్మన్ని ఈ యోగసాధన చేయిస్తోంది భగవాన్ ఈశ్వరుడు. భగవాన్ని ఈశ్వరు డన్నారు కాని ఎంతవరకు నమ్మారు భక్తులు! అందులో మాబోటివాళ్ళని స్వయంగా శిక్షణలో పెట్టి నడిపిస్తున్నారంటే, ఎంత అసాధ్యం నిజమనుకోవడం! ఆ పశుమలై స్వాములవారు చచ్చిపోయినారు. ఆయన అనుకోకండి. ఈశ్వరుడు పిలుస్తున్నారంటే ఎవరన్నా సందేహిస్తారా? భగవాన్ బతికివుండి, రమ్మని మీకు మా చేత కబురుపంపితే 'నా బాధ్యతలు, నా చిక్కులు, నా సంసారం' అనేవారా మీరు? మీ మనసులో కూడా భగవాన్ చచ్చిపోయినారు. వున్నా మావంటివారికి ఆయన కనపడరు. ఆయనేమిటి, యోగం నేర్పడ మేమిటి? అనుకుంటారు. నమ్మరు.

మరి ధ్యానానికి తగినట్టుగా శరీరాన్ని తయారుచేసి, కుండలిని లేపి, హృదయంలో మనస్సు లయంచెయ్యడం ఎట్లాజరుగుతుందనుకున్నారు? అదే ఇక్కడ సౌరిస్‌కి జరుగుతోంది.

కానీండి. ఇంకా ఏం రాయగలను? అవునులెండి మీారే జ్ఞానులు. మీారన్నట్టు ఏది ఎట్లా జరగాలో అట్లానే జరుగుతుంది.

చాలా గట్టిసాధన చేస్తున్నాను.

ఎన్ని ఉత్తరాలు చలం (చాలా ఉత్తరాలు లేవు పోయినట్లున్నాయి) రాసినా, దీక్షితులుగారు కదలలేదు. ఆయన చలం మాటలు ఏవీా నమ్మినట్టు లేదు.

చివరికి 1952 జనవరిలో దీక్షితులుగారు వొచ్చారు. భగవాన్ సమాధిముందు ఉజ్వలంగాఉందన్నారు ఈశ్వరుడి సంగతంతా చెప్పాడు చలం. అన్నీవొప్పుకున్నారు ఈశ్వరుడు ఆయనకి చెప్పినవి.

1 సత్యం – ఆయన వొళ్ళు నయం కావడానికి.

2 భగవాన్ సమాధిదగ్గిర కూచోడం ధ్యానంలో.

3 ఆయన వ్యవహారాలన్నీసర్దుకుని త్వరలో అరుణాచలం వొచ్చెయ్యడం.

వీటన్నిటికీ వొప్పుకుని వెళ్ళాడు, కూతుళ్ళని చూడ్డానికి మజిలీలు చేసుకుంటూ.

తెనాలి వెళ్ళగానే దీక్షితులుగారు మారిపోయి, తన కేమీా నమ్మకంలేదని రాసేశారు. ఆయన ముఖ్యమైన వాదన

పూర్వం ముక్తిపొందిన మహీనీయులు తిరిగిపుట్టరని. గొప్ప దేవతలు అవతార మెత్తినప్పుడల్లా తనతోపాటు జ్ఞానుల్ని, దేవతల్ని, పూర్వావతారాల్లోని తన భక్తుల్ని తనతో అవ తారమెత్తించుకుంటారని ఈశ్వరుడు చెప్పారు. ఈ సంగతి అన్నిపురాణాలలోనూ వుంది. వాటినే దీక్షితులుగారు ఈ నాడు శాస్త్రవిరుద్ధం అన్నారు.

ఇవన్నీ భగవాన్ చెప్పలేదన్నారు. భగవాన్ ఏవి చెప్పారు? ఇవన్నీ చెప్పడానికి రాలేదు భగవాన్. ఇవి అంద రికీ చెప్పవలసిన విషయాలు కావన్నారు ఈశ్వరుడు.

౨౧౯

అరుణాచలం
2-3-52

My deai Revolt,

మీ ఉత్తరం చూసి ఈశ్వరుడు చాలా clean revolt and reaction అని నొచ్చుకున్నారు. మిమ్మల్ని ఈశ్వరు ణ్ని ఎదురుగా కలపడంతో నాబాధ్యత తీరింది. తక్కింది ఆయనపని. ఈలోపల ఇదంతా ఆయనలీల. ఎట్లానూ తీసు కొస్తారు మిమ్మల్ని. you are doomed to get realised even in this birth. నా కా విషయం సందేహం లేదు. రాసిండి. అపత్యంచేస్తే ఏంపోయిందిలేదు, ఎన్నిజన్మాల శరీ ర మానసిక అపత్యాల్నో కడుగుతున్నారు భగవాన్. ఎంత మందినో కడిగారు. ఈ అపత్యంవల్ల ఉత్తరోత్తరా మరీకొంత కఠినపత్యం పడవలసివొస్తుంది.

ఇంక అవతారాలూ అదీ స్వల్పవిషయాలు. శాస్త్రాలూ అవీ సరిగా అర్థంచేసుకుంటే ఇవన్నీ ఏమీ విరోధాలుకావు. శాస్త్రం బాగా చదవిన నరసింహంగారు ఇవన్నీ శాస్త్రప్ర కారమే ఉన్నాయన్నారు. నారదుడు మొదలైన మహాజ్ఞా నులు లయంకాక వేఱుగాఎందుకువున్నారు? దేవతలు ఎందుకు మానవు లవుతారు? భగవాన్ చెప్పినవన్నీ సరిగా ఆలోచిం చరు. ఈ జన్మ దేవతలకి క్షణం, స్వప్నం, లీల. జ్ఞాని ఎప్పుడూ లయమయ్యేవున్నాడు. జననమూ లేదు. మరణమూ లేదు. ఆలోచన లేకండా శాస్త్రాల అక్షరాలుమాత్రం పట్టు కోడంవల్ల వొచ్చే గొడవ ఇది.

గట్టి సాధనలో పెట్టారు నన్ను.

౨౨౦

అరుణాచలం

20-5-52

My dear Norse,

మీరు పంపిన మందుతో జరం పోయింది.

(సాధన తీవ్రతకివొళ్ళు తట్టుకోలేక జరాలువొస్తున్నాయి, చలానికి. దీక్షితులుగారికి రాసి హోమియోమందు తెప్పించు కోమన్నారు ఈశ్వరుడు)

త్వరలో మళ్లీ యోగం ప్రారంభింపచేస్తారేమో! సౌరిస్ భోజనానికి తప్ప గదిలోనించి బైటికి రావడంలేదు. నన్ను విడిచిపెట్టలేదు ఈశ్వరుడు; ఈ లోపల సులభమైన ఇంకో

యోగం చేస్తోవుండమన్నారు. సౌరిస్ వుత్త మజ్జిగా అన్నం తింటోంది.

మాకో శిష్యుడు వొచ్చాడు. ఆయనకి ఈశ్వరుడు కొద్ది పత్యంతో ఆసనాలు చేయిస్తున్నారు. నయమయింది. ఆయన మనోస్థితి అదివరకు చాలా హీనస్థితిలో వుంది. ఇంక ఆయన తిరిగి ఉద్యోగంలోనికి సంసారంలోకి వెళ్ళరట. ముందు ఎట్లా బతకగలుగుతారోకూడా తెలీదు. ఏమైనాసరే వెళ్ళనం టున్నారు. భగవాన్ చూస్తానన్నారు. ఇట్లాంటివి జరుగుతు న్నాయి. ఆరువారాలలో ఆయనలో ఎంతమార్పో ! తన వొళ్ళూ మనసూ చూసి పొంగిపోతున్నాడు.

మీరూ వొస్తారు. ఆ రోజురావాలి. అన్నీ సర్దుతారు, భగవాన్. నాలో ఎంత మార్పు !

౨౨౧

ఆ రు ణా చ లం
28- -52

Dear fish-bone,

మా 'చేలా' అంటున్నారేమీరు ఆయనని ఆరేళ్ళ కిందట నేను ఆయన్ని భగవాన్ దగ్గిరికిపంపాను ! శాంతినిమ్మని నన్ను పట్టుకుంటే ఆనాటినుంచి భగవాన్‌కి అతుక్కుపోయినారు. ఇప్పుడు ప్రశ్నలేకండా ఈశ్వరుడికిఅర్పించుకున్నారు. ఆయన మా ఇంట్లోలేరు వేరే ఏర్పాట్లు చేయించారు ఈశ్వరుడు. డబ్బూకొంచెంగావుంది. కాని ఆ డబ్బువ్యవహారం కూడా మా ఖర్చువ్యవహారాలు నడిపే ఈశ్వరుడే నడుపుతున్నారు.

అవును. నాలో ఆ పెద్దలోపం వుంది. మనుషుల్లో చెడ్డే నన్ను గుచ్చుకుంటుంది. నా భావాలతో విరోధమైతే కోపం రాదు. హిపాక్రసీభరించలేను. ఆ భరించలేనిగుణము వుండ కూడదు. కాని అది నాలోపోలేదు. పోతోంది ఇప్పుడు. త్వరలో పోతుంది. కాని ఎంతవోస్చుకున్నా ఈ మనుషులు ఏంచేస్తారో మీరు తెలుసుకోలేరు. మీరు చల్లనివారు. మను షుల్నించి మంచినే చూడడమూ, మీతియ్యదనమూ చూసి నేను చాలా మెచ్చుకుంటాను.

ఈ రమణాశ్రమంలో కూడా, ఇంతదూరం మేము వొచ్చేసినా, మేము ఏమీ అనందే, నా పిల్లలమీద, మీ నా—మ్మ ఈనాటికీ చేస్తున్నప్రచారం, ఈ ఎం—డూ వాళ్ళూ ఆమెనించి నేర్చుకుని బజార్లో అందరికీచెప్పి, రోడ్ల మీద అరిపించడం – అన్నీ సాగించారు. ఇట్లా జీవితమంతా కాకండా, ఇక్కడకూడా జరుగుతోవుంటే, అప్పటికీ అణుచు కోవాలనుకోండి కాని చాతకాలేదు. మెల్లిగా ఆ వ్యవహా రంలోకూడా ఈశ్వరుడు తానేఉన్నానని ప్రతినిమిషం మాట లతో బోధిస్తున్నా పూర్తిగా బుద్ధిరాలేదు నాకు. (నేను చేసినతప్పల్లా నాలోనేను వాళ్ళని కొద్దిగంటలు ద్వేషించాను. మీతో అన్నాను.)

౨౨౨

అరుణాచలం
14-7-52

My dear Loby,

ఇక్కడికివొస్తే చిక్కులు ఎట్లాతీరతాయి? అని అడుగుతున్నారు మీరు? ఎట్లాతీరాతాయో, ముందే మనకి తెలిస్తే ఇంక మహిమ ఏముంది? మరి సమాధిమహిమలో ఇంతేనా మీవిశ్వాసం? భగవాన్‌మీదకాని, ఈశ్వరుడిమీదకాని గొప్పవిశ్వాసమేవుంటే, ఇంక జీవితంలో బాధలూ చిక్కులూ ఏమున్నాయి? ఎందుకు బాధలు పెడతారు? మనవిశ్వాసాన్ని బలంచెయ్యడానికే. సంపూర్ణ విశ్వాసం కుదరగానే ఇంక కష్టాలనేవే లేవు. ఏమీ లోతులేకండా, 'అన్నిటికీ నువ్వే' అని, మన Plans మనం వేసుకోడం కాదు. ఆయనడబ్బు ఇయ్యక పోతే, ఆవిషయంలో ఆఖర్చు ఆయనకి ఇష్టంలేదని సంతోషంగా అంగీకరించాలి. ఈశ్వరుడు మీ ఆరోగ్య విషయంలో, ఆధ్యాత్మికవిషయంలో తప్ప, ఇంక దేంటోనూ ఆయన్ని నమ్మమనలేదు. ఈశ్వరుడు చెప్పిననాడే మీరు కారం మాని వుంటే, ఈనాడు మీరు ఉప్పుకూడా వొదలుకోవలిసినస్థితి వొచ్చేది కాదు. ఇదంతా మిమ్మన్ని ఎత్తిపొడవడానికికాదు. ఇప్పటికన్నా మీరు తెలుసుకోగలరేమోనని ఆశతో రాస్తు న్నాను.

ఇక్కడ వున్నప్పుడు నమ్మారు మీరు. సందేహాలు రాలేదు. మధ్య చెప్పుడుమాటలు విని ఇట్లాఐనారు. తప్పకండా

వెంటనే రమ్మంటారు మిమ్మల్ని. అక్కడికి పరిగెత్తికెళ్ళి ఏం చెయ్యగలిగారు మీ పిల్లలకోసం? ఈశ్వరుడిలో నమ్మకం లేదుగాని, ఈశ్వరుడు పెట్టిన పత్యంమీాదా నమ్మకం? ఏం బావుంది?

మీరే ఈశ్వరుడిలో విశ్వాసాన్ని వొదలకపోతే, ఇన్ని తిప్పలు వుండేవి కావు. ఈశ్వరుడంటే మాట్లాడే భగవాన్. మీ పిల్లల చదువువిషయం భగవాన్ని సలహా అడిగేవారు కారా? ఆయన అట్లాంటివాటికి జవాబుచెప్పేవారు కారు. ఎందుకు? లోకంలో ప్రశ్నలన్నీ తన నెత్తిమీాదపడి, వృత్త గంద్రగోళం బైలుదేరుతుందని. తన జవాబుల్ని భక్తులు సరిగా అర్థంచేసుకోక చెడకొట్టుకుని, చివరికి తనని నిందిస్తారని. కాని ఇప్పు డట్లాంటి ఇబ్బంది లేదు. కొద్దిమందినితీసుకుని, వాళ్ళని తయారుచేసి, వాళ్ళద్వారా లోకాన్ని సమీపించబోతున్నారు ఈశ్వరుడు. భగవాన్‌పైన విశ్వాసం వుంచండి. తప్పక సహాయం జరుగుతుంది.

మేము ఇదివరకు నెలనెలా డబ్బుకి ఇబ్బందిపడేవాళ్ళం కాకపోయినా, ఈ కాస్తడబ్బూ అయిపోయి, అసలు ఏమీావుండనిరోజు దగ్గిరౌతోందనేభయం వుండనే ఉండేది. ఇప్పుడు భయమే లేదు. ఆ డబ్బు వ్యవహారంతో మాకేం జోక్యంలేదు. తిండిలేనిరోజో, తిండి అక్కర్లేనిరోజో ఆయనే చూసుకుంటారు.'

సాధనకి తట్టుకోలేక మళ్ళీ జ్వరం నాకు.

భగవానన్నా ఈశ్వరుడన్నా వొకటే. మీరేం భయపడకండి. విశ్వాసాన్నుంచండి.

౨౨౩

అరుణాచలం
13–10–52

My dear Bad-news,

రంగస్వామి చచ్చిపోయినాడా! నే నీవూరు వొచ్చిం తర్వాత మిత్రులు, శత్రులు గబగబా చచ్చిపోతున్నారు. మొదట వెల్లటూరుగారు, శేషాచారి, అడివి బాపిరాజు, ఇంకా కొందరు.

నేనా? నాకిప్పుడే అసలుజీవితం ప్రారంభంలాగు అనిపిస్తోంది. నా ఆరోగ్యం పూర్తిగా బాగుపడ్డది. లోపల్నించి రిప్పింగ్ ఎనర్జి వొస్తోంది. తలనొప్పులు లేవు. సాధనతీవ్రతవల్ల అప్పుడప్పుడు బద్ధకాలు వొస్తాయి మధ్యాహ్నాలు. అంతే. అసలు నాజీవితం ఇంక ముందే వుంది అనిపిస్తోంది.

విజయదశమినించి సౌరీస్ ఆహారం మానేసి తనగదిలో నే కూచుంటోంది. రోజుకి ఓసారి బైటికి వొస్తుంది. ఇప్పటికి మంచినీళ్ళే తాగుతోంది. అదికూడా త్వరలో మానేస్తుందిట.

నేనుకూడా ముందుకిసాగిపోతున్నాను చాలాత్వరత్వరగా.

మీరెట్లావున్నారో! శరీరమూ, మనసూ, వ్యవహారాలూ వగైరా.

ఈశ్వరుడు సౌరీస్ కి కనపడి తానున్నానని, పురాణాలు నిజమని, నీతులు ధర్మాలు ఉండాలని, మాంసాహారం పనికి రాదని చెపితే ఇన్నేళ్ళూ నేను నమ్మినవాటికి, రాసినవాటికి, సత్యాన్నికి, బుద్ధికి ఆయనమాటలు విరుద్ధమని ఆయనని ఈశ్వ

రుడు కాడు పొమ్మన్నానా? మీకిష్టమైన మనుషులు నా—వెం—శంకరాచార్యులవేదాంతం వీటన్నిటినీ ఈశ్వరుడు తిరిగి చేశారనేకద! మీరు ఎదురుతిరిగింది? లీలగారినీ, ఆమెఅందాన్నీ, ఆమెతో నా సంబంధాన్నీ, అంతటినీ తీసి పారేశారు ఈశ్వరుడు, ఏమీ విలువైనవి కావని. నేను కాదన్నానా? మనమనస్సుప్రకారం మాట్లాడితేనే ఈశ్వరుడా?

అదంతాసరే, ఈప్రకారం చదువులు పై చదువులు, పురుషుళ్ళు, మనమలు అంటూవుంటే ఈబాధలు ఎప్పటికి తీరడం? అట్లాంటి బాధ్యతలు లేనివాళ్ళెవరు లోకంలో! భారాలన్నీ తనమీద వెయ్యమని ఎన్నిసార్లు చెప్పారుకారు భగవాన్.

ఈశ్వరుడు మీకు నిదర్శనంచూపాలా? ఏవిధమైన నిదర్శనంచూపితే నమ్ముతారు మీరు? ఆలోచించండి. ఏనిదర్శనం చూపినా, ఆ నిదర్శనంమీద సందేహాలు రాకండా వుంటాయా? మాకు ఇంతకాలం వరసగా అనుభవంలోకి వొచ్చినవి, మాలోమార్పు, మేము చెప్పేవి, ఇవేమీ నిదర్శనాలు కావు మీకు. భగవాన్ ఏం నిదర్శనా లిచ్చారు, కలలుతప్పమీకు!

తెనాలిలో మీరందరూచేరి,ఈశ్వరుణ్ణి సారీస్‌మనస్సులో లేచినభ్రమ అని కొట్టివేశారు. భ్రమకాకండా నిజమైన దైవాలు ఎవరి కింతకన్న ఏంచేశారు? ఈశ్వరుడు చిలక్కి చెప్పినట్టు చెప్పారు. అంతా ఆయనలో విషంగా మారింది. వాళ్ళు వాళ్ళఅభ్యాయినిగురించి అల్లుకున్నవన్నీ ఈశ్వరుడు అవుసన లేదు గనక.

మీకు నామీద కోపాలు రానీండి. నిజం దాచలేను.

ఎన్నాళ్లు ఈవొంటిసాధన? అన్నారుట మీరు. ఎన్నాళ్ళు మీవొంటో బాధలు? ఈసాధనలేక మీరుసాధించిం దేమిటి? అంటున్నాను.

౨౨౮

ఆరుణాచలం
27-7-53

Ceh Laddei,

మీరుపంపే అతిథి ఈరాత్రికి వొస్తారని చూస్తున్నాను. భగవాన్ కోసము రావడమూ, మీరు పంపడమూ, ఆయనకి మావల్ల ఏలోపమూ జరగదు. ఈశ్వరుడి అనుగ్రహంవల్ల ఆయన ఇక్కడ ఉన్నంతకాలమూ ఆయన పరిచారులం.

మీరు ఎక్కువకాలం ఇక్కడ వుండలేరనుకుంటాను. నర్సాపురమే బాగాపడ్డది మీకు ఈశ్వరుడు చెప్పింది నిజం కావాలంటే, త్వరలో మీలో పెద్దమార్పు వొచ్చి తీసుకొస్తుందేమో ఇక్కడికి.

అట్లానేవున్నాం, భజనలు చేసుకుంటో.

౨౨౫

అరుణాచలం
1-10-53

Dear Andhra citizen:

ఈఉత్తరం అందేటప్పటికి పోటూగట్రా తగిలించుకున్న ఆంధ్రపౌరుడుగా వుంటారు మీరు.

మాఇంటికి వారానికి రెండుమూడుసార్లు ఒకయోగిని వొస్తోవుంటుంది. ఆమె మీరురాసిన శబరిలాగు వుంటుందను కునేవాళ్లం. ఇంతలో ఆమె అసలుపేరే శబరి అని తెలిసింది. ఆమెని ఈరెండుమూడు ఏళ్లూ మేము అవ్వయార్ అని పిలుస్తున్నాము.

మొన్న ఆమె నాతో అంది:

'వుసిరికాయలు అడివిలోదొరికితే నీకు తెచ్చి పెడతానులే' అని.

ఆమె అడువులవెంట తిరుగుతోనూ వుంటుంది.

నాకు ఉసిరికపచ్చడి అవసరమని పంపమని మీకు రాశానని మరిచిపోయినాను ఎప్పుడో నేను. 'ఉసిరికాయ లేమిటి?' అన్నాను. 'నాకు భగవాన్ కలలో కనబడి, అడివిలో వెతికి నీకు ఉసిరికాయలు తెచ్చిపెట్టమన్నారు' అంది.

మళ్ళీ ఇవాళ వొచ్చింది. ఆసంగతి ఎత్తలేదు.

ఈవిధంగా తెలుపుతో వుంటారు భగవాన్. ఎంతదగ్గిరిగా ప్రతినిమిషం మనని కనిపెట్టిచూస్తో వుంటారు తాను.

నేనే అడిగాను ఇప్పుడే ఆమెని. 'నెల్లికాయలు ఎవీ?' అని.

అంటే, వెళ్లిపోతో, ఆమె 'ఎంత వెతికినా కనపళ్లేదు. నువ్వూ భగవాన్ ఇద్దరూ పిచ్చివాళ్ళమల్లే వున్నారు. ఈ కాలంలో ఉసిరికాయలు ఎక్కడ దొరుకుతాయి?' అని నవ్వింది.

నేను ఉసిరిపచ్చడి కోరడం గమనించి, నాకోసం ఆయన అవ్వయ్యారుతో చెప్పి ఉసిరికాయలకోసం వెతికించడం నేను వొద్దంటున్నా, మీచేత ఉసిరికాయపచ్చడి నాకు పంపించడం, అట్లాంటికరుణ భగవాన్నించి ఎవరికి దొరుకుతుంది భక్తులకి కాక! లోకంలోని ఐశ్వర్యమంతా మనవొళ్లో ఆయన పోసినా, ఆయనకరుణని ఇంతగొప్పగా చూడగలమా?

మనకి ఎన్నికోరికలున్నా, ఆయనవాటిని తీర్చకపోయినా ఉసిరికాయపచ్చడికోసం నామీద ఆయనచూపిన కరుణా, నాకోసం ఆయన తీసుకున్న శ్రమ చూస్తే, మనకోర్కెలు చెల్లించకపోవడం వుపేక్షవల్ల కాదనీ, కాని ఆకోర్కెలు మనకి విషప్రాయంకావడంవల్లననీ – తెలియటంలేదా?

నేను మీకు పచ్చడీపంపమని సోమరిగా రాశాను. అంత కావలసి కాదు. మీ రంత పట్టుపట్టి పంపడానికీ వెంకటచలం గారు తీసుకున్న శ్రద్ధకీ, ఇప్పుడే అర్థమొచ్చింది.

ఇక్కడ ఉసిరికాయలు ఈ ఏడు రాలేదు. పచ్చడీ అయిపోయింది. మీరువొస్తున్నారనుకుని, తెచ్చిపెట్టమన్నాను. పచ్చళ్ళమీది పూర్వపు రుచుల్ని నాలిక ఇంకామరిచిపోలేక, ఏడుస్తోవుంటుంది. ఎవరన్నా ఇటువొస్తామంటేచాలు, ఏం తెప్పించుకుందామా అని ఆశపడడం బాగా అలవాటయిపోయింది.

౨౨౮

అరుణాచలం
1953

Dear Lumbago,

అవును. మీకోసం చాలా చూశాం, రుక్మిణీనాథశాస్త్రి గారితో కలిసి.

మీ కెప్పుడూ భగవాన్ kick ఇవ్వరు. అది వుత్తపరీక్ష, పాఠం. మద్రాసులో మీకుజబ్బుచేస్తే, భయపడి, భయపడి అంతదూరం, నర్సాపురంవెళ్ళారా. మీకోసం చాచివున్నభగవాన్ చేతుల్లోకి ఉరకకూడదా? ఆవిశ్వాసం లేకపోయిందా? పోనీమనుషులరూపంలో మమ్మల్ని ఇక్కడ పెట్టివుంచారు మీ సదుపాయంకోసం అని ఎన్నిసార్లు రాయలేదు నేను? భగవాన్ కన్న మిమ్మల్ని ఎవరు ఆదరిస్తారు? ఎవరు కుదురుస్తారు.

అరుణాచలానికే అని మీరుబైలు దేరినప్పుడుఇదివరకంతా ఎంతభద్రంగా సుఖంగాతీసుకొచ్చారు మిమ్మల్ని. ఇవన్నీ మీకు తెలియనిసంగతులు కావు. అన్నీ మొదట్లో మీరు నాకు బోధించినవే.

అవును గొప్పగా వున్నాము. శాంతీ, ఆనందం నృత్యం చేస్తున్నాయి మా చుట్టూ. అవి ఎప్పుడు ముడుచుకున్న హృదయాల్ని భేదించుకుని లోపల ప్రవేశించి నింపేస్తాయా అని ఎదురుచూస్తో. ఒక్కొక్కరోజు అనేక రకాలవారు వొస్తారు భజనలకి. మొన్న కన్నడం, ఇంగ్లీషు, సంస్కృతం, అరవం, తెలుగు, హిందీ, అస్సామీజ్ భాషలో భగవాన్

నామకీర్తన జరిగింది ఇక్కడ. రాజయ్యర్‌గారు విఠల్ భజనతో నృత్యంచేశారు.

ఇన్ని జరుగుతోవున్నా, మీరులేని లోటు కనపడుతూ నేవుంటుంది. ఎట్లాగో, ఏమి ఖర్మమో, మీకి వాతావరణం సరిపడ్డది కాదు.

మీరు ప్రయాణం చెయ్యలేరా? అరుణాచలానికి భగవాన్ దగ్గిరికి అని బయలుదేరండి. మీ డయేరియా, లంబాగో ఎట్లా అడ్డుపడతాయో చూద్దాం. కాని ఇంతా ఇక్కడికివచ్చి, మీరు వుండలేరు. అది ఇంకా మాయంకాని మన అహం. దానితో పోట్లాడి, దాన్ని అణిచి, నిదానించి ఇక్కడ వుండాలిమరి! అప్పుడే మనభక్తి. నేను మీకు ఈ మాటలు రాయడం నాకు సిగ్గవుతోంది.

పోనీ, మీరు విశ్వసించలేనివారు కారు. సమాధిలో భగవాన్ వెలుగుతున్నారని తెలుసు మీకు. 'ఎక్కడికి వెడతాను? ఇక్కడే వుంటాను' అన్న భగవాన్‌మాటలు అక్షరాలా నిజమైనాయని చూశారు. ఆయన అక్కడా ఎన్నో నిదర్శనాలు మీకు చూపుతోనే వున్నారు. ఇన్ని అయినా మీరింకా సంశయిస్తే ఎట్లా! భగవాన్ ఎన్నడూ అనలేదు, మన ప్రయత్నం అక్కర్లేదని దేనికీ. అన్నిటికోసం ప్రయత్నాలూ, శ్రమలూ పడుతో, ఇక్కడికి రావడానికీ, ఇక్కడ వుండడానికేనా, ప్రయత్నమనేది కూడకపోయింది!

భగవాన్ని వొదిలి ఎట్లా వుండగలుగుతున్నారు?

ఏంఫరవాలేదు. భగవాన్ త్వరలోనే తీసుకువొచ్చుకుంటారు మిమ్మల్ని ఇక్కడికి.

౨౨౭

అరుణాచలం
1954

My dear Ruswrreeted,

మీ కార్డు అప్పుడే అందింది. ఆ కార్డు అందిన మర్నాడే ఓ మిత్రుడు దీక్షితులుగారు వచ్చిపోయినారా, తెలుపమని వ్రాసేరు. హడిలిపోయినాను. మీరు నా కా కార్డు రాసిన కాసేపటికే చచ్చిపోయినారు గావును అని. ఎట్లా నమ్మను, నాకు కొంచెమన్నా తెలియచెయ్యకుండా మానించి వెళ్ళిపోయినారంటే! ఇంక మిమ్మల్ని చూడననుకుంటే, ఎంత ఆపుకున్నా దిగులు పోయిందికాదు. ఆరోజంతా, అంతా గ్లూమీ అయిపోయింది. ఎట్లా తెలుస్తుంది? తెలిసి చేసే దేముంది? సాయంత్రానికి కొంత కుదటపడ్డాను చచ్చిపోవడం జరిగి వుండదని.

కాని మీ కా జబ్బు! ఈనాడు కాకపోతేనేం! మీరు రాసిన మీ జబ్బులజాబితా చూస్తేనే భయంకన్నా దిగులు ఎక్కువయింది. ఎట్లా వోర్చుకుంటున్నారు? పైగా వొంట! వొంటరిగా!

మేము చెపుతున్న నివారణ మీకు అవిశ్వాసపాత్రమయింది, మూడేళ్ళమట్టి – మేము అచంచల విశ్వాసంతో

నమ్ముతున్నది! ఏం చెయ్యను? ఇక్కడికి రాకపోతే చచ్చిపోతారన్న ఈశ్వరుడి మాటలు జ్ఞాపకమున్నాయా?

మొన్న సూ———గార్ని అడిగాను. 'దీక్షితులు గారి ప్రాణానికి మీ ప్రాణం అడ్డం వేస్తానన్నారు కదా? చూశారండి, దీక్షితులుగారు ఎట్లా ఐనారో? మీరు రిప్లుకు మీ ప్రాణాన్ని అడ్డంవెయ్యండి' అని. పోనీ మీ ప్రాణం పోకపోయినా, బాధైనా తప్పలేదుకదా! ఏం చేశారు సూ———గారు? ఆయనే ఆత్మహత్య చేసుకుంటూనే గతికి దిగజారి కూచున్నారు. 'మీరేనా? ఇంకో ప్రాణాన్ని నిలపెట్టేది? కానీండి. నిలబెట్టండి' అన్నాను. మీ వంటి స్నేహితుల్ని, భక్తుల్ని, మానించి దూరంగా అట్లా తప్పుదోవలో పెట్టి చావుకి వొదిలితే, ఎట్లా ఊరుకోగలను నేను? అనేశాను. ఆయన మాట్లాడలేదు.

ఆయన మాతో చెప్పినమాటలవల్ల తెలిసింది, మీకు మా మాటల్లో విశ్వాసముపోవడమే కాదు, విరోధం ఏర్పడిందని, ఆయనకు మళ్లీనే.

ఇన్నేళ్ళూ వూరుకున్నాను, కాని సంగతులు ఇంతవరకు వొచ్చాక ఇంక వూరుకోలేక రాస్తున్నాను. పోనీ, ఏమీ వొద్దు. మా మాటల్లో నమ్మకం వొద్దు. ఎవరో బాగు చెయ్యలేని, జీర్ణించిన నా తలనెప్పుల్ని, జబ్బుల్ని ఏమందూ లేకుండా బాగుచేశారు ఈశ్వరుడు. మీ ఆరోగ్యాన్ని బాగుచేస్తారు.

మీరు చచ్చిపోయినారంటే ఆ రోజల్లా, మేమందరం, తిండి సరిగా తినలేదు.

భగవాన్‌లో విశ్వసించండి పోనీ. ఆయనతో గడపడానికి రండి.

మీరు అట్లా వెళ్ళిపోయిం తరువాత ఈశ్వరుడు మీ సంగతే వాదులుకున్నారు. ఇవాళ నేను బతిమాలితే, విభూది ఇచ్చారు. దీంతో మీరు కొంతైనా తేరుకొంటారు. ఆ తేరు కోడాన్ని, ఏ హోమియోపతికో, జాతకానికో ఆరోపించు కోక, వెంటనే రండి ఇక్కడికి. రక్షణకి భగవాన్ ఉన్నారు. సేవకి మే మున్నాము. భార మనుకోకండి మాకు. మీ వంటి వారి సేవ (మిత్రత్వ మట్లా వుంచి) ఈశ్వర సేవ. ఆ తెనాలిలో ఆగకండి. అది మీ పాలిటికి వైతరణి అయింది.

(ఈ నాటక మీ వల్ల) భక్తులూ జ్ఞానులూ రాకూడని క్షేత్రమై పోయింది తిరువన్నామలై. అన్నీ అడిగేశాను సూ————గారిని. బదులు లేదు. ఇంతకన్న నే నేం రాయ గలను!

తక్కింది ఈశ్వరేచ్ఛ.

ప్రతిదీ ఎంతో విశ్వసించే మీరు, ఇంత స్నేహితుల్ని మమ్మల్నీ ఈశ్వరుణ్ణీ సందేహిస్తున్నారంటే, కర్మతప్ప ఇంకే మనుకోవాలి! ఎవరిమాటూవినని మీరు ఈనాడు లొంగి పోయినారంటే!

రెండురోజులయింది మీ అబ్బాయి వెళ్ళి. అతన్నిచూస్తే అటువంటి పిల్లలు వుండడం మీ రెంత అదృష్టవంతులా అని పించింది.

మీ అందరికీ భగవాన్ ఆశీర్వచనాలు.

౨౨౮

అరుణాచలం
14-1-54

Dear Revered,

అవును భగవాన్ అనుగ్రహం నిస్సంశయంగా మీపైన వుంది. లేదనుకుంటారు మీరు. అది మీ లీల. లేదనుకునేట్లు మీకు అనిపించేట్లు చెయ్యడం ఆయనలీల. అదే విరహం' ఈశ్వరీప్రేమలో ముఖ్యమైనభాగం.

ఇదివరకంతా నేను కవిత్వ మనుకున్నదీ, ఎక్కడో వున్నాయో లేదో వాస్తవంగా అని అనుమానపడ్డవీ, ఇప్పుడు నా అనుభవంలోకి వొచ్చాయి. భగవాన్ మాతో చెప్పారు మీతో వున్నానని సందేహించకండి.

Ford man ఇక్కడవున్నారు. ఆయనని భగవాన్ పోకిరీ స్వామి అనేవారట.

౨౨౯

అరుణాచలం
31-5-54

Dear despir,

నాకు- నాకేకాదు- రుక్మిణీనాథశాస్త్రిగారికీ మీ మీద ప్రేమ అని ఇప్పటికి కనుక్కున్నారా? మాకే కాదు,

మిమ్మల్ని ఎరిగినవారిలో మీమీద ప్రేమలేనివా రున్నారా? అనుకుంటాను.

భగవాన్ అనుగ్రహం మీపైని పూర్తిగావుంది. మీరు నిరాశపడకండి. మీకు గొప్ప భవిష్యత్తు వుంది. అది మీ పైన రమణానుగ్రహం. ఎట్లా తప్పించుకోగలరు?

# చలం రచనలు

| | | | |
|---|---|---|---|
| మ్యూజింగ్స్ 3 భాగాలు | వ్యాసాలు | 9 | 0 |
| ప్రేమలేఖలు 2 భాగాలు | ,, | 4 | 0 |
| చలం ఉత్తరాలు | ,, | 4 | 0 |
| స్త్రీ | ,, | 3 | 0 |
| బిడ్డల శిక్షణ | ,, | 2 | 8 |
| ఆనందం | ,, | 1 | 4 |
| విషాదం | ,, | 1 | 8 |
| దైవమిచ్చిన భార్య | నవల | 1 | 4 |
| జీవితాదర్శం | ,, | 1 | 4 |
| హంపీకన్యలు | ,, | 1 | 4 |
| అరుణ | ,, | 1 | 0 |
| అమీనా | ,, | 1 | 0 |
| మైదానం | ,, | 1 | 0 |
| వివాహం | ,, | 1 | 0 |
| బ్రాహ్మణీకం | ,, | 1 | 0 |
| విడాకులు | నాటకం | 1 | 8 |
| మంగమ్మ | ,, | 1 | 8 |
| త్యాగం | ,, | 1 | 8 |
| పురూరవ | ,, | 1 | 8 |
| శశాంక | ,, | 1 | 8 |
| చిత్రాంగి | ,, | 1 | 8 |

| | | | |
|---|---|---|---|
| కొండడు | నాటికలు | 1 | 8 |
| సత్యక, శివం, సుందరం | ,, | 1 | 8 |
| పద్మరాణి | ,, | 1 | 8 |
| హరిశ్చంద్ర | ,, | 1 | 8 |
| సావిత్రి | ,, | 1 | 8 |
| చుక్కమ్మ | కథలు | 2 | 8 |
| ఓపువ్వు పూసింది | ,, | 1 | 8 |
| కళ్యాణి | ,, | 1 | 8 |
| పాపం | ,, | 1 | 8 |
| కర్మమిట్లా కాలింది | ,, | 1 | 8 |
| కన్నీటి కాలువ | ,, | 1 | 8 |
| వంటింట్లో భగవాన్ | ,, | 1 | 0 |
| చలం సంపుటాలు : | | | |
| చలం నవలలు : | 2 భాగాలు | | |
| | భా 1కి | 5 | 0 |
| చలం వ్యాసాలు : | 5 భాగాలు | | |
| | భా 1కి | 5 | 0 |
| చలం లేఖలు : | 1 భా 1కి | 5 | 0 |
| చలం కథలు | 4 భాగాలు | 5 | 0 |
| చలం నాటికలు | 4 భాగాలు | 5 | 0 |

వివరాలకు :

**దేశికవితా మండలి, విజయవాడ-2.**